శ్రీరామచంద్రః

# శివపురాణము

## ధర్మసంహిత

### దానప్రశంస

సత్పాత్రులకుఁ బ్రశస్తంబు లగుమహాదానములం గావించువారు తరింపఁగలరు. గోభూహిరణ్యాదానములు పవిత్రములైనవి. వాని నిచ్చువారును గైకొన్నవారునుగూడఁ దరింపఁగలరు. శ్రేష్ఠంబు లగు దానము లన్నియును పాపనాశకరంబులు. ప్రసిద్ధంబులగుగోభూవిద్యాదానంబులు మూఁడును దుల్యములైనవే కాని యందు విద్యాదాన మధికఫలప్రద మైనది. వృషభములను, గోవులను, వస్త్రములను, పాదరక్షలను నిత్యమును దానముచేయవచ్చును. అర్థులకువారికన్నపానముల నొసంగవలయును. దారిద్ర్యముచేఁ బీడితుం డగువ్యక్తికి దానము చేయువాఁడు సర్వసౌభాగ్యవంతుఁ డగును. అసూయారహితుండై శ్రద్ధాపూర్వకంబుగ దానముచేయుట సకలయజ్ఞంబులకంటెను శ్రేష్ఠయజ్ఞం బగుచున్నది. బుద్ధిమంతుఁ డగువాఁ డెప్పుడు నీయజ్ఞమును జేయుచుండవలయును.

లగు నాపత్సమయములందుఁగాని పరిగ్రహింపరాదు. మృతశయ్యాదానము, కృష్ణాజినదానము, పుణ్యమును గైకొనుటకై చేయుపాపదానము, చండాలదానము, పతితదానము, మ్లేచ్ఛదానము, ఉభయతోముఖగోదానము, తులారోహణదానము, కురుక్షేత్రంబునఁ గావించు దానము, కృష్ణతిలదానము ననునీపదియును ఘోరదానంబులుగావునఁ బరిగ్రహణీయంబులుగావు. బుద్ధిహీనుం డగుబ్రాహ్మణుండు లోభవశంబున నీనిలో దేనిని బరిగ్రహించినను నరకపతితుం డగును. ఇట్టి ఘోరదానంబులు చేయువారు బురదలోనిపాదములను శిలాఫలకంబుపై నుంచునట్లే తమపాపంబుల నన్నిటిని దానమును బరిగ్రహించిన యాతనిపైఁ బెట్టి తాముత్తమలోకగతు లగుదురు. మహాఘోరంబులగునిట్టిదానములను బ్రతిగ్రహించువారు సద్గతికాముకులైనచో నట్టి ద్రవ్యమునంతను దానము చేసివేయవలయును. అట్లుచేయుట కశక్తులైనచో నట్టిద్రవ్యంబునం దర్ధభాగంబునైనను ధర్మకార్యంబులకొఱకు వినియోగింపవలయును. ఇట్లు చేసిన వారును బాపముక్తులై పవిత్రగతులగుదురు.

కాంచనదానము, శ్వేతతిలదానము, గజదానము, దాసీదానము, గృహదానము, రథదానము, అశ్వదానము, భూదానము, కన్యాదానము, గోదానము ననునీపదియును మహాదానములు. ఈదానములను బ్రతిగ్రహించువాఁడు దాత నుద్ధరించుటయే కాక తానును తరింపఁగలఁడు. దానములలో సువర్ణము ప్రధానమైనది. దక్షిణలందుఁగూడ నదియే ప్రశస్తమైనది. స్వర్ణదానముకంటెఁ బవిత్రం బగునదియు, శ్రేయోదాయకం బగునదియు మఱియొకటిలేదు. నూఱుపాపంబులు చేసినవాఁడైనను సత్పాత్రునకు స్వర్ణదానంబు చేసినచోఁ

బునందుఁ బూర్వజన్మమునను, పరంబునను గూడ దశపురుషులవ

అకుర నుద్ధరింపఁగలఁడు. విశుద్ధచిత్తముతో స్వర్ణదానము చేయువారికి సకలదేవతలును సకలసౌభాగ్యములను బ్రసాదింతురు. కనకదానము చేయుట సకలదేవతలను దానతృప్తులఁ గావించిన ట్లగుచున్నది. అగ్ని సర్వదేవతాస్వరూపుఁడు. కాంచన మగ్నిస్వరూపము. కావుననే హుతాశనాభావసమయమునందు వేదప్రమాణజ్ఞులగు మహాత్ములు కాంచనమును స్థాపించి కర్మంబులం దీర్చుచుందురు. స్వర్ణస్పర్శంబునలను నపవిత్రంబులగు వస్తువులన్నియును విశుద్ధంబు లగుచున్నవి. సువర్ణము దేవపితృగణంబులకును మానవులకునుగూడ సర్వదా ప్రియమైనది. సకలపదార్థములను బరిశుద్ధంబులుగఁ జేయు జలముగూడ బంగారముచేఁ బవిత్రంబగుచున్నది. కావున నగ్నిసంభవం బగు హేమము సకలవస్తువులకంటెను బవిత్రమైనది. ప్రాతఃకాలంబునఁ బ్రజ్వలితానలంబున హోమంబు గావించి ప్రతిదినంబును స్వర్ణదానము చేయువారికి సకలాభీష్టంబులును సిద్ధించును. సకలదానఫలంబులును స్వర్ణదానముచే లభించును గావున స్వర్ణమే సకలస్వర్గసుఖభోగసంధాయకమైనది. స్వర్ణదాతయగు మానవోత్తముఁడు ప్రభాకరతుల్యంబై ప్రభావంతంబును, నప్సరోగణపరివేష్టితంబును, గంధర్వగానసమంచితంబును, హంసవాహనయుతంబును, మనోవేగసంపన్నంబు నగు దివ్యవిమానము నధిరోహించి దివ్యమాల్యానులేపనాదినానాభోగంబు లనుభవించుచును స్వర్గలోకంబున యథేచ్ఛావిహారంబు సేయుచుండును. కావున మానవులు శక్తికొలఁదిగ స్వర్ణదానము చేయవలెను. ఇంతకంటెఁ బాపమోచనంబున కెట్టియుపాయమును లేదు. పవిత్రహృదయముతో సువర్ణదానము చేయువారు బహుసహస్రవర్షంబులు స్వర్గభోగము లనుభవింపఁగలరు.

అని సనత్కుమారుండు చెప్పుటయు వ్యాసుండు మరల నిట్లు

ప్రశ్నించెను దేవర్షి శేఖరా! నీవు లోకమంగళకరంబులును, ప్రశస్తం బులు నగువివిధధర్మంబులంగూర్చి కీర్తించియుంటివి. మఱియు భూదానంబునుగూర్చి యించుక తెలుపవలయును. ఏదానము స్వల్పంబుగఁ జేసినను మండలాధిపత్యమును, వివిధభోగంబులును, ఇహపరసుఖంబులును లభించునో మానవు లేదానంబువలన సంపల్లాభముం గాంతురో యాదానముంగూర్చి ప్రశంసింపవలయును.

## — పృథుచక్రవర్తి పూర్వచరితము —

సనత్కుమారుం డిట్లు చెప్పఁదొడంగెను. మునివరేణ్యా! పుణ్యసమయములం దుత్తమపాత్రంబులయందు నివేదితంబులగుసకల దానములును మహాఫలదంబులే యగును. అందుత్తమదానంబునుగూర్చి పురాతనేతిహాసమును దెలిపెద నాకర్ణింపుము. పూర్వకాలంబునఁ జిత్రరథుం డనునొకరాజు గలఁడు. ఆతఁడు సప్తద్వీపములకు నధీశ్వరుండై సకలభోగంబుల ననుభవించుచుండెను.

ఒకప్పు డమ్మహారాజు దివ్యరథారూఢుండై ససైన్యంబుగ నాకపురంబునకుం బోయి తన బాహుబలంబుచే సకలదేవతాసహితంబుగ శతమఖుని నిర్జించి స్వర్గంబునందుఁగూడఁ దనశాసనమును వ్యాపింపఁ జేసెను. ఆతఁ డిట్లు సచరాచరం బగుత్రైలోక్యమును బాలించుచుఁ దనరాజ్యమును, దనయైశ్వర్యమును గాంచి తానే విస్మితుం డగుచుండెను. ఆతని కాఱువేలమందితనయు లుండిరి. ఆతనికోశాగారమున ధనం బక్షయమై యుండెను. ప్రజలందఱు నారాజునెడల ననురక్తులై యుండిరి. ఆతని కనేకంబులగు నుత్తమవాహనంబులును జనపదంబులును నుండెను. రాజ్యమునందంతటను నిత్యప్రజాభివృద్ధియే కాని యకాలమరణము లెందును లేకుండెను. ఆనృపాలునిరాణి సౌభాగ్యవతియు సౌంద

ర్యవతియునై యుండెను. ఈ వైభవమంతయుం జూచుకొని యాతఁడు "పూర్వజన్మంబున నేను గావించినధర్మకార్యముల బలమువలననే నాకిట్టియైశ్వర్యము లభించినది. ఇప్పు డెట్టిధర్మాచరణంబు గావించి నచో నుత్తరజన్మంబునఁగూడ మరల నిట్టిసంపద లభించునో మహర్షులవలనఁ దెలిసికొని యట్టిధర్మకర్మంబు లాచరించెదను." అని నిశ్చయించుకొని వసిష్ఠమునీంద్రుని సందర్శించి "మహాత్మా! నాకీభూమండలంబున నవ్యాహతం బగునధికారమును, అప్రతిమం బగురూపమును, సుందరీమణియగు దేవియు, శరీరమునం దారోగ్యమును, ఐశ్వర్యమును, అసాధారణశక్తియు, అన్నపానాదులయందు సామర్థ్యమును సమస్తమునులభించియున్నవి. ఎందును నాకెట్టిలోపంబును లేదు. గజసహస్రబలుండనై సకలశత్రువినాశనముం గావించితిని. నాకు సత్సంతానము లభించినది. భృత్యులెల్లరును నాయెడల విధేయులై, ప్రజలందఱు ననురక్తులై యున్నారు. నాయందు భూపరిపాలనశక్తి సంపూర్ణమై యున్నది. నేను తలఁచుకొన్నచో నెట్టికార్యమునైనను గావింపఁగలను. నేనెట్టిధర్మలోపంబును జేయుట లేదు. నాపూర్వజన్మసుకృతమువలననే యివియన్నియు లభించినవని భావించుచున్నాను. పూర్వమున నేనెట్టిధర్మకార్యములం గావించితినో యానతీయవలయును" అని ప్రార్థించెను.

ఆరాజేంద్రునివచనంబులకును, ధర్మాసక్తికిని వసిష్ఠమునీంద్రుండు సంతుష్టుండై యిట్లు చెప్పందొడంగెను. మహారాజా! భూలోకంబున మధ్యదేశంబునం దవంతినామకంబగునగరంబు గలదు. పూర్వమాపట్టణమును ధర్మశాసకుం డగుధర్మపాలుండను రాజు పరిపాలించుచుండెను. అప్పుడు నీవు నికృష్టంబగు నొకకులంబున జన్మించి యాపురంబున వసించుచుంటివి. ఇట్లుండ నారాజ్యంబున బహువర్షంబుల

వఱకు ననావృష్టి యగుటచే దుర్భిక్షంబు తటస్థించుటయు నితరజనం బులతోఁగూడ నీవాపురంబును బరిత్యజించి వనంబునఁ బ్రవేశించి భార్యాసహితంబుగ నందు జీవించుచుంటివి. క్రమముగా భూమండల మంతయు నిరన్నం బైపోయెను. వనంబులును మూలఫలశూన్యంబు లైపోయెను. ఇట్టియవస్థలో నీవును నీభార్యయును క్షుద్బాధకు సహిం పఁజాలక కట్టెల నమ్ముకొనువృత్తిచే నెట్లో పొట్టపోసికొనుచుంటిరి.

ఒకనాఁడు మీరిరువురును గట్టెలమోపుల నెత్తుకొని నగరం బును జేరి వానిని విక్రయించుటకై యింటింటికిని దిరిగితిరి. కాని కొను వా రెవ్వరును లేకపోయిరి. ఆకలిబాధకుఁ దాళఁజాలకుండియు మీ రట్లే సాయంకాలమువఱకు నగరమంతటను బరిభ్రమించుచునే యుం టిరి. క్రమముగా మీరొకవర్తకునిమందిరముకడకుం బోయితిరి. అచ్చ టఁ గొందఱుబ్రాహ్మణులు మంత్రపాఠము చేయుచు హోమములు చేయుచుండిరి. అది యంతయుం జూచుచుఁ జలి యగుచుండుటచేఁ గొన్నికఱ్ఱలను మంటవైచుకొని యాబాధఁ దీర్చుకొనుచు మీరిరు వురు నాసమీపమునఁ గూర్చుండి యుంటిరి. ఆనాఁడు మాఘపూ ర్ణిమ. చంద్రగ్రహణముగూడ నైయుండెను.

అప్పు డావణిగ్వరుం డుపవాసంబుచేసి భక్తిశ్రద్ధలతో విష్ణుదే వుని బూజించి నూఱుపలంబులస్వర్ణమయం బగుభూమి నాపుణ్యసమ యంబునఁ బుణ్యపురుషుం డగుసత్పాత్రునకు దానము గావించెను. ఓరాజా! పూర్వజన్మంబునఁ జండాలుఁడవై యున్ననీవును నీసతియును గూడ నత్యుత్తమం బగుస్వర్ణభూదానము చేయుచున్న వర్తకునిం గాంచి సంతప్తహృదయంబులతో “ అయ్యో! నిరుపేదల మగుమన మెట్టిపు ణ్యకార్యమును జేయఁజాలకుంటిమిగదా! పూర్వజన్మమునందిట్టిధర్మ మును గావింపకుండుటచేతనే మనకిట్టిగతి గలిగినది. ఉత్తరజన్మమునఁ

గూడ మనకింతే కాఁబోలును.” అనివిచారించితిరి. ఆధర్మపరితాపఫలంబువలననే మీకీజన్మమునం దిట్టియభ్యుదయము లభించినది. కావున నీవీజన్మమునం దుత్తమదానంబులఁ గావింపుము. అందువలన నీకు దేవదుర్లభంబు లగునక్షయఫలంబులు సిద్ధింపఁగలవు. నీపూర్వచరిత్రమును వినిపించితినిగదా! నీవును సర్వకామదం బగుభూదానమును జేయుము. భూదాతల కెన్నఁటికిని స్వర్గచ్యుతి గలుగదు. స్వర్ణగోదానము చేయుచుండ నాసక్తితోఁ చూచువారుగూడఁ బాపవిముక్తులై యుత్తమగతుల నందుదురు. రాజేంద్రా! నీకు శుభ మగుఁగాక! పర్వతద్వీపమయంబగుభూమిని దానము చేయుచుండఁగాఁ గాంచి తాము దానము చేయవలయు నని సంకల్పించుకొనువారు గూడ నట్లు చేయఁజాలకున్నను దానఫలంబు నందుదురు.

పూర్వకాలంబున మహాబలసంపన్నుండగు పృథుసార్వభౌముండు దేవమానవదానవసహితం బగుభూమండలం బంతయును బరిపాలించుచుండెను. ఆచక్రవర్తిని భూమండలమున మహర్షులును, స్వర్గంబున దేవగంధర్వాదులును బాతాళంబున దానవోరగాదులును గీర్తించుచుండిరి. ఆతఁడు దయతో నొసంగినదానివలననే తక్కినరాజులందఱును జీవించుచుండిరి. సూర్యోదయము మొదలుగ నస్తమయంబువఱకునుగల త్రిభువనంబులయందు నాతనిరాజ్యము వ్యాపించియుండెను. సర్వరత్నమయంబును, సప్తద్వీపసమంచితము నగుభూమండలము నాతఁడు ధర్మయుక్తముగఁ బరిపాలించుచుండెను. ఆతనిరాజ్యమునం దెందును నధర్మమనునది లేకుండెను. ప్రజలలో నన్యాయపరులు, తస్కరులు మొదలగుదుష్కర్ములు లేకయుండిరి. ఆతని ధర్మపాలనమువలన రాజ్యమంతయు నీతిబాధావిరహితమై యుండెను. ఆసచ్చరిత్రుఁ డతనధనుష్కోటిచే భూమండలంబు సుసమంబుగనొనరించెను.

ఆయుదారచరితుని బలోత్సాహరూపగుణాదులం గాంచి యూ తనిదేవి విస్మయావిష్టహృదయయై ''స్వామీ! పూర్వజన్మంబున మన ము గావించిన సత్కర్మంబులవలననే మనకిట్టియైశ్వర్యము లభించి నది. ఇంక నుత్తరజన్మంబునఁగూడ నిట్లుసిద్ధించుటకుఁ దగినయుపాయ మాలోచింపవలయును. అని ప్రార్థించెను. పృథుచక్రవర్తి యామా ట లాలించి యానందించి యందుల కేమి చేయవలయునో నిశ్చయిం పఁజాలక యొకనాఁడు వేదవిదులగు బ్రాహ్మణులను బిలిపించి వారికిఁ బ్రణామాదిసత్కారంబులం గావించి సభాసీనులం జేసి వినయమధుర స్వరంబుతో "మునిపుంగవులారా! మీకు నాయెడల ననుగ్ర హంబు గలదేని నాయడిగినప్రశ్నంబునకు సదుత్తరంబు నీయవల యును. మీరు సుప్రసన్నులై యున్నారు. కావున నాప్రార్థనమును చెల్లింపవలయును.

అని ప్రార్థించుటయు మునులు పరమానందభరితులై మహా రాజా! నీమనంబునఁ గలిగిన సంశయం బేదియో తెలుపుము. మేము దానికిఁ దగినప్రత్యుత్తరం బీయఁగలము. నీధర్మపరిపాలనంబునకు మేము సంతుష్టులమైతిమి. సంతుష్టుండగుబ్రాహ్మణుఁడు సంశయవిచ్ఛే దంబును, హితోపదేశంబును, అహితనివర్తనంబును గావించి కాని భుజింపఁడు. అని యానతిచ్చుటయు పృథుసార్వభౌముండు ''ముని వరులారా! నేనును, నాయిల్లాలును బూర్వజన్మంబునం దెట్టిసుకృ తంబు గావించుటచే మాకీదుర్లభంబగు వైభవము లభించినది? త్రిభు వనంబులయందు సప్రతిహతు లగుసకలభూపాలురును నాకు వశీభూతు లైయున్నారు. అనంతం బగుకోశంబును, అసమానం బగుబలంబును, అసాధారణం బగునారోగ్యంబును నాకు లభించియున్నవి. నాతేజము దేవతలకుఁగూడ దుర్నిరీక్ష్యమైయున్నది. నాగృహిణియు రూపగుణం

ములచేఁ ద్రిలోకసుందరీమణులను మించి యున్నది. ఇట్టినేను నాపూర్వచరితము వినఁగోరుచున్నాను. ఏసత్కర్మంబుచే మాకిట్టియుత్తమ జీవితము లభించినదో దయయుంచి యానతీయవలయును.

అని ప్రార్థించుటయు మునులందఱు నాలోచించి యాసార్వభౌముని ప్రశ్నకుఁ బ్రత్యుత్తరం బిచ్చుటకై మరీచిని నియోగించిరి. ప్రజాపతినందనుండును, ధర్మజ్ఞుండు నగుమరీచి చాలసేపటివఱకు యోగదృష్టినిమగ్నుండై యుండి సర్వంబును గ్రహించి మహారాజుం గాంచి మృదుమధురస్వరముతో "ఓసార్వభౌమా! నీవు పూర్వజన్మంబున శూద్రకులంబున జన్మించి పరహింసాపరాయణుండవై కాలము గడపుచుంటివి. నీభార్య యగునీమె పతివ్రతాశిరోమణియై నిత్యమును నీయిచ్చవచ్చినరీతిని మెలంగుచు నీకు శుశ్రూషఁగావించుచుండెను. క్రమముగా నీవు నిర్ధనుండవై పరులయింటఁ గూలిపనులు చేసికొనుచు జీవించుచుంటివి. అన్నవస్త్రముల నోసంగఁజాలక నీవెంత త్రోసివైచుచున్నను, నీసతిమాత్రము నిన్నుఁ ద్యజింపక నీసేవ సేయుచునే యుండెను.

ఇట్లుండ నొకప్పు డొకవృషలుం డయోధ్యానగరంబున విష్ణుమందిరంబున స్వర్ణభూదానముం గావింప సంకల్పించి యుస్వామిని నీచేమోయించి యటకుఁ దీసికొనిపోయెను. అప్పుడు నీవును నీభార్యయుఁగూడ నవ్విష్ణుమందిరంబును సమ్మార్జనాదిక్రియలచే విశుద్ధంబు గావించితిరి. ధర్మపరుం డగునట్టిదాతకుఁ బరిచర్యలం గావించుటచేతనే నీపాపములన్నియును నశించినవి. ఆదాత స్వర్ణభూదానము చేయుచుండ నాసక్తితోఁ దిలకించుటవలన నీకీజన్మమున నింతటి మహత్త్వము లభించినది. ఇట్టిచో నంతటిమహాదానముం గావించినదాత కెట్టిఫలంబు లభించునో యెవ్వరు చెప్పఁగలరు? అట్టిమహాదాత ...

వంశంబునఁ బూర్వులను నూర్వురను, బరులనునూర్వురనుగూడ నుద్ధరింపఁగలఁడు. ఆపుణ్యపురుషుఁడు సూర్యచంద్రు లున్నంతవఱకును స్వర్గసుఖంబుల ననుభవించుచుండును. ధర్మార్థకామమోక్షము లాతనికిఁ గరతలామలకములై యుండును. మహీపాలచంద్రా! భూదానమునం దింతటిమహిమ యున్నది. భూదానము చేయవలయు నని మనఃపూర్వకముగఁ గుతూహలపడినవాఁడుగూడ స్వర్గంబు నందఁగలఁడు. భూదానప్రాశస్త్యముం గూర్చి శ్రద్ధతో నాలకించువాఁడును, బఠించువాఁడునుగూడ సర్వపాపవిముక్తులై స్వర్గసుఖంబుల నందఁగలుగుదురు.

## మహీదానవిధి.

ఉత్తమమధ్యమాల్పస్థితులు గలమానవులు తమశక్తికిఁ దగినట్లు భూదానముం గావించియు సంపూర్ణఫలంబునే కాంచఁగలుగుదురు. లక్షసువర్ణములచేఁగాని, వేయింటిచేఁగాని, నూఱింటిచేఁగాని, యంతకును శక్తిచాలనివా రేఁబదింటిచేఁగాని యేకహస్తపరిమితంబైనను, ద్విహస్తపరిమితం బైనను, త్రిహస్తపరిమితంబైనను భూప్రతిమను జేయింపవలయును. కేవల మశక్తులగువారు తామ్రముచేఁ జేయింపవచ్చును. ఆభూమియందుఁ బర్వతస్థానంబులయందు రత్నంబుల నిలుపఁజాలనివారు హేమరజంబును నిక్షేపింపవలయును. ఆభూమికి మధ్యస్థానంబున మేరువును, పూర్వభాగంబున మందరమును, దక్షిణంబున గంధమాదనంబును, పశ్చిమంబున నీలపర్వతంబును, ఉత్తరంబున విపులశైలంబును నిర్మింపవలయును. మేరువునకూర్ధ్వభాగంబున వైడూర్యమందిరంబున బహురత్నంబుల నుంపవలయును. దక్షిణంబున విద్రుమంబును, పశ్చిమంబున మహానీలమును, ఉత్తరంబునఁ బద్మరాగమును నిలుపవలయును. తదభావంబునఁ గాంచనరజంబైనను, దదభావం

బున మహాక్షేత్రాదికంబైనను నిక్షేపింపవలయును. అనంతరము నలుదెస లను వరుసగా కడిమి, నేరేడు, రావి, మామేడుచిగుళ్లను నిలుపవల యును. అవి దొరకనిచోఁ దములపాకులనైన నుంపవలయును. మేరు మందరాదిపర్వతంబులకు వెలుపల లవణసముద్రమును గల్పించి యా స్థానమును బవిత్రమగులవణముచే నింపవలయును. దానికి వెలుపల ప్లక్షద్వీపమును రచించి యందిక్షుసముద్రస్థానమును చెఱకురసముచే నిండింపవలయును. దానివెనుక శాల్మలిద్వీపమును నేతితో సర్పిసము ద్రమును, దానితరువాతఁ గుశద్వీపమును పెరుగుతో దధిసముద్ర మును, దానివెలుపల క్రౌంచద్వీపమును పాలతో దుగ్ధసముద్రమును, దానికి బాహ్యమున శాకద్వీపమును తేనెతో మధుసముద్రమును, దత్పరంబునఁ బుష్కరద్వీపమునునిర్మింపవలయును. ఆపుష్కరద్వీప మును జలజయుతం బగువిమలసలిలంబులచేఁ బూరింపవలయును. ఇట్లు సర్వలక్షణసమన్వితంబుగ నిర్మింపఁబడిన భూప్రతిమను వేదికయందు స్థాపింపవలయును. ఈదానముంగూర్చి పదివేలసంవత్సరములు చెప్పి నను సంపూర్తిగఁ జెప్పఁజాలము. కావున సంక్షేపముగఁ జెప్పితిని.

పిమ్మట నేకహస్తపరిమితం బగు కుండమును నిర్మించి యం దగ్నిప్రతిష్ఠాపనంబు చేసి మహావ్యాహృతులను బఠించుచు శ్వేతసర్ష పసహితంబు లగుతిలలచే హోమము చేయవలయును. మఱియుఁ దత్త న్మంత్రములతో విష్ణుహోమమును, వసుహోమమును గ్రహాదిక్పా లకహోమంబులను గావించి పృథ్వీహోమంబు చేసి « భూమికిని బర్వతంబులకు నాధారస్వరూపా! నీవు బలవంతులలో శ్రేష్ఠుండవు. సకలంబునకు నాశ్రయుండవు. అనంతుఁడవు. పురుషోత్తముండవు. మఱియు దేవతాగణంబులచేఁ బూజితుండవు. అట్టి నిన్ను నేను పూ

జించుచుంటిని. నాయభీష్టప్రదానముం గావింపుము. నీవీభూమండల మును సృజించి వరాహరూపంబున ధరించియుంటివి. నీవు భూదాత వును ప్రతిగ్రహీతవునై యుంటివి. నేను నీకీహేమభూదానంబు చేయు చుంటినిగావున దీనిని బ్రతిగ్రహించి నాయభిమతంబుల సిద్ధింపఁజే యుము " అను నీమంత్రముతో యథాశాస్త్రంబుగ వస్త్రాభరణంబు లతోఁ బూజించి " ధరణీధరుండు ప్రీతుం డగుఁగాక " యని బ్రాహ్మ ణునకు దానము చేయవలయును. అట్లు దానము చేయువాఁడు తన వంశమునం దతీతుల నిరువదితరంబులవారి నుద్ధరించి పదునలుగురిం ద్రులుపరిపాలించునంతపర్యంతమును స్వర్గంబున నుండి సకలభోగం బుల ననుభవించుచు ననంతరము భూమండలమునం దేకచ్ఛత్రాధిప తియై జనింపఁగలఁడు. ఆతఁడట్లు మరల జన్మించియు ధర్మకార్యతత్ప రుండై దానప్రభావంబునఁ గ్రమంబుగ ముక్తిం గాంచఁగలుగును.

## కాంతారత్రాణోపాయము

సనత్కుమారుండు మఱియు నిట్లు చెప్పందొడంగెను. పాప కర్ముం డగుమానవుఁడు తపంబుచే శరీరంబును బరిశుద్ధంబు గావించు కొని క్రమంబుగఁ బాపవిముక్తుండు కాఁగలఁడని యిదివఱకే చెప్పి యుంటిని. మానవుని దేహమధ్యంబుననుండు ప్రాణమంతర్జీవము. గృహమధ్యంబునం గలధనమే బాహ్యజీవము. ఇందు తపంబుచే నంత ర్జీవమును, దానముచే బాహ్యజీవమును శాసించుటవలననే మానవు నకు ముక్తిలాభంబు గలుగును. అని చెప్పుటయు వ్యాసమునీంద్రుండు మహాత్మా ! ఈకలియుగంబున మానవులు సదాచారవిహీనులును, పాపనిరతులును, మూఢులు నై యుందురు. పాపకర్మంబులవలన వారు నిరంతరమును నరకయాతనలనే యనుభవింపవలసినవా రగు

దురు. అట్టినరకంబులయందు దుస్తరంబగు గభీరకాంతారము గలదు. ఆదుర్గమకాంతారయాతన యేతపంబువలన, నేదానమువలన వినష్టంబు గాఁగలదో యానతీయవలయును. అని ప్రార్థించారు.

సనత్కుమారుం డిట్లనియెను. కార్తికమాసంబునఁ గృష్ణచతుర్దశియందు సమాహితచిత్తుండై గంధపుష్పంబులచేతను,ఉత్తమంబులగు భక్ష్యాదుల నివేదనంబుచేతను భగవానుం డగుదామోదరు నారాధింపవలయును. ప్రస్థపరిమితంబు లగునల్లనువ్వులచే సర్వలక్షణసంపన్నం బగుగజమూర్తిని, సువర్ణంబుచే సవత్సంబగుధేనువును నిర్మించి వానికి నలుదెసలను దీపదానంబు గావింపవలయును. అందు గజప్రతిమకు ముక్తాఫలంబులచే నేత్రంబులను, విద్రుమచ్ఛదం బగు రౌప్యంబుచే దంతములను, సువర్ణంబుచేఁ దిలకంబును, చామరంబులచేఁ గర్ణంబులను, కాంస్యంబుచే ఘంటాద్వయంబును, దుకూలంబుచేఁ గక్షను నిర్మించి కుంభస్థలంబులయందు మౌక్తికంబులను, మస్తకంబున సిందూరంబు నుంచి విచిత్రవసనంబులచే నాచ్ఛాదించి ముక్తామాలికలచే సర్వాంగముల నలంకరింపవలయును. దానితోఁగూడఁ గాష్ఠపాదుకలు; చర్మపాదుకలు, ఛత్రము, ఉదకకుంభము, పీఠము, దర్పణమును జేయింపవలయును. శక్తిగలవాఁ డీవస్తువుల నన్నిటిని బంగారముతోఁ జేయింపవలయును. ఈదానవిషయంబున విత్తశాఠ్యము చేయంజనదు. ఆగజంబున కగ్రభాగంబున నష్టదళపద్మంబును లిఖించి కుంకుమచే నాపద్మమును బూరించి యందు కర్ణికాస్థానంబున విష్ణుదేవుని, శంకరుని, బ్రహ్మదేవుని బూజించి పూర్వదళంబునుండి క్రమంబుగ “ పర్జన్యుండును, మరుత్వంతుండు నగుదేవేంద్రునకు నమస్కారము” అను మంత్రముతో నింద్రుని “జాతవేదుండు నగు హవ్యవాహనుండు నగువహ్నికి నమస్కారము” అనుమంత్రముతో నగ్నిని “పితృ

పతియు నానందదాయకుండు నగుయమునకు నమస్కారము'' అను మంత్రిముతో యముని, ‟నిరయాత్మకుండును, ధర్ముండు నగు నిర్వృతి నాథునకు నమస్కారము''అని నైరృతిని, ‟భవభీతార్తిహరుండును, జల పతియు నగువరుణునకు నమస్కారము'' అనుమంత్రిముతో వరుణుని, ‟హరిణవాహనుండును, జగత్ప్రాణుండు నగువాయువునకు నమస్కా రము '' అనుమంత్రముతో వాయువును, ‟ స్మరస్మయమదయుతుం డగు ధననాథునకు నమస్కారము '' అనుమంత్రముతోఁ గుబేరుని, ‟ పశుపతియు, సర్వేశ్వరుండు నగుశివునకు నమస్కారము '' అను మంత్రిముతో మహాదేవుని బూజింపవలయును. ‟ రక్షకుండును, త్రిమూర్త్యాత్మకుండును, విశ్వరూపుండును, దేవుండు నగు కాంతార పతికి నమస్కారము '' అనుమంత్రిముతోఁ గాంతారపతిని, కల్పోక్త విధానంబునఁ గాంతారదేవతలను బూజించి మరల విశ్వనాథుండును, దేవదేవుండు నగువిష్ణుదేవు నర్చించి కృతాంజలిపుటుండై ‟ ఓ ప్రభూ ! కేశవా ! నేనీగజంబు నారోహించి దుర్గమం బగుకాంతారమును సుఖంబుగఁ దరించునట్లనుగ్రహింపుము. ఈగజరాజము నాకు భద్ర ఘటంబును, కామధేనువును, కల్పవృక్షమును, జింతామణియు నగుం గాక '' అనుమంత్రిముచు బఠించుచు మణిహేమాభరణశోభితంబగు సాహస్త్రిని బ్రాహ్మణునకు దానము చేయవలయును. అనంతరము దీపదానంబు చేసి రాత్రి భుజింపవలయును.

ఈదానము కార్తికపూర్ణిమయందును జేయవచ్చును. శక్త్యను సారంబుగ విధివిధానంబున నీదానముం గావించువానికి యమపురమా ర్గంబున భయంబును, నరకదర్శనంబును గలుగవు. ఆతఁడు పాపము క్తుండై సుహృద్బంధుజనంబులతోఁ గూడఁ బదునలుగురింద్రులు పాలిం చునంతవఱకును స్వర్గంబున విహరించుచుండును. జ్యేష్ఠపుష్కరంబున

నూఱుకపిలలను దానము చేసినఫల మొక్క కాంతారగజదానము వలన సిద్ధించును. ఉభయముఖశతగోదానఫలంబును, [illegible] రాహుగ్రస్తుండై యున్న పుణ్యసమయంబునఁ గావించిన [illegible]దానఫలంబును దీనితో సమానంబులు గాఁజాలవు. నూఱుసారులు కన్యాప్రదానంబు చేసినఫలము దీనివలన లభించును. గజాశ్వగోదానఫలంబులు దీనివలన సిద్ధింపఁగలవు. తిలజలధేనుదానంబులఫలముకంటె శతగుణాధికఫలము తద్వస్తునిర్మితం బగునీగజదానంబువలనఁ జేకూరును. కాంతారగజదానం బిట్లు ప్రశస్తంబైనదని యెఱింగి గజశ్రేష్ఠమును [illegible]క్తముగఁ బూజించి "ఓయష్టదిగ్గజేశ్వరా! కాంతారగజాష్టస్వరూప మహాదేవా! నీకు నమస్కారము. ఈదానఫలంబువలనఁ గాంతారకారి యగునారాయణుండు ప్రీతుండగుఁగాక" అనుమంత్రము నుచ్చరించుచు బహుకుటుంబసంపన్నుండగుసద్బ్రాహ్మణునకు దానము చేయవలయును. ఇందువలన సకలపాపహరణంబును, [illegible]ము, స్వర్గలాభంబును గలుగును. ఈప్రకరణమును బఠించువారును, ఆలకించువారును దానఫలంబును గాంచఁగలరు. ఈదానము చేయువారలను నని మనఃపూర్వకముగఁ గుతూహలపడువారికిఁగూడ స్వర్గవాసము సిద్ధింపఁగలదు.

## —◆ చతుష్కశివరాత్రి[illegible]సము ◆—

పూర్వయుగంబున జంబూద్వీపమునందు [illegible] న్యమున కధీశ్వరుండును, ధార్మికుండు నగునొకరాజు ఉండెను. [illegible] డస్త్రవిదులయం దగ్రేసరుండును, వేదశాస్త్రపారగుండును, [illegible] ష్ఠుండును, సత్యవాదియు, బలశాలియు, దాతయు, [illegible] అతిథిప్రియుండునై కీర్తిగాంచుచుండెను. ప్రజ[illegible]

బ్రాహ్మణులకు హేమవస్త్రాదిదానంబులఁ గావించుచు, నర్థులకును దీనులకును వారివారికోరికలం దీర్చుచు శ్రద్ధాపూర్వకంబుగ దానంబులఁ గావించుచుండెను. అట్లు శతానీకుండనునమ్మహారాజు చిరకాలంబువఱకును మంగళమయంబుగ రాజ్యమును బరిపాలించి సహస్రానీకుం డనునొకకుమారుంగాంచి యనంతరము కాలవశంబున మృతుం డయ్యెను.

అంతట సహస్రానీకుండు కులక్రమాగతం బగురాజ్యంబున కధీశ్వరుండై న్యాయయుతంబుగను, ధర్మసహితంబుగను, పృథ్వీశాసనంబు గావించుచుండెను. ఆతఁడు రూపంబునఁ జంద్రుని, ప్రతాపంబున సూర్యునిం బోలి శత్రువునైనను బరిపాలించుటయందు లోపము చేయక సర్వజనరంజకుండై యుండెను. కాని యాతఁడు తనతండ్రిచేసినట్లు బ్రాహ్మణులకుమాత్రము దానములు చేయుట లేదు. ఇట్లు చాలకాలంబు గడచుటయు ప్రతిగ్రహాలోపవశంబున నెట్టియాధారమును లేకుండుటచే బ్రాహ్మణు లందఱును మహారాజును దర్శింప వచ్చిరి. సహస్రానీకుండును శ్రద్ధాభక్తులతో బ్రాహ్మణులందఱను యథావిధిగఁ బూజితులం గావించుటయు వారు ప్రహృష్టహృదయులై యుందఱు నేకవాక్యంబుగ నానరపాలునుద్దేశించి మహారాజా! మేము తునవిచేయఁబోవువిషయము నేకాగ్రచిత్తంబున సమాహితంబుగ నాకర్ణింపవలయును. మీతండ్రి నిత్యదానంబులచే బ్రాహ్మణుల మగు మమ్ముఁ దనియించుచుండుటచే మేమెల్లరమును నభీష్టవస్తుసంపన్నంబులగుమాగృహంబులయందు యథాసుఖంబుగఁ గాలక్షేపము చేసికొనుచుంటిమి. ఇప్పుడు మీపరిపాలనమునం దట్లు బ్రాహ్మణసత్కారంబు జరగుట లేదు. అందుచే నిలువఁజాలక కొందఱుభూసురు లీనగరమును విడిచి పోయియున్నారు. కేవలము మేముమాత్రమే సపరివారంబుగఁ

కష్టముల ననుభవించుచు నిందు నివసించి యుంటిమి. ఓనృపాలశే ఖరా! నిత్యము దారిద్ర్యముచేఁ బీడితుల మగుచున్నమాకును నేఁడో రేపో నగరమును విడువవలసివచ్చునని తోఁచుచున్నది.

అని భూసురులు మనవి చేయుటయు నమ్మహీంద్రుఁడు నవ్వుచు నోవిప్రవరులారా! న్యాయానుసారంబుగ బ్రాహ్మణులకు దానము చేయుటవలనఁ బరలోకంబున మహాఫలంబు గలుగుననుమాట సత్య మే. కాని యందులకుఁ గారణమేమో యించుక వినఁగోరుచున్నాను. దానమువలన స్వర్గప్రాప్తియు, మరల సుఖసౌభాగ్యమయం బగుజన్మ మును గలుగునందురు. నాతండ్రి యిప్పుడు స్వర్గంబున దెట్టిభోగం బుల ననుభవించుచు న్నెట్లుండెనో తెలిసికొని యథార్థముగఁ దెలుపఁ గోరెదను. అనుటయు బ్రాహ్మణు లింక మాఱుమాట చెప్పఁజాలక మహారాజుకడ సెలవు గైకొని యట్లే తెలిసికొని చెప్పెద మని మనవి చేసి దీనమానసంబులతో గృహంబులకుం బోయిరి. తరువాత వారం దఱు నొక్కచోఁ జేరుకొని మృతుఁడైనయమ్మహారా జెచ్చట నెట్లుం డెనో గ్రహించుట కుపాయము నాలోచింపందొడంగిరి. కాని వారి కేమార్గమును గోచరించుట లేదు. రాజావమానశంకచే నారు చాల దినంబులవఱకు నాయాలోచనలోనే నిమగ్నులై పోయిరి.

అప్పుడు వారిహోమాదినిత్యకర్మంబు లన్నియు విస్మృతము లై పోయెను. అందుచే నాదిత్యుండు వ్యాకులితుండయ్యెను. రాజు ధర్మయుక్తముగఁ బరిపాలించుచున్నను దేశంబున ననావృష్టి గలిగెను. అగ్నియందు బ్రాహ్మణులు నివేదించునాహుతులు సూర్యునకుఁ జేరు చును. ఆతనియనుగ్రహంబున వృష్టియు, దానిమూలమునను సస్యం బును, దానివలన సకలజీవులకును దృప్తియుఁ గలుగుచుండును. వీని కన్నిటికిని మూలకారణం బగునాహుతిప్రదానము లేకుండుటచే

క్రమముగా నివి యన్నియును లోపించిపోయెను.

ఇది యంతయుం గాంచి జగన్మిత్రుండగుసూర్యభగవానుండు మిగుల విచారించి బ్రాహ్మణరూపధరుండై భూసురులచెంతకుం బోయి “ఓభూసురవరులారా! మీరు నిత్యకర్మంబులను బరిత్యజించి యేల యిట్లు విషణ్ణులై యున్నారు? మీకుఁ బ్రధానంబులగుపంచయజ్ఞములే యనంతఫలదాయకములు. నిత్యకర్మంబులం దీర్చుచు నన్యఫలాకాంక్షులై వానిని బరిత్యజించువారి కెట్టిసుప్రశస్తదానాదిసత్కర్మంబులును సఫలంబులు గానేరవు. సకలఫలదాయకంబు లగుపుణ్యతీర్థంబులుగూడ నిత్యకర్మపరిత్యక్తులయభిమతంబునుం దీర్చుటకు సమర్థంబులు గానేరవు. చతురాశ్రమవాసులకును నిత్యకర్మంబులగుపంచయజ్ఞములు భుక్తిముక్తిదాయకములై యుండును. కావున వాని నెన్నండును ద్యజింపరాదు. నిత్యకర్మంబుల విడువకుండఁగనే నైమిత్తికంబుల నాచరింపవలయును. నిత్యకర్మంబుల కవిరుద్ధంబు లగునైమిత్తికకర్మంబులు శతగుణాధికఫలదంబు లగుచున్నవి. ఎన్నఁడు నెట్టిప్రతిగ్రహంబును జేయనివాఁడును, నిత్యజపపరాయణుండు నగుబ్రాహ్మణుఁడే పురణించినయానృపునిస్థితిగతులంగూర్చి తెలుపఁగలఁడు.”

అని బోధించుటయు బ్రాహ్మణులాభాస్కరునకుఁ బ్రణామంబులు గావించి పరమానందముతో నాభూసురోత్తమునికొఱకుఁ బురంబునలుదెసల నన్వేషింపనారంభించిరి. ఆపట్టణంబున నట్టివిప్రసత్తముండెండును వారి కగపడలేదు. వారట్లు తిరుగుచుండఁగా నొక్కచో నూర్ధ్వబాహుండును, నిరాలంబుండును, ఏకపాదస్థితుండును, తపోనిరతుండును, ద్విజోత్తముండు నగుభార్గవుని సందర్శించి ప్రణామంబులు గావించి యందఱు నాతనిఁ బరివేష్టించి యాతనిజపావసానసమయమును నిరీక్షించుచుండిరి. సూర్యదేవుండు పశ్చిమంబునకు వాలిన

పిమ్మట నాభూదేవశ్రేష్ఠుండు జపంబును ముగించి దేవపితృతర్ప బులను, మఱియు నితరంబులగునిత్యకర్మంబులను దీర్చికొని తన బరివేష్టించియున్నబ్రాహ్మణుల నందఱం గాంచి కృతాంజలియై య పాద్యాదివిధులచే వారి నర్చించి ఫలమూలాదినివేదనంబున వా బరితృప్తులం గావించి యాగమనకారణముంగూర్చి ప్రశ్నించెను. అ డవ్విప్రులు తమవచ్చినకార్యము నాతనికెఱింగించుటయు భార్గవు తనలో " ఇప్పు డేమిచేయువలయును ? వీరికోరికను నిరాకరించి నెప్పటియట్లు నాతపంబు చేసికొనుట మంచిదా? కాక దీనులై వ యాచించుచున్నవీరికష్టములను దొలఁగించుటకై ప్రయత్నించుట మ చిదా ? ఆపన్నిమగ్నులగుజీవుల కభయదానంబు గావించుట తప కంటెను నధికధర్మం బగుచున్నది. సకలజీవులకును దానముచేయు కంటె నొక్కజీవియందైనను దయచూపుటయే యుత్తమధర్మ పెద్దలు చెప్పుదురు. " అని వితర్కించుకొని భార్గవుండు బ్రాహ్మ సహితుండై యమపురంబునకు బయలుదేఱెను.

ఆతనిం గాంచి సూర్యదేవుండును దక్షిణాభిముఖంబుగఁ యాణము సాగించెను. భార్గవుండును దపోబలంబున శీఘ్రగామి య భాస్కరు ననుసరించి యశ్రమంబుగఁ బోవుచుండెను. ఇట్లు వురును గ్రమంబుగ నెనుబదియెనిమిదివేలయోజనముల యమమా ర్గము నతిక్రమించి పోవుచుండిరి. అచ్చట జలము లేదు. తినుటకన్న లేదు. నిలుచుటకుఁ జెట్లనీడయైనను లేకుండెను. కేవలము దేవ వులకుఁగూడ దుస్సహం బగుచలిమాత్ర మంతటను వ్యాపించుచుం డెను. ఆప్రదేశమంతయు నంధకారబంధురమై యుండెను. ఆ నిరువదియెనిమిదికోట్ల దుస్సహనరకంబులు గానవచ్చుచుండెను. లో శత్రువులు పైఁబడికొట్టుచున్నట్లు కడుపుమండుకొని

పాపకర్ములగుజీవులు నరకంబులయందలి యాతనల ననుభవింపఁజా లక కావించుచుండు నార్తనాదంబు లాతనికి వినవచ్చుచుండెను. వారు పడుచున్న బాధలన్నియు నాతని కగపడుచుండెను.

అట్లాతఁడు పోవుచుండ మార్గమధ్యంబున దండపాణి యగు బ్రాహ్మణుఁడొకఁ డాతని నడ్డగించి "నీవునాకాదానము నీయకుండ నెచ్చటికిఁ బోయెదవు ? పూర్వము నీవు నాకేమి యిచ్చెద నని వాగ్దా నము చేసియుంటివో జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము" అని గద్దించుటయు భార్గవుం డించుకసేపు చింతించి "ఔను. నేను నీకొకపురాణము నిచ్చెద నని చెప్పి యుంటిని. అదియేనా నీవిప్పు డడుగుచున్నది ? నే నింటికిఁ బోయి తీసికొనివచ్చి యిచ్చెదను. ఇప్పటికి నన్నుఁ బోనిమ్ము!" అనియెను. బ్రాహ్మణుం డామాట విని "తరువాత నిచ్చెదను" అను మాట మీభూలోకమునందే గాని యిచ్చటఁ జెల్లనేరదు. ఇప్పుడె నాకీయవలసినది యిచ్చి పోవలయును." అని నిర్బంధించెను. అప్పుడు భార్గవుండు తానేమియును దీసికొని రాలేదనియెను. బ్రాహ్మణుఁ డామాటలు విని దానికిఁ బ్రతిగ నీసుకృతఫలమునం దర్ధభాగము నాకీయవలయు నని కోరెను. దానికి భార్గవుం డంగీకరింపకుండుటయు సూర్యదేవుండు భార్గవునకు బోధించి యాతనిపుణ్యమునందు షష్ఠాం శము నాబ్రాహ్మణుని కిప్పించి యాతని బంపివైచెను. తరువాతఁ గొంతదూరము చనునప్పటి కొకగొల్లవాఁడు భార్గవు నడ్డగించి నీ గోవును గాచినందులకు నాకీయవలసినవేతనము నాలుగుమినుపగిం జలయెత్తుబంగారునాణెము (కాకిణి) ను దెమ్మని యడిగెను. ఆకాల మున నది స్వల్పమగుటచే గొల్లవాఁ డాతని నడుగలేదు. భార్గవుం డును మఱచిపోయెను. ఇప్పుడు దానికి బదులుగా భార్గవుఁ డాగోపా లునకుఁ దనసుకృతమునందు షష్ఠభాగము నీయవలసివచ్చెను. ఇట్లు

మార్గమధ్యమునందు చాకలి, ధర్మకారుఁడు, వస్త్రకారుఁడు, తీర్థయాత్రల సేవింపఁజేయువాఁడును నాతనిఁ దనుకీయవలసినధనముంగూర్చి పీడించిరి. వారికిఁ గూడ సుకృతమునందుషష్ఠభాగము వీయవలసివచ్చుటచే బ్రాహ్మణోత్తముఁ డగుభార్గవుఁడు నిస్తేజుండై పోయెను. ఇఁక నాతఁ డొక్కయడుగైనను ముందటికి వేయఁజాలక పోయెను.

అప్పుడు దివాకరుం డాతని బట్టుకొని శతానీకమహారాజను భవించుచున్ననిరయముకడకుఁ దీసికొనిపోయెను. ఒకకుంభమధ్యమునఁ బచనముచేయఁబడుచున్న యన్నరపాలుం గాంచి భార్గవుఁడు విస్మితుండైపోయెను. ఆతఁడు కొంతసేపట్లే యుండి రాజును సవినాపించి "మహారాజా! నీవు పూర్వము బ్రాహ్మణులకు షోడశమహాదానంబులను గావించితి. రత్నములు, వస్త్రములు, గ్రామములు, నగరములు మొదలగువానిని సమర్పించి భూసురులను దనియించితివి. తపంబువలనను భక్తితోఁ గావించినదానంబువలనను స్వర్గప్రాప్తి యగునని మునులు చెప్పుదురు. అట్టిచో నీవిప్పుడు యమకింకరులచే నిర్బంధితుండవై నరకయాతనల ననుభవించుచుంటివి. దీనికిఁ గారణంబేమియో తెలుపవలయును." అనియడుగుటయు శతానీకుండు భూసురోత్తమా! ఈవిషయంబున సత్యమును వచించుచున్నాను. వినుము. నేనజ్ఞానవశంబునఁ బరులకడ సంపాదించినధనంబుచే బ్రాహ్మణులకనేకదానంబులఁ గావించితిని. ఆద్రవ్యమును సేకరించుపట్టున నామూలమునఁ బ్రజలు పీడితులైరి. ప్రజాసంతాపమున బయలువెడలిన యనలజ్వాలలమూలముననే ప్రేతమూర్తి నగునేనిప్పు డీనరకమునందు రేయుంబవలు దహింపఁబడుచున్నాను. మహాత్మా! నీవు నన్నీదుఃఖమునుండి విముక్తుం గావింప నెంతువేని శీఘ్రంబుగ భూలోకంబునకుఁ బోయి సాధుసంగంబు గావింపుమని నాకుమారునకు బోధింపుము.

సాధుసంగంబుకంటె నన్నుద్ధరించుట కితరోపాయం బేదియును లేదు.
అని ప్రార్థించెను.

ఆమాట లాలించి భార్గవుండు తనప్రభువునకును, సకలమానవగణంబులకును హితంబు గోరి యాదిత్యుంగూర్చి యిట్లు ప్రార్థించెను. ఓసూర్యదేవా! సాధువులు తీర్థస్వరూపులు గావున వారిదర్శనము పుణ్యదాయకమైనది. తీర్థసేవనము కాలక్రమంబున ఫలించును గాని సాధుసంగము సద్యఃఫలము నొసంగుటకు సమర్థమై యుండును. పుణ్యకర్మవిహీనులకు దేవతలయందును, ఉత్తములగు బ్రాహ్మణులయందును, దపస్వులయందును భక్తి గలుగదు. పాపక్షయసమయంబుననే మానవులకు దానధ్యానంబులయందు బుద్ధి ప్రసరించును. నీదర్శనమాత్రంబుననే నరకవాసు లెల్లరును సుఖానుభవముం గాంచుచుండుటచే నీవు దేవతాశ్రేష్ఠుండ వని నిస్సంశయంబుగ గ్రహింపఁ గలిగితిని. కాని ధర్మహీనుండ నగునేను నీసమ్ముఖంబున దేవతుల్యంబగునవస్థయందుండియు నించుకంతయు సుఖము నందఁజాలకున్నాను. కావున మానవులకుఁ బాపవిమోచకంబును, స్వర్గసుఖదాయకంబు నగు నుత్తమధర్మం బేదియైననున్నచో లోకమంగళంబుకొఱ కాధర్మముంగూర్చి యానతీయవలయును. సంసారు లగుమానవులు క్షేత్రదారగృహాదులకొఱ కెన్నికష్టముల ననుభవించి ప్రయత్నింతురో యావిధముగా ధర్మముకొఱకుఁగూడ శ్రమపడకున్నచో స్వర్గమోక్షాదిఫలంబులఁ బడయఁజాలరా యేమి? ఈవిషయంబునుగూర్చి విస్పష్టంబుగ నానతీయవలయును.

అని భార్గవుండు ప్రార్థించుటయు భాస్కరుండు విప్రోత్తమా! లోకహితంబుకొఱకు నీకీవిషయంబున సత్యము నెఱింగించుచున్నాను. సర్వసంపత్సమృద్ధికిఁ గారణంబును, సంకీర్తనంబువలనను, ననుష్ఠానం

బువలననుగూడ ఫలదాయకంబు నగుధర్మముంగూర్చి నీవు నన్నుం బ్రశ్నించితివి. దీనింగూర్చి చెప్పుటవలన జిహ్వా పవిత్రం బగుటయే కాక శ్రేయోభివృద్ధికూడం గాంగలదు. కావున సకలపాపహారంబగు నట్టిధర్మముంగూర్చి చెప్పెదను వినుము. చైత్రమాసము వత్సరంబున కాదియు, శివాదిసకలదేవతలకును బ్రియకరంబునైయున్నది. ఆమాస మునం దేవతలందఱును స్వర్గమునుండి భూమండలంబునకుం గ్రీడార్థమై యరుదెంచి ప్రతివత్సరమును సుఖవిహారంబు గావించి సంప్రీతులై నిజలోకంబులకు విచ్చేయుచుందురు. శంకరుండును బాలకరూపముం ధాల్చి కన్యామూర్తులగుప్రమథులతోడను, భగవతియగుగౌరితోడను గలసి చైత్రమాసంబున భూలోకమునవిహరించుచుండును. కార్తికమాసంబున దీపదానము చేయునట్లే చైత్రమాసంబునంగూడ మహాదేవునకును, నితరదేవతలకును బ్రీతికరంబుగా దీపారాధనాదిమహోత్సవంబులం గావించువారు పాపాత్ములైనను దేవలోకగాము లగుదురు. కావునం గృష్ణచతుర్దశియందుగాని, శుక్లచతుర్దశియందుగాని యుపవసించి మహాదేవునుద్దేశించి బ్రాహ్మణునకు గోదానంబు చేయువారు పాపవిముక్తులై స్వర్గసుఖంబు లందంగలరు.

అని యిట్లాదిత్యభగవానుం డానతిచ్చుటయు భార్గవుండు పరమానందభరితుండై మరల భూలోకంబునకు వచ్చి మంత్రిపురోహితసామంతద్విజమండలపరివేష్టితుండై కొలువున్నసహస్రానీకునిందగ్గఱఁజని యెల్లవిషయంబులను సవిస్తరంబుగ వినిపించెను. అంత సహస్రానీకుండు పరిహృష్టమానసుండై తానువచ్చువఱకును భార్గవుని రాజధానియందే యుండ నియోగించి న్యాయపూర్వకం బగు ధనము నార్జించుటకై విదేశంబునకుం బోయెను. అందొకచో నొకపుష్కరిణి త్రవ్వంబడుచుండెను. సహస్రానీకుం [illegible]

బనిచేయుట కారంభించెను. గోదానమునకు సరిపడు ధనంబు లభించు నంతవఱకు నమ్మహారాజు కూలి పని చేయుచుండెను. అనంతర మాన్నపాలుం డాద్రవ్యముం గైకొని మరల సురక్షితంబగు తనరాజధాని కేతెంచి యాధనంబుతో భార్గవోక్తం బగువ్రతంబును యథావిధిగ నిర్వర్తించెను. అందువలన నరకస్థుం డగునాతనితండ్రి శతానీకుఁడు పితృపితామహసహితంబుగ దివ్యవిమానారూఢుండై యప్సరోగణంబులు తన్నుఁబరివేష్టించి నృత్యగీతాదివినోదంబులం గావించుచుండ స్వర్గలోకంబు చేరి యందు యథేచ్ఛావిహారంబులఁగాలక్షేపము చేయుచుండెను. ఏకాహమాత్రసాధ్యం బగునిమ్మహావ్రతంబు నాచరించువారు శివప్రసాదంబునఁ బురాకృతపాపంబులఁ బరిత్యజించి పితృపితామహులతోఁగూడి స్వర్గసుఖంబు లనుభవింపఁగలరు.

చతుర్దశియం దుపవాసంబును, మహాదేవపూజయు నిర్వర్తించి పూర్ణిమయం దుత్తమబ్రాహ్మణునకు ధేనుదానంబుఁ జేయవలయును. గోదానము చేయఁజాలనివారు ఘృతపూర్ణంబగుపాత్రంబును, అన్నవస్త్రంబులను దానము చేసినచో గోదానఫలంబు నందఁగలరు. అట్టివారు పాపవిముక్తులై చిరకాలంబువఱకు రుద్రలోకంబునసుఖభోగంబు లనుభవించి యనంతరము మరల ధార్మికులగుభూపతులై భూమండలమున జనింపఁగలరు. సత్యయుక్తుండై వసంతకాలంబునఁగూడ నశోకచతుర్దశియం దీవ్రతంబు గావించి మంత్రోక్తంబుగ శివప్రీతికరంబగునీదానమును గావింపవలయును. మంత్రాధికుండగుబ్రాహ్మణుఁడే విశుద్ధుఁడు. క్షత్రియులును, వైశ్యులునుగూడ మంత్రాధిక్యమువలననే పవిత్రు లగుచున్నారు. వర్ణబాహ్యులగువారును మంత్రబలంబుచేఁ బరిపుష్టులగుదురు. దేవతలును, యక్షులును, రాక్షసులును, పితరులును, మానవులు నందఱునుగూడ మంత్రాత్మకులే యైయుందురు.

మంత్రహీనంబులగువస్తువులను వారు స్వీకరింపఁబోరు. కావున మంత్ర యుక్తంబుగనే పినాకపాణి నారాధింపవలయును. నాలుగుదినంబుల యందును కృభవ్రతంబును, నందు చతుర్దశియం దుపవాసంబును విహితంబులు. ఏకాదశియం దేకమాత్రభోజనంబును, జలపానంబును, ద్వాదశియం దయాచితభోజనంబును, త్రయోదశియందు సాభోజనం బును, చతుర్దశియందు నిరాహారంబును గావింపవలయును. అట్లు నియతుండై పూర్ణిమయందు గోదానముచేసి ఫలసిద్ధిం బడయును. శుభ ఫలాకాంక్షియగువాఁడు శివప్రీతికరంబుగ శివుసుద్దేశించి దానము చేయవలయును.

పండ్రెండుపలములైనను, ఆఱుపలంబులైనను, నాలుగుపలం బులైనను, దరిద్రుండగువాఁడు సార్ధపలంబైనను సువర్ణముతో నొకపా త్రను నిర్మింపఁజేసి దానిని ఘృతంబుచే నిండించి [illegible] సువర్ణం బును జేర్చి వస్త్రముచేఁగాని, తదభావంబున సూత్రముచేఁగాని దానిని వేష్టించి "శివప్రీతి యగుఁగాక — స్థాణువును, ఈశ్వరుండును, జగన్నాథుండును, శూలపాణియు, మహేశ్వరుండును, [illegible] నగుమహాదేవునకుఁ బ్రణమిల్లుచున్నాను. ఆతఁడు నాపాపములను నశింపఁజేయుఁగాక! కపాలమాలావిభూషితుండును, [illegible] రియు, జగన్నాథుండును, దేవుండు నగుశంకరునకు నమస్కారము. [illegible] దయచే నేను పాపవిముక్తుఁడ నగుదును గాక! [illegible], సర్వాభరణాలంకృతుండు నగుజగదీశ్వరమహాదేవునకు వందనము. [illegible] ఆతనికటాక్షములు మత్పాపహరంబులగుఁగాక! [illegible] త్రిలోచనుండును, గంగాధరుండు నగుపశుపతికిఁ [illegible] ము. అతనియనుగ్రహము నాపాపంబుల [illegible]!

గతుండును, బుద్ధిగతుండును, అహంకారకుండు నగురుద్రుండు నాపాపంబుల హరించుఁగాక ” అనుమంత్రములతో శివపూజ గావించి యాపాత్ర నుత్తమబ్రాహ్మణునకు దానము చేయవలయును. అట్లు చేయువారు మహాఫలసిద్ధులును, సురూపసౌభాగ్యభోగైశ్వర్యవంతులు నగుదురు. నాలుగుమాసంబు లుభయచతుర్దసులయందు నిమ్మహావ్రతంబు నిర్వర్తించుపుణ్యులు సహస్రానీకునివలెఁ దమకులంబున సహస్రపురుషులనుద్ధరించి పాపశూన్యులై దేవతలకుఁగూడఁ బూజనీయులై శివలోకంబున సుఖోపవిష్టులై యుండఁగలరు. రాత్రులను, పగళ్లను, మధ్యాహ్నంబులను, అపరాహ్ణంబులను, సంధ్యాకాలంబులను వారు మనోవాక్కాయంబులచేఁ గావించినదురితంబు లన్నియును నశింపఁగలవు. భక్తిపూర్వకంబుగ నేకభుక్తంబును, అయాచితాహారంబును, నక్తభోజనంబును, నిరాహారంబును గావించి యీవ్రతంబును విధ్యుక్తముగ నాచరించువాని కపారంబగు పుణ్యములభింపఁగలదు. ఇట్లు చతుర్దశియందు భక్తిశ్రద్ధలతో శివపూజ చేసి నియమవ్రతుండును, శుచియు, నేకాగ్రచిత్తుండునై శివసహస్రనామంబులఁ గీర్తింపవలయును. అసమర్థుండగువాఁడు మహాదేవునిదివ్యనామంబులనాకర్ణింపవలయును. అట్టివానికి సకలపాపవిముక్తియు, శివలోకావాసంబును సిద్ధింపఁగలవు.

## సహస్రనామసంకీర్తనము.

సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! శ్రీవణమాత్రంబున సకలపాపౌఘవినాశకంబును, ముక్తికారణంబునగు శివసహస్రనామావళింగూర్చి చెప్పుచున్నాను. ఈస్తవంబునుగూర్చి చెప్పుటకు నేను సమర్థుండను గాను. అమ్మహాదేవుని యనుగ్రహంబుచే

నాకాదివ్యనామంబు లన్నియును స్మృతిపథంబునఁ దోఁచుచున్న వి. ముందుగ నేనద్దేవుని సన్నుతించి యాతనిచే ననుజ్ఞాతుండనై యనాది నిధనుండును, సర్వయోనియు, మహాత్ముండును, అవ్యక్తుండు నగు శివుని నామసమూహము నించుక వర్ణించెదను. వరదుండును, వరేణ్యుండును, విశ్వమూర్తియు జ్ఞానమయుండును, మహాదేవుండు నగు చతురాననుండు వీనికిఁ గర్త. దధిని మథించి నవనీతమును గల్పించి నట్లుగా బ్రహ్మదేవుండు విశేషపర్యాలోచనంబు చేసి మహాదేవుని యయుతనామమధ్యనుండి యీనామసహస్రము నుద్ధరించియున్నాఁడు. పర్వతంబులలో హిమవంతంబునుం బోలి శర్వుని సర్వనామంబుల యందు నీనామావళి సారభూతమైనది. సర్వపాపహరంబును, చతుర్వేదపారతుల్యంబును, మహాఫలదాయకంబు నగు నీనామసహస్రము ను సంయతచిత్తంబునఁ బ్రయత్నపూర్వకంబుగఁ బఠించి ధ్యానము చేయవలయును. ఈస్తోత్ర ముత్పాతశాంతికరంబును, పుష్టికరంబును, రక్షోఘ్నంబును, పావనంబునైనది. దీనింగూర్చి భక్తిశ్రద్ధలు గలవారికే బోధింపవలయును. శ్రద్ధావిహీనులును, నాస్తికులు నీనామంబులను వినఁదగినవారు గారు. సర్వభూతాత్మకుండును, పినాకపాణియు నగు మహాదేవుని ద్వేషించువారు పితృపితామహాదులతోఁగూడ నరక పతితు లగుదురు. అట్టిపాపాత్ములుగూడ సంత్యకాలంబున ధ్యానయోగస్వరూపంబును, ఉత్తమధ్యేయంబు నగునీనామావళి నాలకించిన యో. బరమపదప్రాప్తు లగుదురు. ఈస్తోత్రము పవిత్రంబును, మంగళమయంబును బుణ్యకలితంబును, గళ్యాణప్రదంబు నైనది. సర్వలోకపితామహుండగు జలజాసనుండు తొల్లి యీస్తవముం గూర్చి దీనికి సశివస్తవరాజం బని పేరిడియెను. అది మొదలుగా నిది దేవగణములచేఁ బూజితంబై స్తవరాజం బని ప్రశస్తిం గాంచెను. ఈనామసహస్ర

యప్పుడే బ్రహ్మలోకమునుండి యవతరించి సకలలోకంబులను వ్యాపించెను. శ్రేష్ఠులకు శ్రేష్ఠుండును, శాంతులకు శాంతుండును, ద్యుతులకు ద్యుతియు, యోగులకు యోగియు, కారణంబులకుఁ గారణుండును నగుదేవుం డెవ్వఁడో, ఎవ్వనినుండి సకలలోకంబులును సంభవంబులగుచుండునో, ఎవ్వనివలనమరల భవంబు లేకుండునో యట్టిసర్వభూతాత్మభూతుండును, అమిత తేజస్వియునగు మహాదేవుని సహస్రనామంబులంగూర్చి యాకర్ణింపుము. ఈనామశ్రవణమంత్రంబున నఖిలాభీష్ట సిద్ధి యగును.

స్థిరుఁడు, స్థాణువు, ప్రభువు, భానుఁడు, ప్రవరుఁడు, వరదుఁడు వరుఁడు, సర్వాత్ముఁడు, సర్వవిఖ్యాతుఁడు, శర్వుఁడు, సర్వకరుఁడు, ఉద్భవుఁడు, జటి, చర్మి, శిఖి, ఖడ్గి, సర్వాంగుఁడు, సర్వభావనుఁడు, హరుఁడు, హిరణ్యాక్షుఁడు, సర్వభూతహరుఁడు, ప్రవృత్తి, నివృత్తి, నియతుఁడు, శాశ్వతుఁడు, ధ్రువుఁడు, శ్మశానచారి, భగవానుఁడు, ఖేచరుఁడు, ఖేచరోద్భవుఁడు, అభివంద్యుఁడు, మహాకర్మ, తపస్వి, భూతభావనుఁడు, ఉన్మత్తవేషుఁడు, ప్రచ్ఛన్నుఁడు, సర్వలోకప్రజాపతి మహారూపుఁడు, మహాకాయుఁడు, సర్వరూపుఁడు, మహాశనుఁడు, విశ్వరూపుఁడు, విరూపుఁడు, విశ్వభోజి, వామనుఁడు, మనువు, లోకపాలాంతర్హితాత్మ, ప్రసాదుఁడు, హయగర్దభి, పవిత్రుఁడు, మహాత్ముఁడు, నియమము, నియమాశ్రయుఁడు, సర్వవర్మ, స్వయంభువు, అనాది, ఆది, అవ్యయుఁడు, సౌమ్యరూపుఁడు, విరూపాక్షుఁడు, సోముఁడు, నక్షత్రసాధకుఁడు, చంద్రుఁడు, సూర్యుఁడు, శని, కేతువు, గ్రహము, గ్రహపతి, వరుఁడు, అత్రి, అత్ర్యాలయుఁడు, కర్త, మృగబాణార్పణుఁడు, అనఘుఁడు, మహాతపుఁడు, దీర్ఘతపుఁడు, అదీనుఁడు, దీనసాధకుఁడు, సంవత్సరకరుఁడు, మంత్రము, ప్రమాణము, పరమతపము, యోగి, యోజ్యుఁడు, మహాబీజుఁడు, మహామాత్రుఁడు, మహాతపుఁ

డు, సువర్ణరేతుఁడు, సర్వజ్ఞుఁడు, సుబీజుఁడు, వృషవాహనుఁడు, దశ
బాహుఁడు, అనిమిషుఁడు, నీలకంఠుఁడు, ఉమాపతి, విశ్వరూపుఁడు,
స్వయంశ్రేష్ఠుఁడు, బలి, వైరోచనుఁడు, అరిహంత, గణకర్త, గణపతి,
దిగ్వాసుఁడు, కామ్యము, పరమపవిత్రుఁడు, మంత్రము, సర్వభావ
హరుఁడు, హరుఁడు, కమండలుధరుఁడు, ధన్వి, బాణహస్తుఁడు, ప్రతా
పవంతుఁడు, అశని, శతఘ్ని, ఖడ్గి, పట్టిసుఁడు, ఆయుధి, మహాత్ముఁ
డు, స్రువహస్తుఁడు, సురూపుఁడు, తేజము, తేజస్కారుఁడు, ఉష్ణీషి,
సువక్త్రుఁడు, అత్యుగ్రుఁడు, వినతుఁడు, దీర్ఘుఁడు, హారినేత్రుఁడు, సతీ
ర్థుఁడు, కృష్ణుఁడు, సృగాలరూపుఁడు, సర్వార్థుఁడు, ముండుఁడు, కుండి,
కమండలువు, అజుఁడు, మృగరూపి, గంధమాలి, కపర్ది, ఊర్ధ్వరేతుఁ
డు, ఊర్ధ్వలింగుఁడు, ఊర్ధ్వశాయి, నభస్థలుఁడు, త్రిజటి, చీరవాసుఁ
డు, రుద్రుఁడు, సేనాపతి, విభుఁడు, అహశ్చరుఁడు, నక్తము, తిగ్మము
మనువు, సువర్చసుఁడు, గజహంత, దైత్యహుఁడు, లోకము, లోక
ధాత, గుణాకరుఁడు, సింహశార్దూలరూపుఁడు, ఆర్ద్రచర్ముఁడు, ధరా
ధరుఁడు, కాలయోగి, మహానాదుఁడు, సర్వావాసుఁడు, చతుష్పథుఁ
డు, నిశాచరుఁడు, ప్రేతచారి, భూతచారి, మహేశ్వరుఁడు, బహుభూ
తుఁడు, బహుధనుఁడు, సర్వాధారుఁడు, అమితగతి, నృత్యప్రియుఁడు,
నృత్యతృప్తుఁడు, నర్తకుఁడు, సనిలాసుఁడు, పోషకుఁడు, మహాతపుఁ
డు, ప్రాంశువు, నిత్యుఁడు, గిరిచరుఁడు, నభస్సు, సహస్రహస్తుఁడు,
విజయుఁడు, వ్యవసాయి, అనిశ్చితుఁడు, అమర్షణుఁడు, మర్షణాత్ముఁ
డు, యజ్ఞహంత, కామనాశకుఁడు, దక్షయజ్ఞాపహారి, సుపథుఁడు,
మధ్యముఁడు, తపోపహారి, బలవంతుఁడు, ముదితుఁడు, అర్థుఁడు, అజి
తుఁడు, వరుఁడు, గంభీరుఁడు, గంభీరఘోషుఁడు, గంభీరబలవాహ
నుఁడు, న్యగ్రోధరూపుఁడు, న్యగ్రోధుఁడు, వృక్షకర్ణుఁడు, అక్షీతుఁడు,

విభుఁడు, సుతీక్ష్ణదశనుఁడు, మహాకాయుఁడు, మహాననుఁడు, విష్వ
క్సేనుఁడు, హర్యక్షుఁడు, సంయుగాపీడవాహనుఁడు, తీక్ష్ణబాహువు,
హరి, యజ్ఞుఁడు, మహాశయుఁడు, కర్మకాలవిదుఁడు,విష్ణుప్రసాదితుఁడు,
యజ్ఞము, సముద్రుఁడు, బడబాముఖుఁడు, అంబనుఁడు, లంబితోష్ఠుఁ
డు, బహుమాయాపయోనిధి, మహాంగుఁడు, మహాదంష్ట్రుఁడు, మహా
జిహ్వుఁడు, మహామఖుఁడు, మహానాథుఁడు, మహారోముఁడు. మహా
కేశుఁడు, మహాజటుఁడు, అసపత్నుఁడు, ప్రసాదుఁడు, ప్రత్యయుఁడు,
గిరిసాధకుఁడు, స్నేహనుఁడు, అస్నేహనుఁడు, అజితుఁడు, మహాముని,
వృక్షకారుఁడు, వృక్షకేతువు, తరళుఁడు, వాయువాహనుఁడు, మం
డలి, వాయుధాముఁడు, దేవదానవదర్పహుఁడు, అధర్వశీర్షుఁడు, సా
మాస్యుఁడు, రిపుహంత, అమితేక్షణుఁడు, యజుష్పాదభుజుఁడు, గు
హ్యుఁడు, ప్రకాశుఁడు, జంగముఁడు, అమోఘార్థప్రసాదుఁడు, అభి
గమ్యుఁడు, సుదర్శనుఁడు, ఉపహారుఁడు, ప్రియుఁడు, సర్వుఁడు, కన
కుఁడు, కాంచనస్థిరుఁడు,నంది, నందికరుఁడు, భవ్యుఁడు, పుష్కరుఁడు,
పతి, స్థిరుఁడు, తపనుఁడు, తాపనుఁడు, ఆద్యుఁడు, ఘృణి, యజ్ఞుఁడు,
సమాహితుఁడు, నక్తుఁడు, కలి, కాలుఁడు, మకరుఁడు, కాలపూజి
తుఁడు, సుగణుఁడు, గణకారుఁడు, భూతభావనుఁడు, సారథి, భస్మ
శాయి, భస్మగోప్తుఁడు, భస్మరూపుఁడు, తరంగణుఁడు, అగణుఁడు,
లోపుఁడు, మహాత్ముఁడు, సర్వపూజితుఁడు, శంకువు, త్రిశంకుసంప
న్నుఁడు, శుచి, భూతనిషేవితుఁడు, ఆశ్రమస్థుఁడు, కపోతస్థుఁడు,
విశ్వకర్మపతి, వరుఁడు, శాఖుఁడు, విశాఖుఁడు, కుంభాండుఁడు, అర్థ
జాలుఁడు, సునిశ్చయుఁడు, కపిలుఁడు, అకపిలుఁడు, శూరుఁడు,ఆయువు
అపరోరగుఁడు, గంధర్వుఁడు, అదితి, తార్క్ష్యుఁడు, అవిజ్ఞేయుఁడు,
సుసారథి, పరశ్వధాయుధుఁడు, దేవుఁడు, అర్థకారుఁడు, సుధీవరుఁడు,

తుంబవీణుఁడు, మహాకోపుఁడు, ఊర్ధ్వరేతుఁడు, జలేశయుఁడు, ఉగ్రవంశకరుఁడు, పాశధారుఁడు, అనిందితుఁడు, సర్వాంగరూపుఁడు, మాయావి, సుహృత్తు, అనిలుఁడు, అనలుఁడు, బాంధవుఁడు, బంధుకర్త, సుబంధువు, రవిలోచనుఁడు, సుయజ్ఞారి, సుకామారి, మహాదంష్ట్రుఁడు, అసమయోధుఁడు, బాహువు, అనిందితుఁడు, శర్వుఁడు, శంకరుఁడు, ధనదుఁడు, ధనుఁడు, అమరేశుఁడు, మహాదేవుఁడు, విశ్వదేవుఁడు, సురారిహంత, దీధితి, అహిర్బుధ్నుఁడు, చేకితానుఁడు, హరి, అజైకపాదుఁడు, కపాలి, త్రిశంకుఁడు, అజితుఁడు, శివుఁడు, ధన్వంతరి ధూమకేతువు, స్కందుఁడు, వైశ్రవణుఁడు, ధాత, శక్రుఁడు, విష్ణువు, మిత్రుఁడు, త్వష్ట, ధ్రువుఁడు, ధని, ప్రభావుఁడు, సర్వగుఁడు, వాయువు, అర్యముఁడు, సవిత, రవి, ఉదగ్రుఁడు, విధాత, మాంధాత, భూతభావనుఁడు, హుతతీర్థుఁడు, వాగ్మి, సర్వకాలగుణావహుఁడు, పద్మవక్త్రుఁడు, మహావక్త్రుఁడు, చంద్రవక్త్రుఁడు, మనోజవుఁడు, బలవంతుఁడు ఉపశాంతుఁడు, పురాణుఁడు, కురుఁడు, కర్త, కాలరూపి, గురుభూతుఁడు, మహేశ్వరుఁడు, సర్వాశనుఁడు, సర్వశాయి, సర్వప్రాణిపతి, దేవదేవుఁడు, సుఖాసక్తుఁడు, సత్తు, అసత్తు, సర్వరత్నవిదుఁడు, కైలాసశిఖరవాసి, హిమవద్గిరిసంశ్రయుఁడు, కులహారి, కులకర్త, బహుబీజుఁడు, బహుప్రదుఁడు, వణిక్కు, వర్ధనుఁడు, వృక్షుఁడు, నకులుఁడు, చందనచ్ఛదుఁడు, సారపీఠుఁడు, మహాజంతుఁడు, ఆలోకుఁడు, మహౌషధుఁడు, సిద్ధార్థకారి, సిద్ధార్థుఁడు, ఛందోవ్యాకరణాంతగుఁడు, సింహనాదుఁడు, సింహదంష్ట్రుఁడు, సింహగుఁడు, సింహవాహనుఁడు, ప్రభావాత్మ, జగత్కాలుఁడు, తలుఁడు, లోకహితుఁడు, [illegible], నవచక్రాంగుఁడు, కేతుమాలి, శుభావనుఁడు, భూతాశయుఁడు, భూతపతి, అహోరాత్రానందితుఁడు, వామనుఁడు, [illegible]

యుఁడు, విభుఁడు, భవుఁడు, అమోఘుఁడు, సంజయుఁడు, పార్శ్వుఁడు
జీవనుఁడు, ప్రాణధారి, ధృతిమాన్, ఆత్మవాన్, దక్షుఁడు, సత్కృ
తుఁడు, యుగాధిపుఁడు, గోపాలుఁడు, గోయుధి, గ్రాహుఁడు, గోచ
ర్మవసనుఁడు, హరుఁడు, హిరణ్యబాహువు, గుహాపాలుఁడు, ప్రవేశి
తుఁడు, ప్రతిష్ఠాయి, మహాహర్షుఁడు, జితకాముఁడు, జితేంద్రియుఁడు,
గాంధారుఁడు, సురాలుఁడు, తనువు, ఆత్మ, గతి, వరుఁడు, మహాగీ
తుఁడు, మహానృత్యుఁడు, అప్సరోగణసేవితుఁడు, మహాకేతువు, వికర్త
చరేశ్వరుఁడు, ఆవేదనీయుఁడు, ఆవాసుఁడు, సర్వగంధసుఖావహుఁడు
తోరణుఁడు, తారణుఁడు, వాయువు, పర్జన్యుఁడు, హుతాశనసహా
యుఁడు, ప్రశస్తాత్మ, హుతాశనుఁడు, ఉగ్రతేజుఁడు, మహాతేజుఁడు,
జయుఁడు, విజయుఁడు, కాలవిదుఁడు, జ్యోతిషానయుఁడు, సిద్ధి, సంధి
విగ్రహుఁడు, శిఖి, దండి, జటి, జ్వాలి, మూర్తిజుఁడు, దుర్ధరుఁడు,
వణిక్కు, వైణవి, పణవి, తాళి, కాలుఁడు, కాలకంటకుఁడు, నక్షత్రతుఁ
డు, విగ్రహుఁడు, వృద్ధి, గుణవృద్ధి, అయోగముఁడు, ప్రజాపతి, దిశా
బాహువు, విభాగుఁడు, సర్వతోముఖుఁడు, విమోచనుఁడు, సురగ
ణుఁడు, హిరణ్యకవచి, ద్రవి, మేఢ్రజుఁడు, బలచారి, మహాచారి,
స్తుతుఁడు, సర్వతూర్యనినాది, సర్వవాద్యపరిగ్రహి, బాలరూపి,
బిలావాసి, హేమమాలి, తరంగవిత్తు, త్రిదశుఁడు, త్రివృత్తు, ఛం
దము, సర్వబంధవిమోచకుఁడు, బంధనుఁడు, సురేంద్రశత్రువినాశి,
సాంఖ్యప్రసాది, దుర్వాసుఁడు, సర్వసాధునిషేవితుఁడు, ప్రస్కంద
నుఁడు, విభాగుఁడు, అతులుఁడు; యజ్ఞసామవేది, సర్వవాసుఁడు,
సర్వచారి; దుర్వాసుఁడు; వాసవుఁడు, అమరుఁడు, హేముఁడు, హేమ
కారి, యజ్ఞుఁడు, సర్వధారి; ధరోత్తముఁడు; లోహితాక్షుఁడు, మహా
క్షుఁడు, విజయాక్షుఁడు, విశారదుఁడు, సంగ్రహుఁడు, విగ్రహుఁడు,

కాముఁడు, సర్వచీరనివాసనుఁడు, ముక్తుఁడు, వియుక్తదేహి, దేహారి, సర్వకామదాయి, సర్వకాలప్రసాదుఁడు, సుబలుఁడు, బలరూపధారి, సహాకాశుఁడు, నిరూపి, నిపాని, ఉరణుఁడు, ఖగుఁడు, రౌద్రరూపాంశువు, ఆదిత్యుఁడు, వసువు, అగ్ని, సువర్చసి, వసువేగుఁడు, మహావేగుఁడు, మనోవేగుఁడు, నిశాకరుఁడు, సర్వావాసి, ప్రియావాసి, అపదేశకారి, హాసుఁడు, ముని, ఆత్మాకరుఁడు, లోకుఁడు, సంభోజ్యుఁడు, సహస్రభోజి, పక్షి, పక్షిరూపి, విశ్వదీపుఁడు, విశాలపతి, ఉన్మాదుఁడు, మదనాకారుఁడు, తీర్థము, అర్థకరుఁడు, అవముఁడు, వామదేవుఁడు, వాముఁడు, ప్రాగ్దేవుఁడు, వామనుఁడు, సిద్ధయోగాపచారి, సిద్ధుఁడు, సిద్ధార్థసాధకుఁడు, భిక్షువు, భిక్షురూపి, విపాణి, మృదువు, అవ్యయుఁడు, మహాసేనుఁడు, విశాఖుఁడు, షష్టినాగుఁడు, విశాలపతి, వజ్రహస్తుఁడు, ప్రతిష్ఠంభి, వజ్రస్తంభనుఁడు, క్షమావ్రతకరుఁడు, కాలుఁడు, మనువు, మధుకరుఁడు, చలుఁడు, వానస్పత్యుఁడు, వాజిమేధుఁడు, ఆశ్రమపూజితుఁడు, బ్రహ్మచారి, లోకచారి, సర్వచారి, సుచారవిత్తు, ఈశానుఁడు, ఈశ్వరుఁడు, కాలుఁడు, నిశాచారి, అనేకదృక్కు, నిమిత్తస్థుఁడు, నిమిత్తుఁడు, నంది, నందికరుఁడు, హరుఁడు, నందీశ్వరుఁడు, నందిమంతుఁడు, నందివర్ధనుఁడు, భగాక్షినిహంత, కాలుఁడు, బ్రహ్మవిధ్వరుఁడు, చతుర్ముఖుఁడు, మహాలింగుఁడు, చతుర్లింగుఁడు, లింగాధ్యక్షుఁడు, లోకాధ్యక్షుఁడు, మహాధ్యక్షుఁడు, యుగావహుఁడు, బీజాధ్యక్షుఁడు, బీజకర్త, అధ్యాత్మానుగతి, బలి, ఇతిహాసకర్త, కల్పుఁడు, గోత్రముఁడు, జలేశ్వరుఁడు, దంభుఁడు, దంభకరుఁడు, రంహుఁడు, వశ్యుఁడు, వశ్యకారి, కలి, లోకకర్త, పశుపతి, మహాకర్త, మహౌషధుఁడు, పరమాక్షరుఁడు, బలవంతుఁడు, శుక్రుఁడు, నీతి, అనీతి, శుద్ధాత్మ, శుద్ధమాన్యుఁడు, గతాగతుఁడు, బహుప్ర

సాదుఁడు, సుస్వప్నుఁడు, దక్షిణోఘుఁడు, అమిత్రజిత్తు, వేదకారుఁడు, స్తోత్రకారుఁడు, విద్వాంసుఁడు, పరముఁడు, తపస్సు, మహామేఘనినాది, మహాఘోరవశీకరుఁడు, అగ్నిజ్వాలి, మహాజ్వాలి, అతిధూముఁడు, హుతము, హవి, వృషణుఁడు, శంకరుఁడు, నిత్యుఁడు, వర్చస్వి, ధూమకేతనుఁడు, నీలుఁడు, స్నిగ్ధాంగుఁడు, లుబ్ధుఁడు, శోభనుఁడు, నిరవగ్రహుఁడు, స్వస్తిదుఁడు, స్వస్తిభాగుఁడు, భాగి, భాగకారి, లఘువు, ఉత్సంగుఁడు, మహాంగుఁడు, మహాగర్భపూరుఁడు, యువ, కృష్ణవర్ణుఁడు, సువర్ణుఁడు, సర్వప్రాణేంద్రియుఁడు, మహాపాదుఁడు, మహాహస్తుఁడు, మహాకాయుఁడు, మహాయశుఁడు, మహామూర్ధుఁడు, మహానేత్రుఁడు, మహామాత్రుఁడు, విశాలయుఁడు, మహాదంతుఁడు, మహాకర్ణుఁడు, మహేషువు, మహానుగుఁడు, మహానాది, మహాగ్రీవుఁడు, సుశాంతధారి, మహాచక్షువు, మహావక్త్రుఁడు, అంతరాత్మ, మృగాలయుఁడు, మహాకటి, మహాగ్రీవుఁడు, మహాబాహువు, ప్రతాపవంతుఁడు, సంయోగి, వర్ధనుఁడు, వృద్ధుఁడు, నిత్యవృద్ధుఁడు, గుణాధికుఁడు, నిత్యధర్మసహాయుఁడు, దేవాసురపతి, పతి, అయుక్తుఁడు, యుక్తబాహువు, ద్వివిధుఁడు, సుపర్వణుఁడు, ఆషాఢుఁడు, సుషాఢుఁడు, ధ్రువుఁడు, హరిహరుఁడు, హరుఁడు, వసువు, ఆవృత్తిమంతుఁడు, నిత్యుఁడు, వసుశ్రేష్ఠుఁడు, మహారథుఁడు, శిరోహారి, విసర్పి, సర్వలక్షణభూషితుఁడు, అక్షరుఁడు, అక్షరయోగి, సర్వయోగి, మహాబలి, సమామ్నాయుఁడు, అసమామ్నాయుఁడు, తీర్థసేవి, మహారథుఁడు, నిర్జీవుఁడు, జీవనుఁడు, వాసి, నీరసుఁడు, బహుకర్కశుఁడు, రత్నప్రభూతుఁడు, రత్నాంగుఁడు, మహాహ్రదనినాదకారి, మూలుఁడు, విశాఖుఁడు, నిర్వృత్తుఁడు, వ్యక్తుఁడు, అవ్యక్తుఁడు, నిధి, ఆరోహణుఁడు, నిహూహుఁడు, శైలహారి, మహాతపుఁడు, సేనా

కల్పుఁడు, మహాకల్పుఁడు, యోగము, యోగకరుఁడు, హరుఁడు, యుగరూపుఁడు, మహారూపుఁడు, అయనుఁడు, గహనుఁడు, శరుఁడు, శౌర్యనిర్వాపణుఁడు, పాదుఁడు, పండితుఁడు, విశ్వాలోచనుఁడు, బహుమాలి, మహామాలి, సుమాలి, బహులోచనుఁడు, విస్తారుఁడు, భవనుఁడు, క్రూరుఁడు, కుసుముఁడు, సుఫలోదయుఁడు, వృషజుఁడు, వృషభాంగాంగుఁడు, మల్లిబిల్వుఁడు, జటాధరుఁడు, ఇందుఁడు, విసర్గుఁడు, సుముఖుఁడు, సురుఁడు, సర్వాయుధధారి, నివేదనుఁడు, సుధన్వి, సంగాధారుఁడు, మహాహనువు, గంధమాలి, భగవానుఁడు, సర్వకర్మోత్థానుఁడు, మంథానుఁడు, బహుళుఁడు, శాహువు, సకలుఁడు, సర్వాలోచనుఁడు, ఉరస్తాలి, కరస్తాలి, ఊర్ధ్వసంహననుఁడు, వటువు, ఛత్రపత్రిసువిఖ్యాతుఁడు, సర్వాలోకాశ్రియుఁడు, మహాత్ము, ముండుఁడు, విరూపి, వికృతి, దండి, ముండవికర్షణుఁడు, హర్యక్షుఁడు, కోకసుఁడు, చక్రి, దీప్తజిహ్వుఁడు, సహస్రపాద్ఘుఁడు, సహస్రమూర్ధుఁడు, దేవేంద్రుఁడు, సర్వభూతమయుఁడు, గురువు, సహస్రబాహువు, సర్వాంగుఁడు, శరణ్యుఁడు, సర్వాలోకధారి, పవిత్రుఁడు, త్రిమధువు, మంత్రము, కనిష్ఠుఁడు, కృష్ణపింగళుఁడు, బ్రహ్మదండవినిర్మాత, శతఘ్నీ, శతపాశధృక్కు, పద్మగర్భుఁడు, బ్రహ్మగర్భుఁడు, జలగర్భుఁడు, జలోద్భవుఁడు, గర్భస్థుఁడు, బ్రహ్మవిదుఁడు, బ్రహ్మ, బ్రహ్మజ్ఞుఁడు, బ్రాహ్మణుఁడు, గతి, అనంతరూపి, నైకాత్మ, తిగ్మతేజుఁడు, తమోనుదుఁడు, ఊర్ధ్వగాత్మ, పశుపతి, వాతరంహుఁడు, మనోజవుఁడు, చందని, పద్మనాళాగ్రుఁడు, సురభి, ఉత్తరణుఁడు, నరుఁడు, కర్ణికారుఁడు, మహాసర్గుఁడు, నీలమాలి, పినాకధారి, ఉమాపతి, ఉమాకాంతుఁడు, జాహ్నవీహృదయంగముఁడు, వరుఁడు, వరాహుఁడు, వరదుఁడు, దేవేశుఁడు, సుమహాస్వనుఁడు, మహాప్రసాదుఁడు, అన

ఘుఁడు, శత్రుహంత, శ్వేతపింగళుఁడు, ప్రీతాత్మ, ప్రయతాత్మ,
సంయతాత్మ, ప్రధానవిదుఁడు, సర్వపార్శ్వసుతుఁడు, తార్క్ష్యుఁడు,
ధర్మసాధారణుఁడు, ధరుఁడు, చరాచరాత్మ, సూక్ష్మాత్మ, సువృషాం
కుఁడు, వృషేశ్వరుఁడు, సాధ్యుఁడు, ఋషి, వసువు, ఆదిత్యుఁడు,
వివస్వంతుఁడు, సవిత, అర్చితుఁడు, వ్యాసుఁడు, సర్వార్థసంక్షేపి,
విస్తారుఁడు, పర్యాయుఁడు, భయుఁడు, ఋతువు, సంవత్సరము, మా
సము, పక్షము, సంధ్య, సమాపకుఁడు, కళ, కాష్ఠ, లవము, మాత్ర,
ముహూర్తము, అహస్సు, క్షప, క్షణము, విశ్వక్షేత్రుఁడు, బీజలిం
గుఁడు, బీజము, ఆద్యుఁడు, అనిందితుఁడు, సర్వాది, సదసద్వ్యక్తి,
పిత, మాత, పితామహుఁడు, స్వర్గద్వారము, ప్రజాద్వారము, మోక్ష
ద్వారము, త్రివిష్టపము, నిర్వాణము, హ్లాదనుఁడు, బ్రహ్మలోకపరా
గతి, దేవాసురవినిర్మాత, దేవాసురపరాయణుఁడు, సురాసురగతి,
దేవుఁడు, దేవాసురనమస్కృతుఁడు, దేవాసురమహామాత్రుఁడు, దేవా
సురమహేశ్వరుఁడు, దేవాసురమహాశ్రయుఁడు, దేవాసురగణాధ్యక్షుఁ
డు, దేవాసురగణాగ్రణి, దేవాసురగురువు, దేవాసురపరిష్కృతుఁడు,
దేవాసురమహామంత్రుఁడు, దేవాసురమహేశ్వరుఁడు, దేవాసురమ
యుఁడు, చింత్యుఁడు, అచింత్యుఁడు, దేవాత్మ, సంభవుఁడు, ఉద్భిజ్జుఁ
డు, శుక్రుఁడు, అవేద్యుఁడు, విరజుఁడు, విరజాంబరుఁడు, ఇజ్యుఁడు,
హస్తి, సురవ్యాఘ్రుఁడు, దేవసింహుఁడు, నరర్షభుఁడు, నిరాయుధుఁ
డు, వరశ్రేష్ఠుఁడు, సర్వదేవోత్తమోత్తముఁడు, గురువు, కాంతుఁడు,
నిజుఁడు, సర్వుఁడు, పవిత్రసర్వవాహనుఁడు, ప్రయుక్తుఁడు, శోభ
నుఁడు, వజ్రుఁడు, ఈశానుఁడు, ప్రభువు, అవ్యయుఁడు, శృంగి, శృం
గప్రియుఁడు, రాజు, రాజరాజు, నిరామయుఁడు, అభిరాముఁడు, సుర
గణుఁడు, విరాముఁడు, స్వర్గసాధని, లలాటాక్షుఁడు, విశ్వదేహుఁడు,

హారిణుఁడు, బ్రహ్మవర్చసి, స్థావరగణపతి, సవమేంద్రియవర్ధనుఁడు, సిద్ధార్థుఁడు, సర్వభూతార్థుఁడు, నిత్యుఁడు, సత్యవ్రతుఁడు, శుచి, వ్రతాది, పరమబ్రహ్మ, భక్తపరమగతి, విముక్తుఁడు, దీప్తతేజుఁడు, శ్రీమంతుఁడు, శ్రీవర్ధనుఁడు, గజుఁడు—

అనునీనామంబులచే శంకరుండు ప్రసన్నుండగువఱకును నేను స్తోత్రంబు గావించి యుంటిని. బ్రహ్మాదిదేవతలకును, మహర్షులకును గూడ నవేద్యంబగుతత్త్వముగల స్తవనీయుండును, బూజనీయుండును, వందనీయుండును, జగత్పతియు నగుమహాదేవు నిట్లు స్తోత్రము చేయ వలయును. నేనమ్మహాదేవుని యాజ్ఞానుసారంబుగ భక్తితో, యజ్ఞపతి యు, గతిమంతులకుఁగూడగతియు నగుభగవానునిస్తవంబు చేసితిని. నిత్యయోగపరాయణుండగుమానవుండు, శుచియై పుష్టివర్ధనం బగు నీసహస్రనామావళిచే శంకరునిస్తుతించి యాత్మోద్ధరణంబునకు సమర్థుండు గాఁగలఁడు. ఈనామములు పరబ్రహ్మస్వరూపములు. ఇవి స్వయముగా బ్రహ్మదేవునిచేఁ గీర్తితంబు లయ్యెను. ఋషులును, దేవతలునుగూడ నీసహస్రనామములచేతనే యవ్విభుని వినుతించుచుందురు. ఈవిధముగా నాత్మగతిస్వరూపుండగుమహాదేవునింగూర్చి యాస్తికభావముతో శ్రద్ధాసహితంబుగ జన్మజన్మాంతరంబులయందును స్తోత్రము చేయువారికి భక్తప్రియుండగుశంకరుండు తనసాయుజ్యము ప్రసాదింపఁగలఁడు. జాగ్రదవస్థయందును, నిద్రయందును, మార్గమధ్యంబు నందును, ఎల్లవేళలందును నీశివస్తోత్రము గావించుచుండువారికి సుఖ సౌభాగ్యములు వర్ధిల్లుచుండును. అట్టివారికిసహస్రజన్మములయందు గావించినపాపంబు లన్నియు నశించి నిశ్చలం బగునీశ్వరభక్తి లభించును. సర్వాంతఃకరణంబులచేతను బరమేశ్వరునియందలి నిశ్చల భక్తియే ముక్తికేకాధారంబై యున్నది. అచంచలంబగునీశ్వర

దేవతలకుఁగూడ దుష్ప్రాపంబైనది. అట్టిచో మానవమాత్రుల కెట్లు లభింపఁగలదు ? ఈశ్వరప్రసాదమువలననే మానవులకు భక్తి యుద యింపవలయును. ఆభక్తివలననే తద్భావగతులగుమానవులకుఁ బరమ పదప్రాప్తి యగుచుండును. మహాదేవునియందు నిశ్చలభక్తిభావం బుద యించినంతనే భక్తవత్సలుండగు శంకరుండు ప్రసన్నుండై ముక్తిఁ బ్రసాదించుచుండును.

మహేంద్రకల్పుండును, విశుద్ధబుద్ధియు నగుతండిమునీంద్రుఁ డీస్తవరాజముచేఁ గృత్తివాసుని స్తుతించి యుండెను. ఈస్తవమును భగవానుండగుశంకరుండు స్వయముగా బ్రహ్మ కుపదేశించి యుం డెను. ఆతఁ డింద్రునకును, ఆతఁడు మృత్యువునకును, మృత్యువు రుద్ర గణంబులకును దీనింగూర్చి బోధించియుండెను. ఆరుద్రగణంబులవలనఁ దనమహాతపంబునకు ఫలంబుగా బ్రహ్మసభయందు తండిమునీంద్రుం డీస్తోత్రరాజమును బడసెను. ఆతండి శుక్రునకును, ఆతఁడు గౌతము నకును, ఆతఁడు ధీమంతుండగువైవస్వతునకును, ఆతఁడు నారాయణు నకును, ఆతఁడు యమునకును, ఆతఁడు మృకండునకును, ఆతఁడు మార్కండేయునకును, ఆతఁడు నాచికేతునకును, ఆతఁ డుపమన్యు నకును, ఆతఁడు శ్రీకృష్ణునకును బోధించుటయుఁ గ్రమక్రమముగా నీస్తవరాజము లోకమంతటను బరివ్యాప్తంబయ్యెను. ఇది సర్వకా మదంబును, భోగదాయకంబును, సర్వసిద్ధిప్రదంబును, స్వర్గసాధనం బును, ఆరోగ్యకరంబును, ఆయుష్కరంబును, ధనధాన్యప్రదాయ కంబు నైనది. దానవులు, యక్షులు, రాక్షసులు, పిశాచములు, యాతుధానులు, గుహ్యకులు, భుజంగులు మఱియెవ్వరునుగూడ నీస్తో త్రమునకు విఘ్నంబును గల్పింపఁజాలరు. శుచియు,బ్రహ్మచారియు జితేంద్రియుండునై యోగభంగంబు గాకుండునట్లు వత్సరపర్యంతము

నియమముతో నీస్తోత్రపాఠంబు గావించువాఁడు శంకరసాక్షాత్కార ముం బొందఁగలఁడు. మహాదేవునిసన్నిధిని నిత్యము నీస్తోత్రమును బఠించువాఁడు సర్వపాపవిముక్తుండై యశ్వమేధఫలంబును గాంచఁ గలుగును.

## తులాపురుషదానవిధి

వేదవ్యాసుండు సనత్కుమారునుద్దేశించి యిట్లనియెను. మహాత్మా! ధర్మమువలననే యర్థకామమోక్షంబులు మూఁడును లభించుచున్నవి. ఆకారణముచేతనే పండితులగువారు తపోదానవ్రతాదినియమంబులచే ధర్మాచరణంబునకుఁ బ్రయత్నించుచుందురు. సాత్వికతపంబువలన స్వర్గంబును, అనంతరము క్రోధలోభవివర్జితంబగు రాజత్వమును బిమ్మట జన్మాంతరంబున శంకరపదప్రాప్తియు లభించును. రజోగుణబహుళం బగు తపంబువలన రాజసప్రకృతి యగును. తమోయుతంబగు తపంబువలన క్రూరకర్ముండును నిష్ఠురప్రకృతియు నగును. రజస్తమంబులచే నాక్రమింపఁబడని తపమే సాత్వికంబని కీర్తింపఁబడుచున్నది. అదియే ప్రశస్తమైనది. పర్ణభక్షులును, వాయుభక్షులును, విపినావాసులు నగుమునీంద్రులు సాత్వికతపంబునే యాచరించుచుందురు. రాగాంధులగు మానవులు వనవాసులై యుండియు దోషంబులనే గావించుచుందురు. సాధువులు గృహస్థులై యున్నను జితేంద్రియులై తపంబు చేయుచుందురు. వీతరాగులును, అనింద్యకర్ములు నగువారికి గృహమే తపోవనంబు గా గలదు. చతుర్థాశ్రమము జితేంద్రియులకుఁగూడ సుదుశ్చరమైనది. గృహస్థాశ్రమముకూడ శ్రేష్ఠతమమైనదియే. బుద్ధిమంతులగువా రయ్యాశ్రమమునం దనేకవిధంబులగు

ధర్మకార్యంబుల నిర్వర్తించుచుందురు. తపస్వులు విపినక్లేశంబు లను భవించుచుఁ దపంబు చేయుచు క్షుధార్తులై యన్నదాత లగుగృహస్థు లయింట్ల కేతెంచుచుందురు. గృహస్థులు వారిని బరితృప్తులంగావించి వారితపఃఫలంబులయందు భాగములను గ్రహించుచుందురు. కావున నే సకలాశ్రమంబులయందును గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనది. ఈయాశ్రమధర్మముల నుచితరీతిని నిర్వహించువా రిహలోకంబున విపులైశ్వర్యంబు లనుభవించి పరంబున స్వర్గసుఖంబులం గాంచఁగ లరు. అట్టిగృహస్థులకుఁ బ్రమాదవశంబునఁగలుగుచుండు పాపంబు లెట్టిదానంబుచే వినష్టంబు లగునో యానతీయవలయును.

అని ప్రార్థించుటయు సనత్కుమారుం డిట్లు చెప్పందొడం గెను. సర్వపాపహరంబును, సర్వసంపత్కరంబును, ఐహికాముష్మిక ఫలప్రదంబు నగునట్టిదానంబునుగూర్చి వర్ణించెద నాకర్ణింపుము. ఆదాన మొకశుభదినంబునఁ జంద్రమౌళియగు మహాదేవునిపూజించి నిత్యనైమిత్తికకర్మంబులందీర్చినవెనుక శక్త్యనుసారంబుగఁ గావలయును. పరద్రవ్యముచే దానముగావించువారు నిరయదర్శనము చేయకుండఁ బరమగతిం గాంచఁజాలరు. ప్రజాపీడనమూలంబున లభించినద్రవ్య ముచే దానములం జేసిన శతానీకమహారాజునరకగామియై పుత్త్రసహా యంబునఁగాని తరింపఁజాలక పోయెను. ఇతరులసొమ్ముతోఁ గావించిన దానములుగూడ నట్లే నిష్ఫలంబు లైపోవును. సత్రాదిధర్మస్థానంబు లయందుఁ జేసినదానములలో సగముపుణ్యము వానిని బ్రతిష్ఠించినవా రికిఁ జెందఁగలదు. బహువిత్తసాధ్యంబును, దేహశుద్ధికరంబును, స్వర్గ ప్రదంబు నగునీతులాపురుషదానము ప్రశంసనీయమైనది. పూర్వకా లమునందు రాజవధంబువలనం గలిగినపాపముచేఁ బీడితుండగుభార్గవ రామునకుఁ ద్రిలోచనుం డీదానముంగూర్చి బోధించి యుండెను. పాప

కర్మనిరతులును, వధబంధనక్రియాపరులగు నృపులును, సంకరస్త్రీసమాసక్తులును, మద్యపానతత్పరులును, అభక్ష్యభక్షకులును, భ్రూణహంతకులును, గురుతల్పగులును, మిథ్యావాదులును, విరుద్ధజాతిసంభవులును, అయాజ్యయాజకులునుగూడ నీదానముచే విశుద్ధులగుదురు.

పాపక్షయంబును గోరుమానవులు పూర్వ మీశ్వరునిచేఁ బ్రశంసింపంబడిన యీయజ్ఞమును గావింపవలయును. ఈయాగమునందు ఇంద్రుఁడు, వరుణుఁడు, వాయువు, యముఁడు, నిర్ృతి, శంభుఁడు, సోముఁడు వీరింగూర్చి హోమములం గావింపవలయును. మొట్టమొదట గ్రహక్షత్రపతింగూర్చి మహావ్యాహృతులచే హోమంబుచేసి, సప్తమంత్రములతో హోమంబుగావించి శాకల్యహోమమును నిర్వర్తింపవలయును. అనంతరము యథాక్రమంబుగ సకలదేవతలకు నాహుతు లొసంగి దృఢంబులును, బలయుతంబులు నగు రెండుస్తంభములను నిర్మింపవలయును. తరువాత వినాయకకార్తికేయులను సుగంధవస్త్రాదులచేఁబూజించి సోమద్విజశూలపాణుల నారాధింపవలయును. అందు మహాదేవునుద్దేశించి రుద్రసూక్తంబును జపించుచు నాసనార్ఘ్యపాద్యాదులను సమర్పించి "ఓశూలపాణీ! నీవు నాయజ్ఞంబునుగూర్చి దయచేయుము. నాగోత్రీయుండవగునీ వుమాసహితంబుగ నాపూజల నంగీకరింపుము. బ్రహ్మచేతను, సూర్యరశ్మిచేతను బవిత్రంబగునాపూజను బలిసహితంబుగ రుద్రుండు పరిగ్రహించుఁగాక! సూర్యకిరణంబులచేఁ బవిత్రంబులగు నీసుగంధకుసుమముల నుమాసహితుడగుమహాదేవుండు స్వీకరించుఁగాక! వనస్పతిరసంబును, దివ్యంబును, సర్వగంధంబులయందుత్తమంబును, సకలదేవతలకు నాఘ్రాణయోగ్యంబును నగునీధూపమును శంకరుండు గ్రహించుఁగాక! అగ్నియు, శక్రుండును, జ్యోతియు, సర్వతేజోమయుండును,

ప్రభాకరుండును, మహాతేజుండునగుశివుం డీదీపమును గైకొనుం గాక!" అని యర్చించి పృథివికధిపతి యగునగ్నిని, సురాధిపతియగు నింద్రుని, దినాధిపతియగుసూర్యుని, నక్షత్రాధిపతి యగుసోముని నుద్దేశించి హోమము చేసి మిగిలినదానిని వ్యాహృతులచే హోమము చేయవలయును.

అనంతరము తులయందు ద్రవ్యము నుంచి "ఓతులా! ధరణీదేవి నీతల్లియు, బ్రహ్మదేవుండు నీతండ్రియునై నీవు సత్యధర్మస్వరూపముం గాంచినదానవే మైనచో నిన్నారోహించిన నన్ను భరింపుము" అని ప్రార్థించి తులారోహణంబు చేసి బ్రాహ్మణు నుద్దేశించి "ఓనరసత్తమా! నీవు సత్యబలంబుచే మహాత్ములగుమునిగణంబులకంటెను శ్రేష్ఠత్వముం గాంచితివి. కావున మత్ప్రదత్తంబగు నీద్రవ్యమును స్వీకరింపుము." అని దానము చేయవలయును. ఇట్లొకసారి దానము చేసినచో సర్వపాపవిముక్తియు, రెండుసారులు చేసినచో గణాధిపత్యలాభమును, మూడుసారులు చేసినచో మహాదేవసాయుజ్యంబును లభించును. పూర్ణిమ, యుగాది, చంద్రసూర్యగ్రహణములు మొదలగుపవిత్రసమయములయందును, దీర్ఘక్షేత్రంబులయందును దానముచేయువారు కృతార్థులగుదురు. తులాపురుషదానవిధానము నాకర్ణించువారును, ఈగ్రంథమును దానము చేయువారును, ఈదానము గావింపవలయు నని కుతూహలపడువారునుగూడ సర్వపాపవిముక్తులై స్వర్గలోకావాసు లగుదురు.

## —• తులాపురుషవర్ణనము. •—

విశుద్ధాంతరంగుండును, అక్లిష్టకర్ముండును, మహాత్ముండును, మహామునియు నగుభార్గవరాముసకు దేవదేవుండగు శూలపాణి యెం

దుకొఱ కీతులాపురుషదానమాహాత్మ్యముంగూర్చి తెలిపియు జెన్నో యాతఁడెందుకొఱకీదానము చేసియుండెనో యానతీయవలయు నని వేదవ్యాసుం డడుగుటయు సనత్కుమారుండు చెప్పందొడంగెను. మునిశ్రేష్ఠా! తొల్లి కుశికుం డనురాజేంద్రుం డపుత్రకుండై యజే యుండును, మహాబలవంతుండునగుపుత్రునిం గోరి కఠోరతపంబుగావించుటయు నింద్రుం డాతనియెడలఁ బ్రసన్నుండై తానే స్వయముగా గాధియను నామంబుతో నాతనికి బుత్రుండై యవతరించెను. ఆగాధిరాజునకు సత్యవతి యనునొకపుత్రికారత్నంబు జనించెను. గాధి యాతనయను ఋషిపుత్రుఁడగు ఋచికునికిచ్చి పెండ్లి చేసెను. అందువలన నమ్మునికుమారుం డారాజునెడల నతిప్రీతుండై యొకమహాయజ్ఞంబును గావించి చరువును గ్రహించి రెండుపాత్రములయందు దాని వేర్వేఱుగ నుంచి తనభార్యచేతికిచ్చి దీనిని నీవును, రెండవదానిని నీతల్లియు భుజింపుఁడని నిర్దేశించి చెప్పెను. ఈచరుసేవనంబున నీతల్లికి దీప్తిమంతుండును, అజేయుండును, క్షత్రియవంశపావనుండగుకుమారుండు గను, నీకుఁ దపస్సంపన్నుండును, శమదమాదిగుణాభరణుండును ద్విజశ్రేష్ఠుండు నగుతనయుండును గలుగుదు రనివానిఁ జెప్పి యుంచెను. సత్యవతి యాచరుపాత్రద్వయమును భద్రపఱచియుంచుకొనెను.

మఱికొన్నిదినంబులకుఁ దీర్థసేవనంబునకై పోయినగాధిరాజు పత్నీసహితంబుగ ఋచికాశ్రమంబునకు విచ్చేసెను. అప్పుడు సత్యవతి పరమానందముతో దల్లికాచరుద్వయముం జూపించి తననాథుఁడు చెప్పినవిషయమంతయు నెఱింగించెను. తల్లి యామాట లాలించి దురాశాపరవశయై ప్రమాదవశంబునఁ దనయభాగమును దాను భుజించి తనయంశమును బుత్రికకిచ్చెను. ఆపరివర్తనమును గ్రహింపఁజాలక సత్యవతియు దానిని భుజించెను. అనంతరము సత్యవతి ప్రీ[illegible]

ను, ఘోరదర్శనుండును, క్షత్త్రియాంతకుండు నగు భార్గవుని గర్భము నం దాల్చియుండుటను మహర్షి యగు ఋచీకుండు యోగదృష్టిచే గ్రహించి వరవర్ణిని యగు సత్యవతినుద్దేశించి ఓభద్రా! నీతల్లి పొరపాటున నీభాగంబగు చరువును సేవించినది. అందుచే నీజననికే బ్రహ్మనిష్ఠానిధి యగుతనయుండు కలుగఁగలఁడు. నేనాచరువునందు నాతపోబలం బంతయు వినియోగించితిని. నీతల్లి భాగమును నీవు గ్రహించుటచే నీగర్భమునందు క్షత్త్రతేజస్సంపన్నుం డగు పుత్త్రుండు గలుగును. అందుచే నాతఁడు బ్రాహ్మజాతియందు నికృష్టుం డగును" అని చెప్పుటయు సత్యవతి విచారముతో "నాథా! నీవుజగంబులనుసృష్టించుటకుఁగూడ సమర్థుండవు. అట్టినీకు సుపుత్త్రప్రదానముచేయుట యే పాటిపని? కావున నన్ననుగ్రహించి నాకుసత్సంతానమును బ్రసాదింపుము" అని వేఁడుకొనుటయు మునీంద్రుండు "ప్రియా! నేను సమంత్రకంబుగ నగ్నిస్థాపనంబు చేసి యాచరువును సిద్ధపఱిచితిని. దానిని వేర్వేఱుగ విభజించి యిచ్చితిని. ప్రమాదవశంబున నవి వ్యత్యస్తముగ నుపయోగింపఁబడియెను. ఇఁక వానిబలంబుల ననుసరించి సంతానము కలిగితీరును. దీనిని దప్పించుట కెవ్వరికిని సాధ్యముగాదు" అని యూరకుండుటయు సత్యవతి "స్వామీ! నేనట్టిసంతానమువలన సంతుష్టినందఁజాలను. నాపుత్త్రుం డట్టివాఁడు గాక పౌత్త్రున కట్టిలక్షణములుండునట్లుగనైన ననుగ్రహింపవలయు" నని ప్రార్థించెను. ఋచకుం డట్లే యగుఁగాక యని యనుగ్రహించెను.

పిమ్మటఁగొన్నాళ్లకు సత్యవతి తపోనిరతుండును దాంతుండును, భృగువంశధుండు నగు జమదగ్నియను తనయుం గాంచెను. గాధిరాజునకును వేదవేదియు తపోనిధియు, చండపావకసన్నిభుండు నగు విశ్వామిత్త్రుం డనుపుత్త్రుండు గలిగెను. ఆజమదగ్నికి బ్రాహ్మతు

క్ర తేజోనిధియగు పరశురాముం డుదయించెను. ఆకాలమునందు హైహయవంశజుండును, కృతవీర్యతనయుండునగు నర్జునుం డనురాజుమిగుల దేజస్వియు, బలాఢ్యుండునై తనసహస్రబాహువులచేఁ జిత్రభానునివలెఁ బ్రకాశించుచుండెను. అతఁడు తుషితునిచేఁ దనబాణముఖంబున నగ్నిజ్వాల యుదయించునట్టివరంబును గాంచి యాశరానలంబుచే గ్రామములను, నగరములను, ఘోషములను, బట్టణంబులను సమస్తమును దహింపఁజేయఁదొడంగెను. ఒకప్పు డయ్యర్జునుం డాశ్రమారణ్యమును గాల్చుచుండ నాపస్తంబుండను మునీంద్రుండు దగ్ధంబగుచున్న తనయాశ్రమంబును గాంచి క్రోధప్రదీప్తుండై “భార్గవరామునిచే ఖండితంబగు నీశిరము భూపతితం బగుఁగాక.” యని యక్కార్తవీర్యార్జునుని శపించెను.

పరశురాముండు విద్యార్థియై శివసన్నిధికిం బోయి యమ్మహాదేవునివలన సకలశాస్త్రంబుల నభ్యసించి యస్త్రవిద్యయందుఁగూడ నతినిపుణుండై ధనుర్ధరశ్రేష్ఠుం డయ్యెను. ఇట్లుండ నొకప్పుడు రాజగు నర్జునుండు జమదగ్నియాశ్రమంబునకు వచ్చుటయు జమదగ్ని యాతని కర్ఘ్యసత్కారంబులం గావించెను. అప్పుడు రా జయ్యాశ్రమంబునందున్న కామధేనువుం గాంచి సంతసించి “నీకెన్నియేని గోసహస్రంబుల నిచ్చెదను, నాకీధేనువు నీయవలయును” అని యమ్మునిం బ్రార్థించెను. ముని యందుల కంగీకరింపకుండుటచే ముష్కరుం డగునయ్యర్జునుండు బలవంతముగ నాగోవును దీసికొనిపోవుచుండెను. ఇంతలోఁ బరశురాముం డచ్చటికి వచ్చి యారాజుదుర్ణయముం గాంచి సహింపక పరశుధారియై యాతని నెదుర్కొని మహారణంబు గావించి తుదకాయర్జునుని సహస్రబాహువులను ఖండించివైచి తపంబు చేసికొనుటకై మహేంద్రశైలంబునకుం బోయెను. పిమ్మట నాతఁడు మరలన

త్రవిద్యాపరిశ్రమంబునకై శంకరునిసన్నిధికిం బోయెను. ఆసమయం బునఁ గార్తవీర్యునిపుత్రులందఱుంగలసియాశ్రమంబునకుంబోయిమహా హావంబు గావించి యందు జమదగ్నిమునీంద్రుని నిహతుం గావించి పోయిరి. ఆవార్తనాలకించి మహావీరుం డగురాముండు రాజసింహుం డగునర్జునుని సపుత్రికంబుగ నిహతుం గావించుటయే కాక తనజన కునిశరీరమునం దెన్నిగాయములు తగిలెనో యన్నిసారులు క్షత్రియవి నాశంబు గావింపవలయు నని ప్రతిజ్ఞం గావించి యట్లే భూమండలమం తయు నరాజకంబు గావించెను. రాజపత్నులందఱు నరణ్యంబులకుం బోయి యాశ్రమంబుల నాశ్రయించి యుండి మహాస్తులవలనఁ బుత్రలా భంబులం గాంచుచుండిరి. కొంతకాలమున కావిధముగా మరలక్షత్రి యకులంబు వర్ధిల్లుచుండుటం గాంచి పరశురాముండు క్రోధోద్దీపుండై పోయి మరలక్షత్రరక్తంబుచే భూతలంబంతయుఁ బంకిలంబుగాఁ జేసివై చెను. అనంతర మాతఁ డీధరామండలమంతయును ధరామరులకు దానంబు చేసి మరలఁ దపంబునకుం బోయెను. మరల బ్రాహ్మణుల వలన క్షత్రవంశం బుత్పన్నం బయ్యెను. ఆరాజకుమారులందఱునుబల పరాక్రమసంపన్నులైరి. మరలఁ భార్గవరాముండు వచ్చి గర్భస్థశిశు సహితంబుగ క్షత్రవంశం బంతయును నిర్మూలంబు గావించెను. కొం దఱు రాజపత్నులుమాత్రమప్పు డెట్లో పుత్రరక్షణము గావించుకొని దాఁగియుండిరి.

పరశురాముం డిమ్మహావధంబువలనం గలిగినపాపము శమిం చుటకై యిరువదియొక్కమాఱులు కశ్యపునకుఁ భూదక్షిణాసహితం బుగ గోదానములం గావించి యుండెను. అందువలనను, దపోని యమాదులవలననుగూడ హత్యాదోషంబు శమింపకుండుటచే నాతఁ డశ్వమేధయాగంబు గావించి పాపనిశ్శేషంబగుటకుపాయంబు చెప్ప

వలయు నని కశ్యపునిఁ బ్రార్థించెను. కశ్యపమునీంద్రుం డాతనికి సర్వ దానశ్రేష్ఠంబును, బాపనాశకంబు నగుతులాపురుషదానముంగూర్చి యుపదేశించెను. పరశురాముం డమ్మహాదానంబు గావించి విగత పాపుం డయ్యెను.

ఇమ్మహాదానంబునందు స్వర్ణాభావంబయ్యెనేని రజతంబు నుప యోగింపవచ్చును. మంగళాకాంక్షి యగువాఁడు మధువు, ఘృతము, గుడము, వస్త్రము, సువర్ణము మొదలగువానితోఁ దులారోహణంబు గావింపవలయును. మనోవాక్కర్మంబులచే శక్త్యనుసారంబుగఁ దులా పురుషదానంబు చేయువాఁడు మహాపాపవిముక్తుం డగును. తులాపు రుషదానంబున నెట్టిపాపంబులైనను వినష్టంబులు గాఁగలవు. అట్టి వాఁడు స్వర్గపదంబు నధిరోహింతు రనుట కెట్టిసంశయమును లేదు. రాత్రులను, పగళ్లను, సంధ్యలను, మధ్యాహ్నంబులను, నిశాంతంబు లను మనోవాక్కర్మంబులచేఁ గావించినపాపంబు లన్నియును దులాపు రుషదానంబున నశింపఁగలవు. "బాల్యయౌవనవార్ధక్యంబులయందు జ్ఞానాజ్ఞానకృతంబు లగు నాపాపంబు లన్నియును దులాపురుషరూపి యగునిమ్మహాదేవునియనుగ్రహంబున నశించుఁగాక ! నాచేనార్జింపఁబడి నట్టియు, నాకాశ్రయభూతంబైనట్టియు సర్వస్వము నీతులయందు సమ ర్పింపఁబడినది. ఈధనముతోఁగూడ నాదుష్కృతంబు లన్నియును నాకు దూరంబులగుఁగాక ! మదనుష్ఠితంబు లగుపుణ్యంబులన్నియు నన్నుఁ జెందుఁగాక" అని పలుకుచు దులారోపితంబగుధనమంతయును బ్రాహ్మణులకు దానము చేయవలయును. ఈదానమొక్కబ్రాహ్మణు నకే చేయంజనదు. ఈతులాపురుషమహాదానంబు చేయువాఁడు నిష్క ల్మషుండై పదునల్వురిందుద్రులు పరిపాలించునంతకాలమువఱకును స్వర్గ సుఖంబు లనుభవించుచుండును.

## —♦ బ్రహ్మాండవర్ణనము. ♦—

ముక్తికాము లగుమానవులు సంసారసంతరణార్థమై సర్వోత్తమం బగు బ్రహ్మాండదానము గావింపవలయును. బ్రహ్మాండదానము వలన సకలదానఫలంబులును సిద్ధింపఁగలవు. అమ్మహాదానము చేయువారు సప్తలోకాధిపు లగుదురు. బ్రహ్మాండదాతయగువాఁడు సూర్యచంద్రులును భూమండలము నున్నంతవఱకు బహుబాంధవసహితుండై దేవభవనంబున సర్వాభీష్టఫలంబులననుభవించుచు సుఖించుచుండును. పిమ్మటవిష్ణుసారూప్యంబు గాంచి సకలదేవతాదుర్లభంబగుదివ్యపదంబు నందఁగలుగును.

ఓవ్యాసమునీంద్రా ! ఈబ్రహ్మాండముంగూర్చి సంక్షేపముగఁ జెప్పెద నాకర్ణింపుము. దీనిని విన్నమానవులు సకలపాపవిముక్తు లగుదురు. సర్వకారణంబును, అవ్యక్తంబును, అనామయంబునగు నేశివపదమునుండి యీసమస్తంబును సముత్పన్నంబై యందు విలీనంబగుచుండునో యాదివ్యపదంబునుండి యాకాశంబును, దానినుండి వాయువును, దానినుండి యగ్నియు, దానినుండిజలంబును, దానినుండి పృథ్వియు సంజనితంబు లయ్యెను. ఈపంచభూతసమ్మేళనంబువలన నొకయండం బుదయించెను. కాలాంతరంబున నయ్యండంబు పగులుటయు దానినుండి బ్రహ్మయుద్భవించెను. జలమధ్యంబునందున్న యాయండమునందు పాతాళభువనంబులేడును, ఊర్ధ్వభువనంబులేడును నంతఃస్థితంబులై యుండెను. అది తనవైశాల్యంబుకంటెద్విగుణితం బగునున్నతిం గాంచి యుండెను. దాని కనంతుం డను నాగేంద్రుం డాధారుఁడై యుండెను. ఆతఁడేవిష్ణుం డని కీర్తింపఁబడుచుండును. బ్రహ్మదేవుని యాజ్ఞచే నాతఁడే యీసమస్తమును ధరించి యుండెను. ఆతనిగుణంబులఁ గీర్తించుటకు దేవదానవులలో నెవ్వరును

గూడ సమర్థులు గాఁజాలరు.

దేవర్షిగణపూజితుండును, సిద్ధులచే ననంతనామకీర్తితుండును, స్వస్తికాకారుండును, విమలభూషణవిశిష్టుండును, సహస్రమస్తకుండును, నవ్యక్తుండు నగు నయ్యనంతుండు ఫణామణిసహస్రంబులచే దిఙ్మండలములఁ బ్రకాశింపఁజేయుచుండును. ఆతనిమదఘూర్ణితంబుల గు నేత్రము లగ్నిగోళములవలెఁ బ్రదీప్తంబులై యుండును. ఆతని మస్తకంబునఁ గిరీటమును, గళంబున మాల్యములును, కర్ణంబులఁ గుండలంబులును ప్రకాశించుచుండును. శుభ్రహారంబులను, నీలవసనంబును దాల్చి మహోద్రిక్తుండగునాతఁడు సాయంకాలమున గంగాప్రవాహశోభితంబగు నున్నతకైలాసనగముం బోలి విలసిల్లుచుండును. లాంగలముసలహస్తుం డగునాతఁడు విష్ణుశక్తిస్వరూపిణి యగు వరుణకన్యచే నుపాసితుండై యుండును. ఆతనివదనంబునుండి కల్పాంతంబున విషాగ్నిశిఖాసముజ్జ్వలుం డగురుద్రుండుదయించి జగత్త్రయంబును గ్రసించును. సకలసురపూజితుం డగునాశేషుండు పాతాళమూలమునం దుండి యీభూమండలము నావగింజవలె భరించుచుండును. ఆతని దివ్యరూపబలప్రభావంబులు దేవతలకుఁగూడ వర్ణనాతీతంబులు. కుసుమమాలికవలె భూమండలమును శిరంబునఁ దాల్చి ఫణామణిప్రభలచే దశదిశల వెలిగించు నాతనిమాహాత్మ్యము నెవ్వ రెఱుంగఁగలరు? అయ్యనంతుండు విఘూర్ణితనయనుండై యావులించినప్పుడు గిరికాననసహితంబుగఁ బృథ్వియంతయును జలించిపోవుచుండును. దేవగంధర్వోరగాదులుకూడ నాతనిగుణంబులకంతంబును గానఁజాలకుండుటచే నాతని కనంతుండను నామము గలిగెను. నాగకాంతలకరపల్లవములయందలిరక్తచందన మాతనినిశ్వాసానిలముచేఁ జిమ్మఁబడి దశదిశలనను లేపించుచుండును. పురాణముని యగుగర్గుం డయ్యనంతు నారా

థించి సూర్యాదిగ్రహంబుల చారంబునకు ఫలగ్రహణంబు చేయఁగలి గెను. ఆతఁడు తనమస్తకంబున మహీమండలంబును నితరలోకంబులను, దేవదానవమానవాదులను భరించి యుండును.

ఓమునివరేణ్య ! పాతాళము, సుతలము, వితలము, నితలము, మహాత్సుతలము, అగ్ర్యసుతలము, రసాతలము ననునీయేడులోకంబులును విస్తారంబుకంటె నున్నతియందు ద్విగుణీకృతంబులై యుండును. అచ్చటి రత్నభూములు సూర్యకిరణంబులవలెఁ బ్రకాశించుచుండును. అందనేకముగ రత్నప్రాసాదములును హేమభూములునుగలవు. అందు దానవులు, దైత్యులు, మహాభాగులగునాగులు, రాక్షసులును నివసించి యుందురు. మహామునియగునారదుం డొకప్పుడు స్వర్గంబునకు వచ్చి పాతాళము స్వర్గముకంటెను రమణీయం బైనదని చెప్పియుండెను. వివిధాభరణంబులకుఁ గాంతిదాయకంబులును, హృదయాహ్లాదకరంబులు నగునమూల్యమణిగణంబులచే విరాజిల్లు పాతాళముతోఁ దుల్యం బగులోకము మఱి యెందున్నది ? నిరంతరము నందందు విహరించు దేవకన్యలచే మనోజ్ఞంబగు పాతాళ మెట్టిముక్తపురుషునికైనను రాగముం గూర్పక మానదు. ఆలోకమునఁ బగలు సూర్యరశ్మియు, రాత్రి చంద్రకాంతియును లేవు. శీతాతపబాధ లెందును లేని యాలోకము మణిప్రభాసముజ్జ్వలమై, సకలామోదదాయకమై దివ్యాన్నపానంబులచేతను, దివ్యభోగంబులచేతను సర్వసమృద్ధంబై యుండును. అందజ్ఞాతముగనే కాలము గడచిపోవుచుండును. అందలివనోపవనంబులు కోకిలారావంబులచేతను, సరోవరంబులును, నదులును గనుల కుసుమంబులచేతను నింపుగూర్చుచుండును. ఆపాతాళవాసు లగు దైత్యోరగాదులు తపోబలంబుచే సకలసుఖభోగంబుల ననుభవించుచుందురు.

## నరకప్రశంస.

సనత్కుమారుండు మఱియు నిట్లు చెప్పందొడంగెను. వ్యాస మునీంద్రా ! పాతాళంబున కుపరిభాగంబున రౌరవము, సూకరము, రోధము, తాలము, వివసనము, మహాజ్వాల, తప్తకుంభము, లవణము, విలోహితము, వైతరణి, పూయావహము, క్రిమిలము, క్రిమిభోజనము, అసిపత్రవనము, లాలాభక్షణము, బహిర్జ్వాల, అధశ్శిరము, సందంశము, కాలసూత్రము, తమము, అవీచి, రోధనము, శ్వభోజనము, అదృష్టము, మహారౌరవము, శాల్మలి యనునరకంబులు గలవు. పాపాత్ములగుమానవు లందు వివిధక్లేశంబుల ననుభవించుచుందురు. విప్రవధవిషయంబునఁ గూటసాక్ష్యంబు నిచ్చినవాఁడును, సురాపానరతుండును, నిత్యాసత్యవాదియు నగువాఁడు రౌరవంబునం బడును. భ్రూణహంతయు, పరధనాపహారియు, గోఘాతుకుండును, పైశున్యాదులచే విశ్వద్వేషియు, సురాపాయియు, బ్రహ్మఘ్నుండును, స్వర్ణహారుండును ఇట్టివారిసంసర్గముగలవాఁడును, రాజఘాతియు, వైశ్యహంతకుండును సూకరనరకపతితులగుదురు. మాతృగామియు, భగినీరతుండును, దౌహిత్రుగామియుఁ దప్తకుంభనరకంబునఁ బడుదురు. సాధ్వియగుభార్యను విక్రయించువాఁడును, బాలఘాతియు, భగవిక్రేతయు, భక్తపరిత్యక్తుండును తప్తలోహనరకదుఃఖంబు ననుభవించును. గురుధిక్కారియు, కుటుంబమున కిడక పరోక్షమున భుజించువాఁడును, దైవదూషకుఁడును, వేదవిక్రేతయు, అగమ్యాగామియు, తప్తశిలనరకంబునఁ బడును. మర్యాదాదూషకుం డవీచిరోధనరకంబునను, దేవద్విజపితృరక్షా దూషకుఁడు క్రిమిభక్షనరకంబునను, లోభాశ్రద్ధాదులచే గర్భాచరణంబు గావించువాఁడు క్రిమిలనరకంబునను, యజ్ఞంబులయందు దేవ దానవమానవపితృతర్పణంబు గావింపక భుజించువాఁడును, శస్త్ర

షాదిప్రయోగంబు చేయువాఁడును లాలాభక్షనరకంబునను గూలు దురు. అసత్ప్రతిగ్రహుండును, అయాజ్యయాజియు, అభక్ష్యభక్షకుండును నగుబ్రాహ్మణుఁడు విశసనరకంబునను, సోమవిక్రయుఁడు రుధిరాంధనరకంబునను, మిత్రద్రోహియు, మధులోభంబున మక్షికాఘాతుకుండు నగువాఁడు వైతరణియందును బతితులగుదురు. యౌవనమదంబున మర్యాద నతిక్రమించి యపవిత్రజీవనంబు గావించువాఁడు కృష్ణనరకంబునను, నిష్కారణంబుగ వృక్షచ్ఛేదనంబు సేయువాఁ డసిపత్రవనంబునను, మేషాదిసాధుమృగహంతకులు వహ్నిజ్వాలానరకంబునను, సాధుగృహదాహకు లగ్నిమయనరకంబునను, వ్రతలోపంబు గావించువారు సన్దంశనరకంబునను, బ్రహ్మచర్యవ్రతచ్యుతులును, బుత్రికకడ నధ్యయనంబు సేయువారును శ్వభోజననరకంబునను నిపతితు లగుదురు.

ఇట్టినరకంబు లింకను ననేకశతసహస్రంబు లున్నవి. వానియందుఁజేరి పాపాత్ములు ఘోరయాతనల ననుభవించుచుందురు. నరకకారణంబు లగుపాపంబులును బహుప్రకారంబులై యుండును. మనోవాక్కర్మంబులచే వర్ణాశ్రమధర్మచ్యుతు లగువారుగూడ నరకగాము లగుదురు. స్వర్గమునుండి దేవత లధోముఖులయి నరకవాసులను దర్శించుచుందురు. కాని నారకు లధోముఖులైయుండుటచే దేవతలను దర్శింపనేరరు. స్థావరంబులును, క్రిములును, మత్స్యాదిజలచరంబులును, పశుపక్షిమృగంబులును మొదలగుజీవులు స్వర్గమునందువలెనే నరకమునందును వసించియుండును. ప్రాయశ్చిత్తపరాఙ్ముఖులుగూడ నిరయగాము లగుదురు. పాపంబునకుఁ దగినప్రాయశ్చిత్తము మునులచే నిర్దేశింపఁబడియెను. గురుపాపంబునకు విశేషంబుగను, లఘుపాపంబునకు స్వల్పంబుగను ప్రాయశ్చిత్తంబు గావింపవలయునని స్వాయంభువమను

ల్పించెను. ప్రాయశ్చిత్తానుష్ఠానంబుచే సకలపాపంబులును వినష్టంబు లగును. పాపము చేసితి ననిపరితపించువానికి సర్వప్రాయశ్చిత్తంబులకంటెను శివస్మరణమే శ్రేష్ఠమైనది. త్రిసంధ్యలయందును, రాత్రులందును మహాదేవుని స్మరించుటవలనఁ బాపక్షయం బగును. మహాదేవస్మరణంబునఁ బాపక్లేశంబులు నశించి స్వర్గప్రాప్తియగుటయే కాక ముక్తికూడ లభింపఁగలదు. భక్తిపూర్వకంబుగ శివుని స్మరించువారు పాపముక్తు లగుటచే వారికి నరకగమనంబు లేదు. స్వర్గనరకములు పుణ్యపాపములపరిణామములు. లోకంబునఁ గేవలసుఖదంబును, గేవలదుఃఖప్రదంబు నగునది యేదియును లేదు. సుఖదుఃఖములు మనఃపరిణామమాత్రములు. కావున జ్ఞానమే పరబ్రహ్మంబును సత్యంబు నైనది. ఈవిశ్వం బంతయుజ్ఞానమయమైనది. జ్ఞానముకంటె నుత్తమంబగునది లేదు.

## భూమండలప్రశంస

ఓపరాశరతనయా! జంబు, ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, పుష్కర, శాకద్వీపములేడును, లవణ, ఇక్షురస, సుర, సర్పి, దధి, దుగ్ధ, జలసముద్రంబులచేఁ బరివృతంబులై యుండును. అందు జంబూద్వీపమధ్యంబునఁ గనకమయంబగుమేరుశైలము విరాజిల్లుచుండును ఆపర్వతము పదియాఱుయోజనంబులలోతున నాటుకొన్నదై యెనుబదినాలుగువేలయోజనముల యున్నతి గలిగి శిఖరభాగంబున నిరువదిరెండువేలయోజనముల విస్తీర్ణము గలదై భూమియనెడుపద్మమునకుఁ గర్ణికాకృతిని విలసిల్లుచుండును. దానికి దక్షిణమున హిమవంతంబును హేమకూటనిషధగిరులును, నుత్తరమున నీలశ్వేతవర్ణపర్వతంబులును గలవు. ఈనగంబు లన్నియు రత్నవిశిష్టంబులును, అరుణరాగసమంచి

నకుఁ బూర్వంబున సీతాంజన, కుముద, కురర, మాల్యవంతాదులును దక్షిణమునఁ ద్రికూట, శిశిర, పతగ, రజత, నిషధాదులును, పశ్చిమంబున శిఖివాస, వైదూర్య, కపిల, గంధమాదనాదులును, ఉత్తరమున శంఖచూడ, ఋషభ, హంస, కాలంజనాదులును కేసరపర్వతంబును గలవు. మేరువునకుఁ జతుర్దశసహస్రయోజనోపరిభాగంబున స్వర్గవిఖ్యాతం బగు బ్రహ్మపురంబును, దాని దిగ్విదిక్కులయం దష్టదిక్పాలకుల పురవరంబులును విలసిల్లుచుండును. బ్రహ్మపురము నలుదెసలనుండియు, విష్ణుపదోద్భవ యగు గంగ నభోమండలమును దడుపుచు స్వర్గమునుండి నిపతితం బగుచుండును. ఆగంగానది సీత, అలకనంద, చక్షు, భద్ర యనునామంబులచేఁ జతుర్విధంబుల విభక్తంబై మేరువునకు నాల్గువైపులను బ్రవహించుచు మహాసాగరమునఁ జేరుచుండును. సునీలము, నిషధము, మాల్యవంతము, గంధమాదనము నను నీనాల్గు శైలంబులకు నడుమ మేసువు కర్ణికాకారంబున నొప్పుమీఱుచుండును. ఆమేసువునకు, భరత కేతుమాలాభద్రాశ్వకురుభూములు పత్రాకృతిం దాల్చి బహిస్సీమలై యుండును. దానిజఠరదేశంబున దేవకూటంబు గలదు. దానికి దక్షిణోత్తరంబులం గల గంధమాదనకైలాసములు పూర్వపశ్చిమవ్యాప్తంబులై యుండును. పూర్వపశ్చిమంబులం గల నిషధనీలంబులు పూర్వోత్తరవ్యాప్తంబులై యుండును. ఈసకల భూధరంబులయందలి భూభాగములును దేవగంధర్వయక్షరాక్షససేవితంబులగు పురకాననాదులచే నలరారుచుండును. ఆశైలద్రోణులయం దహోరాత్రములు దేవదానవులు విహరించుచుందురు. అవియన్నియు ధార్మికనిలయంబులై భూతలస్వర్గములై పాపాత్ములకు దుర్గమంబులై యుండును. తక్కిన కింపురుషాదివర్షంబులుగూడ శోకాయాసోద్వేగక్షుద్భయాదిరహితంబులైయుండును. అందలిప్రజలు స్వస్థచిత్తులును, నిరాం

తకులును, దుఃఖవర్జితులును, దశసహస్రవర్ష జీవులు నై యుందురు.

*  *  *  *  *

మును లిట్లు ప్రశ్నించిరి. మహాభాగా! సర్వార్థసాధకంబును భుక్తిముక్తి ప్రదంబును, మంగళదాయకంబు నగుమహాదేవుని షడక్షర రమమంత్రముంగూర్చి నీవు పూర్వము వచించి యుంటివి. మేమింకన బరమసాధనంబులగుమంత్రములను వినఁగోరుచున్నాము. సూతమా డవ్యాదిమునులును, సిద్ధులును బూర్వమేమంత్రబలంబుచే శివప్రస దముం గాంచఁగలిగిరో యామంత్రములంగూర్చి తెలుపవలయును అనుటయు సూతుండిట్లనియెను.

తపోధనులారా! తొల్లిశంకరుఁడు కుమారున కుపదేశించి శివప్రియంబగు మంత్రముంగూర్చి తెలిపెదను వినుఁడు. మొదట బ్రణవంబును, బిమ్మటఁ బ్రాసాదబీజంబును నుచ్చరించి పంచమస్వ సహితంబును బిందుయుతంబునగుచవర్గతృతీయాక్షరమును రెండుసార లుచ్చరించి తరువాతవిసర్గయుతం బగుపవర్గతృతీయాక్షరము నుచ్చరిం పవలయును. ఇదియే మహాదేవుని సర్వార్థసాధకం బగుపరమమం త్రము. ఇది శ్రేష్ఠంబును, బరమంబును, బవిత్రంబును మోక్షదంబును బరమవిభుస్వరూపంబు నైనది. దీనివలన మహాపాతకోపపాతకాదుల న్నియు నశింపఁగలవు. ఈమంత్రమును నూటుసారులు జపించుచు మహాదేవుని బుష్పములతోఁ బూజించువాఁడుపాపదూరుండై కోటిజ న్మార్జితపుణ్యలాభంబు నందును. త్రిసంధ్యలయందు నీమంత్రరాజ మును శతవారంబులు జపించువానికి మృత్యువు వశమగును. సృష్టి న్యాసక్రమంబున లలాటము, వక్త్రము, హృదయము, నాభి, గుహ్య ము, బాహువులు, హస్తములు, పార్శ్వములు, పృష్ఠము, జానులు, జంఘలు, గుల్ఫములు, పాదములు వీనియందుమంత్రస్మరణపూర్వకం

బుగ న్యసించువాఁడు శతకోటిజన్మపాపవిముక్తుండై, వజ్రోపలాదిమహా వర్షణంబువలనను, చోరవ్యాఘ్రాదిభయంబువలనను, జ్వరాదిరోగంబులవలనను, సకలదుఃఖంబులవలనను ముక్తుండగును. అట్టివానికి సంగ్రామవిజయంబును సౌభాగ్యంబును లభించును.

ఈమంత్రము నెల్లప్పుడును దివారాత్రములు మనంబున జపించుచుండు సాధకుండు సిద్ధుం డగును. మృత్యుంజయయంత్రస్థితుండై సతీసహితంబుగఁ ద్రిసంధ్యలయందు నీమంత్రమును జపించువాని కుపవాసహోమ(స)బ్రహ్మచర్యాదులతో నిమిత్తంబులేక సర్వకర్మంబులయందును సిద్ధిలాభంబగును. మఱియు సుఖాసీనుండై శ్రేష్ఠం బగుకుంభముద్రం దాల్చి యాత్మదేహంబున దాలుదేశస్థితంబగు సహస్రదళశ్వేతపద్మమునుండి సుధాకరుం డమృతవర్షణంబు చేయుచున్నట్లు భావించుచు నీమృత్యుంజయమంత్రరాజమును ధ్యానింపవలయును. ఇట్లు చేయువానికి దివ్యరూపంబును, అణిమాదిసిద్ధియు, స్వేచ్ఛాగతియు, కామరూపంబును లభించును. అతఁడు సర్వజ్ఞుండును, సర్వగుండును, వ్యాప్తుండును, దూరదర్శియు నగును. ఒకసంవత్సర మట్లు సమాహితచిత్తంబున నుపాసించినచో నీసద్గుణంబు లన్నియు లభించును. ఈ ధ్యానాభ్యాసమువలన ఖేచరత్వముకూడ లభించును. ఈమంత్రప్రభావము తొల్లి మహాదేవుండు దేవికికిని, గార్తికేయునకును, నందికిని బోధించి యుండెను. నేనద్దానిని సంక్షేపముగఁ జెప్పితిని. ఈమంత్రరాజముచేతనే యగస్త్యాదిమహార్షులు జరామరణవర్జితులైరి.

ఒకప్పుడు భవాని శివుం గాంచి " మహాత్మా! ఈజగంబంతయును గామక్రోధాదులచేతను, రజస్సుచేతను, సుఖదుఃఖాదులచేతను వ్యాకులమైయున్నది. ఇందు మానవులకు మోక్షోపాయంబు దుగూర్చి యొఱింగింపవలయును. " అనుటయు శంకరుం డో దేవీ! ఈదేహము

నందు దీనికంటెభిన్నంబగు నహమనునదియే పండితులకుఁ జింతనీయ మైనది. ఆమూలమున జ్ఞానలాభముం గాంచువారు భవబాధముక్తు లగుటకు సమర్థులగుదురు. "నేను, నాది" యనుభ్రాంతియే దుఃఖ కారణ మగునజ్ఞానము. "ఇది నాదికాదు" అను తెలివియే సుఖకర మగుజ్ఞానము. ఈజ్ఞానాజ్ఞానములే మోక్షమునకును బంధమునకును హేతువులు. తనదేహమే తనది కానప్పుడు తనకు దారపుత్రాదులు ను, గృహక్షేత్రాదులు నెక్కడివి? అట్టిబంధమునఁ దగిలినవానికి ముక్తిలేదు. ఈపాశుపతయోగరహస్యమును సంక్షేపముగఁ జెప్పితిని. అనిన దేవి మహాదేవా! ఈనీతత్త్వ మజితేంద్రియులకు బోధపడునది కాదు. చంచలహృదయము లెప్పుడు నహంభావమునే బోధించుచుం డునుగదా! కృతయుగాదులయందుఁగూడ నెన్నియో జన్మాంతరంబు లకుఁగాని యింద్రియవిజయంబు లభించుట లేదు. అట్టిచో నల్పాయు ష్కులగు కలిప్రజల కట్టిభాగ్య మెట్లుసిద్ధించును. కావునఁ బాపయు క్తులగుమానవులు భవార్ణవంబును దరించుసులభోపాయంబు నానతీయ వలయును. అని వేడుటయుఁ గృపామయుం డగుపరమేశ్వరుండు లోకహితార్థినివగునోదేవీ! క్లేశనాశకం బగుక్రియాయోగముంగూర్చి చెప్పెదను వినుము.

పరమాత్మయందుఁ జిత్తసంకలనంబు గావించుయోగము సాధు పులకుమాత్రమే సిద్ధించుచున్నది. బాహ్యార్థంబు లగుమూర్తిపూజా జపాదులచేఁ గావించు నాత్మయోగము క్రియాయోగ మనంబడును. కావున మొట్టమొదటఁ గ్రియాయోగము నాచరింపవలయును. పరమ పదలాభంబునకుఁ గ్రియాయోగంబుకంటె నన్యోపాయం బేదియును లేదు. మనంబును గ్రియాయోగాశ్రితంబుగఁ జేసి యెల్లవర్ణంబులవా రును మదనుష్ఠానతత్పరులై లింగార్చనంబు చేయవలయును. అట్టివా

రికి దుర్లభం బేదియును లేదు. లింగపూజయందు నైష్ఠికులును, తద్గత చిత్తులును, తత్కథాసక్తులును, తదాశ్రితులును, శివపూజానిరతులు ను, లింగార్చనాసక్తులును, వ్రతోపవాసతత్పరులును, హింసావర్జితు లు నగునరోత్తములు రుద్రతుల్యులై నాలోకంబున వసించియుందురు. ఈశ్వరుండ నగునన్ను సర్వాంతర్యామిగ నవలోకించుచు, సర్వభూతం బులును నాకంటె భిన్నంబులు గావని భావించువాఁడు నిస్సంశయము గా రుద్రుఁడే యగుచున్నాఁడు. స్థావరజంగమాత్మకంబగు బ్రహ్మాం డంబంతయు మత్స్వరూపంబని గ్రహించువాఁడు రుద్రస్వరూపుఁడే యగును. స్వర్ణరజతాదులచేఁగాని, తదితరధాతువులచేఁగాని, రత్న శిలామృత్తికాదులచేఁగాని విధివిధానంబున లింగనిర్మాణంబు చేసి స్థా పించి ప్రతిదినంబును భక్తిపూర్వకంబుగ వివిధపూజోపహారంబులచే నర్చింపవలయును. సర్వకాలంబులయందు, సర్వావస్థలయందును పా ర్శ్వంబులను, ఎదుటను, వెనుకను, ఊర్ధ్వాధోదేశంబులను నన్ను ధ్యా నించువాఁడు ముక్తుం డగును. మద్భక్తుండగువాఁడు ప్రణతుండై శుద్ధ జలఘృతాదులచే నభిషేకించి చందనాగరుకర్పూరాదులచేతను, మనో హరగీతవాద్యాదులచేతను, విశుద్ధవసనభూషణాదులచేతను మత్ప్రీతి కరంబుగ లింగార్చనంబు గావింపవలయును. నాచరిత్రశ్రవణంబున సం దాసక్తుండై, నన్నీశ్వరునిగ ధ్యానించుచు, నాపురాణంబుల నాలించు చు మత్పరాయణుం డగుమానవుఁడు సర్వాభీష్టభోగంబులను బడయఁ గలఁడు. నాసేవయం దాసక్తుండగువానికిఁ బరమపదంబు లభింపఁగలదు. చిత్తగతంబును, బుద్ధిగతంబును, దేహగతంబు నగునహంకారరూప మున గోచరించుచుండు మంగళప్రదుండగురుద్రుఁడే శివుఁడు. ఆతఁడే స్థావరజంగమాత్మకం బగుసమస్తమునకును గర్త. ఇట్టిజ్ఞానంబు గల మానవుఁడు భవబంధవిముక్తుఁ డగును. నాయందే వినియోగించునత

కర్మంబులు ననంతఫలదంబులై జీవుల నుద్ధరింపఁగలుగును. ఇది మానవులకు సులభంబగు మోక్షసాధనము. క్రియా యోగమును, జ్ఞానయోగమునుగూడ ముక్తిసాధనములే. కాని జ్ఞానయోగము దేవతలకుఁగూడ నసాధ్యమైనవి. క్రియాయోగమున దేవత్వమును బిమ్మట ముక్తియు లభించును. వాయుయుతం బగువహ్ని తృణరాశిని దహించునట్లు లింగార్చనముచే సమస్తపాపములును నశింపఁగలవు. శివారాధనంబు సేయనిజన్మము నిరర్థకమైనది. శివపూజలేక మణికనకవస్త్రభూషణాదిభోగంబులు లభింపవు. బహుయుగంబులకుఁ గర్మభూమియందు మానవజన్మంబు గాంచియు లింగార్చనంబు చేయనివాఁడు నిరర్థకుఁడు. ద్విజాతులు వేదమంత్రంబులచేతను, అనధికారులగు శూద్రులు పౌరాణికమంత్రంబులచేతను లింగార్చనంబు చేయవలయును. సకలమంత్రంబులును, జరాచరజగంబును శివునియందుఁ బరివ్యాప్తంబులైయున్నవి.

పంచభూతములును, చంద్రసూర్యాదులును, శివప్రకృతులే. సకలదేవతలును మంత్రాత్మకులు. ఆమంత్రము లన్నియు బిందువు నాశ్రయించి యుండును. ఆబిందువు నాదమునందును, నాదము పరమాత్మయందును సుస్థితంబై యుండును. సర్వమయుండగు నమ్మహాదేవుం డామంత్రంబులచేఁ బూజితుండగును. యకారంబున కష్టమంబగుబీజమును బిందుయుక్తం బగుద్వాదశమాత్రతోఁ జేర్చి యుచ్చరించి వచో షడంగన్యాసయోగ్యం బగుశివమంత్రంబగును. ఈమంత్రోపాసనమే శివపూజ యగుచున్నది. ఇట్లు శివపూజ చేయువాని కిహపరంబులయందు సర్వాభీష్టసిద్ధియగును. ఈమంత్రము సత్యమై సర్వవ్యాప్తమై నిత్యమైయున్నది. కావున దీని నతిప్రయత్నంబున ధ్యానించుచు బూజింపవలయును. మహాశతనుతమంతంబును, గళాయుక్తంబు

నగుపంచమంత్రజ్ఞానంబు లేనివాఁడు మాహేశ్వరుండు గాఁజేరఁడు. ఈమంత్రపంచకము సకలమంత్రంబులయందును శ్రేష్ఠమైనది. ఈమంత్రోపాసనంబునఁ బ్రాప్తింపనిసిద్ధు లేవియును లేవు. ఈమంత్రసాధనంబువలన దేవమానవగంధర్వరాక్షసత్వాదిసిద్ధులుగలుగును. దీనిప్రభావంబునఁ ద్రైలోక్యస్త్రీవశ్యంబును, నణిమాదిసిద్ధులును లభించును. దేవతలు, దైత్యులు, సిద్ధులు, యక్షులు, ఉరగులు, రాక్షసులు మొదలగువా రందఱు నిమ్మంత్రబలంబునకు వశీభూతు లయ్యెదరు. మృత్యుపీడ, గ్రహబాధ, మున్నగునవి యీమంత్రస్మరణమాత్రమునఁ దొలఁగిపోవును. దీనిప్రభావముచే స్థావరజంగమనఖదంతోద్భూతంబులగువిషయంబులన్నియు వినష్టంబు లగును. ఈదివ్యమంత్రము నూఱుసారులు జపించిన శతజన్మపాపంబులు నశించును. మఱియు స్వర్గమోక్షలాభంబులు సిద్ధించును.

## —♦ పంచబ్రహ్మాఖ్యానము ♦—

మనోరమం బగుగుప్తదేశంబున శుచిస్నాతుండై యేకాగ్రచిత్తంబున మంత్రజపపూర్వకంబుగ నంగన్యాసకరన్యాసంబులు గావింపవలయును. "ఓం హ్రాం హృదయాయనమః" అని హృదయంబును, "ఓం హ్రీం అఘోరేభ్యః శిరసేస్వాహా" అని శిరంబును, "ఓం హ్రూం ఘోరఘోరతరేభ్యః శిఖాయైవషట్" అని శిఖను, "ఓం హ్రైం సర్వతః సర్వేభ్యః కవచాయ నమః" అని కవచంబును, "ఓం హ్రౌం నమస్తేరుద్రరూపేభ్యో నేత్రాభ్యాంవషట్" అని నేత్రంబులను "ఓం హ్రః అస్త్రాయఫట్" అని చతుర్దిశలను న్యసింపవలయును. అనంతరము నాదబిందుకళాయుతంబును రకారయుక్తంబు నగుహాకారమును హృదయంబున నిలిపి పూజించి తదుత్సంగదేశంబున దండశశికరాంశు

శకర్తరీధ్వజధారిణియగునఘోరేశ్వరి నారాధింపవలయును. "అఘోరేశీ హ్రీంహుంఫట్" అనునిమ్మహామంత్రముచే బూజితయైనయద్దేవి సద్యఃప్రసన్న కాఁగలదు. ఈరీతిగా నేకాగ్రచిత్తంబున మానసికారాధనంబు గావించినచో నిహపరలోకంబులయందు సర్వాభీష్టంబులును సిద్ధించును. కపాలమాలికాలంకృతుండును, చతుర్భుజుండును, లలాటలోచనుండును, శూలపాణియు, నభయప్రదుండును, చంద్రశేఖరుఁడు నగుమహాదేవుని ధ్యానించినచో నభిమతసిద్ధియగును. ఆరాధకుం డెట్టియవస్థయందున్నను శంకరుని బూజించునప్పుడు పవిత్రుఁడే యగును.

శుచిప్రదేశంబున లింగస్థాపనంబుచేసి లక్షజపించి బిల్వపుష్పంబులచే హోమంబాచరించువానికి మహాదేవుండు సాక్షాత్కరించి యణిమాదిసిద్ధులను బ్రసాదించును. అశోకమలకుసుమంబులచేఁ బూజించి హోమంబు చేయువాఁడు జరామరణవివర్జితుండగును. శ్రీపత్రములు, గుగ్గులు మొదలగువానిచే విధ్యుక్తముగ వ్రేల్చువాఁడు పాతాళంబున సిద్ధుండగును. క్లేశనాశకంబగు నీఘోరమంత్రమును సర్వదా జపించువాఁడు సర్వార్థసిద్ధుం డగును. తిలాహోమంబున గ్రహపీడావినాశంబును, ఘృతశర్కరాహోమంబున నాయుర్వృద్ధియు, క్షీరసమిధలతోడి హోమంబున సమృద్ధియు నగును. అఘోరదేవునివలెనే యఘోరేశ్వరిఁ గూర్చికూడ జపార్చనంబులు గావించువాఁడు ద్విగుణీకృతఫలసిద్ధుం డగును. అఘోరేశ్వరి నారాధించువానికిఁద్రిభువనదుర్లభంబులగునభీష్టంబు లన్నియు సిద్ధింపఁగలవు. అఘోరేశ్వరీముద్రను దేవీప్రసన్నతకొఱకుఁ బ్రదర్శింపవలయును. ఉభయహస్తాంగుళంబుల నభిముఖంబులుగఁ జేసి తర్జనీద్వయంబుచే ననామికాద్వయంబును గ్రహించి యుభయమధ్యమాంగుళులచే నుభయాంగు

ష్టంబుల నాశ్లేషించి యధోముఖముద్రం గావించి లలాటంబున నుంచి నేత్రనిమీలనంబు చేసి జిహ్వాచాలనం బొనర్చుచు సర్వసిద్ధిప్రదం బగు పరమమంత్రమును స్మరింపవలయును. అందువలన సర్వభూతసిద్ధియు, దేవాసురమానవాదిగ్రహపీడావినాశంబును సర్వజనవశ్యంబును లభించును. లింగంబునఁగాని భూతలంబునఁగాని యిట్లు పూజించువాఁడు సర్వార్థసిద్ధుం డగును. ఈపూజాఫలంబువలన నిహపరసుఖంబులు లభించును. ఆగమోక్తంబులగు పంచమంత్రంబులచేతను శివపూజం గావించువానికి స్వర్గమోక్షంబులు సిద్ధించును. కావున నిశ్చలభక్తి యుక్తులై సర్వకామఫలప్రదంబగుశివపూజం గావింపవలయును.

## —♦ పంచబ్రహ్మమాహాత్మ్యము. ♦—

సనత్కుమారుం డిట్లనియెను. ఓవ్యాసమునీంద్రా! స్థావరజంగమాత్మకం బగునీజగం బంతయును బంచభూతమయమైనది. దీనియందు సకలజీవులును దమతమకర్మవశంబున నుదయించుచుందురు. ఆహారనిద్రాభయమైథునాదులు సకలజీవులకును సమంబులై యుండును. అందు జ్ఞానులు కర్మం బాచరించియు సంసారబద్ధులు కారు. జ్ఞానహీనులగుపసువులు కర్మబద్ధులై పుట్టుచుఁ జచ్చుచుందురు. మఱియుఁ బాపాత్ములై నరకపతితు లగుచుందురు. పాపభోగానంతరంబున బహుజన్మపరంపరలం గాంచి తుదకు నీచమానవజన్మంబు గాంచఁ గల్గుదురు.

ఒకప్పుడు పంచబ్రహ్మవిధానముంగూర్చి పార్వతి ప్రశ్నించుటయు శివుం డిట్లు బోధించెను. దేవి! సర్వసిద్ధిప్రదాయకంబును శివభక్తుల కిహపరసాధకంబు నగుపంచబ్రహ్మవిధానముచు జెప్పెద వినుము. కపిలగోసంబంధములైన పంచగవ్యంబులచే నభిషేకించి యష్టకం

బును జపించి యష్టసహస్రతిలహోమంబు చేయువాఁడు పాపముక్తుం డును, కలశంబున జలంబునిక్షేపించుచు నయుతజపంబు చేసి ప్రతిదినంబు నయ్యుదకంబుచే స్నానంబు చేయువాఁడు లక్ష్మీయుతుండును, బుత్రవంతుండు నగును. సూర్యోదయంబుమొదలుగ నస్తమయపర్యంతమును దక్షిణామూర్తిమంత్రమును జపించుచు నెనిమిదివేలహోమము చేయువాఁడు సకలోపపాతకవిముక్తుండగును. పంచామృతమిశ్రితం బగుగుగ్గులుహోమంబువలన యక్షరాక్షసాదివశ్యంబును, సంగ్రామవిజయంబును, అక్లేశంబును గలుగును. విపత్సమయంబులయందు మహాదేవునిదక్షిణభాగంబున నుపవసించి త్రిరాత్రంబు లక్షసహస్రజపం బాచరించి దధిమధుఘృతయుతంబులగుసమిధలచే వేల్చువాఁడు విపన్ముక్తుం డగును. కపిలగోదధిఘృతమధుమిశ్రితంబగునోదనంబుచే సహస్రహోమంబు చేయువానికి సుపుత్రలాభం బగును. ఘృతయుతం బగుగుగ్గిలముచే సహస్రహోమంబు చేసిన సకలలోకవశ్యంబును, లక్షహోమంబు చేసిన నిధిలాభంబును బ్రహ్మహత్యావిముక్తియు శివసాయుజ్యంబును సిద్ధించును. భిక్షాహారియై మంత్రజపంబు చేయుచు జలంబునుగాని, బిల్వపత్రంబునుగాని, బిల్వఫలంబునుగాని మహాదేవుని కర్పించువాని కశ్వమేధఫలంబు లభించును. సఘృతంబు లగు వ్రీహితిలామలతోఁగూడ సుధనీమూలంబులను శతహోమంబు గావించువానికులంబునం దెన్నఁటికిని దారిద్ర్యంబు గలుగదు. దుర్గమపథంబులఁ జరించునప్పుడును, భయాతురుండైనప్పుడును నదీతరణంబు సేయునప్పుడును అష్టశతమంత్రజపంబు చేసిన క్షేమంబు గలుగును. ఊర్ధ్వబాహుండై సూర్యాభిముఖంబుగ శివార్చనంబు చేయువాఁడు బ్రహ్మహత్యావిముక్తుండును, సప్తదినంబులు సలిలస్థుండై జలమాత్రము పానము చేయుచు శివపూజ చేయువాఁడు సురాపానాదిపాపవిము

క్తుండును, ఏకమాసంబు నిరాహారియై, విషయంబుల నిగ్రహించి త్రిసంధ్యలయందు జపంబు చేయువాఁడు సమస్తపాతకవిముక్తుం డగును గావున నీచప్రతిగ్రహ, నీచాన్నభోజనాదిదోషవిముక్తుండును నగును. నిత్యంబును స్నానసజపంబు చేయువానికి గజసింహాదిక్రూరమృగంబులవలనను, శత్రువులవలనను భయంబు గలుగదు. మనంబున నిత్యశివధ్యానరతుం డగువాఁడు కాయసిద్ధుండును, బరమపదప్రాప్తుండును నగును. పంచమంత్రజపంబువలన సకలదోషవినాశంబును, శివసాయుజ్యంబును గలుగుననుట కెట్టిసంశయమును లేదు.

—♦ తత్పురుషవిధానము ♦—

ఓ దేవి! తత్పురుషమంత్రముచే లక్షసంఖ్యాపురశ్చరణంబు చేయువాఁడు బ్రహ్మహత్యావిముక్తుం డగును. నిర్జనంబుగ రాత్రికాలంబున మేకకుడిచెవిని స్పృశించుచు దక్షిణాముఖలింగంబున జపించువాఁడు రూపవంతుండై యక్షిణీసిద్ధుం డగును. నా[illegible]ణంబు చేయుచు ఘృతయుతంబు లగుకరవీరకుసుమంబులచే హోమంబు చేయువానికి సప్తదినంబులలో స్త్రీవశ్యంబును, కర్పూరాగరుయుక్తహోమంబు చేయువానికి వత్సరార్ధమధ్యంబున దేవగంధర్వరమణీవశ్యంబును గలుగును. శివలింగంబు నాశ్రయించి నియతచిత్తంబునఁ బ్రతిదినంబును మంత్రజపంబు చేయువాఁడు శరీరాంతమున సాయుజ్యంబు నందును. సూర్యాభిముఖుండై జపించువాఁడు పాపముక్తుండగును, లవణయుక్తతిలాహోమంబు చేయువాఁడు వశీకృతశత్రుండగును, ఘృతాక్తతిలహోమంబు చేయువాఁడు కీర్తిమంతుండగును, దూర్వాంకురయుక్తతిలహోమంబు చేయువాఁ డాయుష్మంతుండగును, పుష్పసహోమంబు చేయువాఁడు పీడావిముక్తుండును, సర్షపహోమంబు చేయువాఁడు నిర్భయుండ

నగును. గ్రహణంబులయందు దక్షిణామూర్తిలింగముం గూర్చి యష్టస హస్రజపంబు చేయువానిసర్వాభీష్టంబులును సిద్ధించును. ఒకవత్సరము గాని, యంతకెక్కుడుగఁగాని సర్వదా జపించువానికి కన్యకాశీఘ్రసిద్ధి యగును. ఏకవత్సరము దక్షిణామూర్తిలింగంబున జపించువానికి స్వయముగ నేనే సిద్ధిప్రదానముం గావింతును. పంచగవ్యాశనుండై జపించువానికిఁ బరమాత్మప్రాప్తియగును. మితాహారియై నిత్యము జపించువాఁడు ముక్తుం డగును. పర్వంబులయందు జపించువానికి సర్వ క్రతుఫలసిద్ధి యగును. శ్మశానంబున జపించిన సర్వభూతవశ్యం బగు ను. శ్వేతసర్షపంబులచే హోమము చేసిన శాంతిలాభం బగును. వశీకరణంబునకు రక్తపుష్పంబులచేతను, మారణంబునకు నీలపుష్పం బులచేతను, విద్వేషంబునకుఁ బీతకుసుమంబులచేతను, ఉచ్చాటనంబు నకు ధూమ్రప్రసూనములచేతను హోమము చేయవలయును. సర్వార్థ సాధకంబగునీమంత్రజపంబువలన సర్వపాపవిముక్తియు, శివసాయుజ్యం బును లభించును.

## అర్చనాదివిధి.

ఓదేవీ! అఘోరార్చనంబునకుఁ దిథినక్షత్రంబులతోఁగాని, యుపవాసముతోఁగాని నిమిత్తము లేదు. అఘోరస్మరణమాత్రంబున నే సర్వపాపక్షయం బగును. ప్రథమంబునఁ బంచగవ్యంబులచే శివాభి షేకంబు చేసి మంత్రముచేఁ బూజించి అయుతజపంబు గావించి సహ స్రఘృతహోమంబు గావించినచోఁ ద్రిలోకవశ్యం బగును. చతుర్దశి యందుఁగాని, యష్టమియందుఁగాని, మండూకవసను గ్రహించి మహా దేవునిదక్షిణభాగంబున నుండి యష్టోత్తరసహస్రజపంబు చేయుచు నర కపాలంబునఁ గజ్జలంబును సిద్ధపఱిచి దానిచేఁ గాటుకపెట్టుకొన్నచోఁ

మానవుం డదృశ్యుం డగును. మఱియుఁ గప్పురొప్పునందు జిల్లేడు దూదివత్తిని వెలిఁగించి పూర్వమువలెనే కాటుక చేసి యుపయోగించిన చో క్షణమాత్రంబుననే యదృశ్యసిద్ధి లభించి బ్రహ్మేంద్రాదిలోకగ మనశక్తియు, దివ్యదృష్టియు సిద్ధించును. వేయిసారు లభిమంత్రించిన గోరోచనముచేఁగాని, శివనిర్మాల్యముచేఁ గాని ధూపము చేసినచో భూతబేతాళరాక్షసాదిగ్రహంబులును, జ్వరాపస్మారాదిరోగంబులును వినష్టంబు లగును. కృష్ణచతుర్దశియందు శ్మశానంబున రోగమృతం బగుశవమును సుగంధజలంబులచే నభిషేకించి మండలమధ్యంబుననిలిపి గంధపుష్పంబులచే నలంకరించి శుక్లవస్త్రాచ్ఛాదితంబు గావించి కపిల గోనవనీతంబుచే విలేపించుచు నష్టశతజపం బాచరించినచో శవంబు క్రమంబుగ లేచి సాధకుని సకలాభీష్టంబులను బ్రసాదించి మరలక్షణ మాత్రంబున నిశ్చేష్టంబగును. కృష్ణచతుర్దశియందుఁ గరవీరసంబున హరితాళచూర్ణముం గల్పి శివలింగమునకు దక్షిణభాగంబున వసించి యష్టోత్తరశతజపంబు చేసి యాహరితాళమును మేన విలేపించుకొన్న చో నదృశ్యసిద్ధియు, యథేచ్ఛాగమనంబును గల్గును. దక్షిణామూర్తి దేవునిసన్నిధ నుండి లక్షజపం బాచరించి తద్దశాంశము బిల్వపత్రహో మంబు చేసినచోఁ ద్రివిధంబు లగుసిద్ధులును లభించును. మంత్రమును నిత్యంబును జపించువానికి సర్వరోగవిముక్తియుఁ గీటపతంగాదివశ్యం బును గలుగును. అట్టివానికి లభింపని సిద్ధు లేవియు నుండవు. వారు స్వశరీరముతోనే పాతాళాదిలోకంబులఁ జేరఁగలరు. బ్రహ్మచర్య వ్రతనియమంబుతో నొకమాసము పంచగవ్యాశియై జపించినచో బ్రహ్మచర్యాదిసర్వపాపవిముక్తుండగును. మహాలింగంబు నాశ్రయించి షణ్మాసంబులు ఫలమూలాశనంబుచేఁగాని భిక్షాశనంబుచేఁగాని, జపం బు చేయువానికి శివసాక్షాత్కారం బగును. ఓ దేవదేవి! నిత్యంబును

[illegible] జపించువాఁడు సర్వపాపవిముక్తుం డగును. ఇది [illegible]ము ఘోరకల్పము.

ఓ సుపుత్రా! దక్షిణామూర్తింగూర్చి యష్టోత్తరసహస్రజపంబు చేసి పంచగవ్యాభిషేకంబు చేసి, శ్వేతంబులైనను, రక్తంబులైనను, పీతంబులైనను పుష్పంబులచే నయుతహోమంబుగావించినచో మంత్రసిద్ధి యగును. అనంతరము త్రిరాత్రోపవాసంబు చేసి భాసపక్షి యెముక నభిమంత్రించి చేతికిఁ గట్టికొన్నచో నదృశ్యత్వంబును భూతవశ్యంబు నగును. కపిలగోమయంబుచే బొమ్మను జేసి వామదేవమంత్రముచే నభిమంత్రించి ప్రతిష్ఠించి ఘృతంబుచే వ్రేల్చుచు అష్టసహస్రజపంబు చేసినచో యక్షిణీసిద్ధి యగును. ఉత్తమచందనయుక్తంబుగ సుగంధపుష్పసహస్రముచే శివలింగమును బూజించినచో సకలాభీష్టసిద్ధి యగును. యవవ్రీహిహోమంబుచే ధనపతి యగును. లక్షజపంబు చేసి సురభికుసుమంబులచే లింగపూజనంబు చేసిన లక్ష్మీసాక్షాత్కారంబు [illegible] సర్వార్థసిద్ధి యగును. నాగపున్నాగాశోకపాటలకర్ణికారాది పుష్పంబులు సురభిప్రసూనంబు లనంబడును. మఱియు వామదేవమంత్రాభిమంత్రితం బగు సూత్రంబుచే రక్షాబంధనంబు చేసికొని సర్షపంబుల [illegible]బును, జలంబుచే తర్పణంబును గావింపవచ్చును. సర్వ[illegible] దన్న నభిషేకించుకొన్నచో నలక్ష్మీవినా[illegible]నంబగును. కుందమల్లికాశోకసౌగంధికప్రసూనాభిషేకంబుచే లక్ష్మీ[illegible]యు, సపుత్రకరాజ్యలాభంబు నగును. శుక్లపాడ్యమి మొదలు [illegible] దినములు ప్రతిదినము శుక్లపుష్పంబులచే నష్టసహస్రహోమంబు చేసినచో వామదేవానుగ్రహంబున నాయుర్వృద్ధియు, సర్వాభీష్టసిద్ధియు నగును. ఈమంత్రముచే శతపత్రపుల నభిమంత్రించినచోఁ బరా[illegible] చందనంబుచే శివలింగమును విలేపించి సుగంధ

కుసుమంబులచేఁ బూజించి యష్టోత్తరశతహోమంబు గావించువాఁడు శ్రీమంతుండగును. తపించుటకును, వర్షించుటకును, సర్వభూతములను సృజించుటకును సమర్థుండగు నిమ్మహాదేవుండు సర్వసిద్ధిప్రదాయకుఁడై యున్నాఁడు. ఇది వామదేవకల్పము.

త్రిరాత్రోపవాసంబు చేసి సద్యోజాతమంత్రము నష్టసహస్రజపంబు గావించి యాత్మార్థంబు హోమము చేసినచో నభీష్టసిద్ధియగును. మధుఘృతాక్తంబు లగునష్టోత్తరసహస్రపుష్పంబులచే హోమము చేసిన యక్షరాక్షసాప్సరస్త్రీలు వచ్చి రసరసాయనసిద్ధులం బ్రసాదింతురు. మహాశివపూజ గావించి కామక్రోధలోభమోహశూన్యుండును, మౌనియు, శుక్లవసనుండును జితేంద్రియుండు నై యష్టసహస్రసంఖ్యలు హోమంబు చేయువాఁ డష్టైశ్వర్యసిద్ధుండగును. దక్షిణామూర్తినుద్దేశించి శత్రునామము నుచ్చరించుచు జపించినచో శత్రునిర్విశేషం బగును. మధుదుగ్ధంబులతో వేల్చినచో నపహృతరాజ్యలాభంబును, బిల్వార్కోదుంబరాశ్వత్థసమిధలచే నష్టసహస్రహోమంబు చేసినచో భూమండలాధిపత్యంబును, వటతలంబున నుండి లక్షజపంబు చేసినచో యక్షిణీసిద్ధియు, జలమధ్యంబుననుండి పంచసహస్రజపం బాచరించిన బ్రహ్మహత్యాదిపాపముక్తియు, లక్షార్ధజపంబున మహాపాతకోపపాతకవినాశంబును, శివలింగమునుద్దేశించి లక్షజపంబుగావించి స శివసాక్షాత్కారమును లభించును. నిష్కాముం డిట్లు జపించిన ముక్తియు, జ్ఞాని జపించిన సర్వజ్ఞుండు నగును. ఇది సద్యోజాతకల్పము.

ఓ సువ్రతా! తద్గతచిత్తుండును, సర్వభూతహితరతుండును, మౌనియు, భూశాయియు, జితేంద్రియుండును, మితభోజియు నై స్వయంభూతం బగు బాణలింగంబు నుగాని, జ్యోతిర్లింగంబు ను గాని భక్తిపూర్వకంబుగ సేవింపవలయును. సాధకుం డైనను గురుం డైనను న[illegible]

[illegible]వలయును. జపధ్యానపరాయణుం డగుయోగి యోగాభ్యాస[illegible]బులను, ప్రదక్షిణనమస్కారరూపం బగుక్రియాయోగంబువల[illegible] సేవింపవలయును. పూజాదులకు భక్తియే కారణ మైనది. పరమేశ్వరుడు భక్తిగ్రాహ్యుండు. సకలాశ్రమంబులను, సకలవర్ణంబులను[illegible] సకలజనంబులును ప్రతిదినము శ్రద్ధావంతులై భక్తి[illegible] ఆశ్రయించి సిద్ధు లగుదురు. అట్టివారికి శివసాక్షాత్కారం[illegible] నాశ్చర్యమేమి? ఆత్మయందు సర్వభూతస్థితుండగు శివుని [illegible] మంత్రజపంబు గావించి సర్వసిద్ధులును లభించును. శివుం[illegible], సర్వభూతంబులను, స్థావరజంగమాత్మకంబగుసర్వజగంబును నేనే[illegible] భావింపగలయోగి వత్సరార్ధంబున సిద్ధుం డగును. సర్వదా [illegible] నుండువాడను నేనే యని మనంబున ధ్యానిం[illegible] శివస్వరూపుం డగును.

[illegible]! నదీనదసముద్రపర్వతాదులయందుంగాని గృహంబునగాని పశ్చిమాభిముఖంబుగ శివలింగంబుస్థాపున సిద్ధికాముం[illegible] గోమయంబుచే నలికి పంచగవ్యంబుచే నభిషేకించి [illegible], వామదేవమంత్రంబున దిగ్వాది[illegible] మంత్రంబున సమత్వంబు గావించి తత్పురు[illegible] వస్త్రాలంకారంబు చేసి, మస్తకంబున నీశా[illegible] యనలసుండై యీశానమంత్రంబుచే నిత్య[illegible]. కేనాసురప్రతిష్ఠితం బగు లింగముగాని, స్వయంభూలింగముగాని లక్షణవిహీనం బైనను, స్ఫుటితం బైనను, విశీర్ణం బైనను [illegible] యని యెఱింగి దాని నుద్ధరింపవలయును. నిత్యమును లింగ[illegible]యించి శ్రద్ధతో నీశానమంత్రమును జపించువాడు [illegible] వత్సరంబునంగాని సిద్ధుం డగును. నాభిదఘ్న

ళింబునం దుండి సమాహితచిత్తంబున జపించువానికి దివ్యదృష్టి లభించును. అష్టోత్తరసహస్రవారంబు లీశానమంత్రితంబులగుబీజంబుల క్షేత్రనిక్షేపంబు గావించినచో నిరుపద్రవంబుగ సస్యసంపత్తి యగును. క్షీరవృక్షసమిధలనే వేల్చిన శాంతిలాభంబును, పర్వతాగ్రంబునం దుండి జపించిన శంకరసాక్షాత్కారంబును, శ్రద్ధతో లక్షజపంబు చేసిన సర్వపాపవిముక్తియు, భుజించుచు జపించిన దివ్యతేజంబును, నిత్యైకశతజపంబున మంత్రసిద్ధియు లభించును. దుష్టభోజనంబును, గలుషపథగమనంబును గలుగుకాలంబులయం దీశానస్మరణంబు సేయవలయును. ఈయాచారము ననుసరించు శివపూజాతత్పరుం డగువాఁడు సర్వపాపవిముక్తుండై శివలోకమాననీయుం డగును.

ఓభవానీ! విశుద్ధకర్ములును, విమలతపోనిరతులు నగువారు నిరంతరము నన్నారాధించుచుందురు. వారికి మత్సదృశంబగు జ్ఞానంబు లభించును. తపంబుచేఁగాని శివలోకగమనంబు గలుగదు. తపోబలంబుననే దేవర్షిమునిగణంబులు స్వర్గాదిసుఖానందంబులం గాంచుచుందురు. దుర్ధరంబులును, దురారాధ్యంబులును, సుదూరంబులును, దురతిక్రమంబులు నగునవి యన్నియును దపస్సాధ్యంబులగుచు. తపంబు మాత్రమే దురతిక్రమమైనది. నేనును, బ్రహ్మయు, విష్ణుండునుగూడ నీయందుఁ దపోనిష్ఠులమై యుందుము. దేవీ! నీవును దపస్వినివే. తపఃప్రభావముచేతనే నన్నుఁ బతిగాఁ బడయఁగల్గితివి. తపంబుచే సర్వాభీష్టంబులు నిహలోకంబుననే సిద్ధించును. హితజనకం బగునట్టి తపముసాత్త్వికంబనియు, రాజసంబనియు, తామసంబనియు మూఁడు విధముల నొప్పుచుండును. దేవతలును, ఊర్ధ్వరేతస్కులగుయతులును గావించుతపము సాత్త్వికము. క్రూరకర్ములగురాక్షసాదులతపము తామసము. దుస్సహంబు లగుశీతాతపాదులచే శరీరంబును బీడిం

పం జేయుచుం గావించు నభీష్టసాధకం బగుతపము తామసము. భక్తిం జేసి గావించు దేవపూజాజపధ్యానంబులు సాత్త్వికతపంబులు. సాత్త్వికత పంబుచే నిహపరసుఖలాభంబును గ్రమంబుగముక్తియు సిద్ధించును. అదియే యుత్తమమైనది. నిశ్చలధర్మబుద్ధి, స్నానము, పూజ, జపము, హోమము, శౌచము, అహింస, వ్రతము, ఉపవాసము, మౌనము, ఇంద్రియనిగ్రహము, జ్ఞానము, విద్య, సత్యము, అక్రోధము, దానము, క్షమ, దమము, దయ, వాపీకూపతటాకాదిప్రతిష్ఠ, దేవాలయప్రతిష్ఠ, చాంద్రాయణాదులు, యజ్ఞము, ఉత్తమతీర్థాశ్రమసేవ మొదలగునవి ధర్మప్రాప్తి కుపాయములు. మఱియుం బండితులకు సుఖప్రదములగు సంక్రాంతి, విషువద్యోగము, నాదము, ఉత్క్రాంతి, ధ్యానము, బిందుమలవము, జ్యోతిర్దర్శనము, ఉన్మనీభావము, ధారణ, ప్రాణాయామము, నాడీసంచారజ్ఞానము, ప్రత్యాహారము, నిరోధము, కాష్ఠావస్థ, మృతావస్థ మొదలగునవి జ్ఞానసాధనములు. వీనివలన సకలపాపక్షయం బగును. నారీశయ్యాసనంబును, యానంబును, వస్త్రంబును, ధూపవిలేపనంబులును, తాంబూలభక్షణంబు నను నీయైదును రాజైశ్వర్యములు. సువర్ణము, తామ్రము, గృహము, అశ్వము, రత్నము, ధేనువు, వేదశాస్త్రవిచక్షణత, శాస్త్రాంతరపాండిత్యము, నృత్యగీతాలంకారములు, శంఖవీణామృదంగాదివాద్యములు, గజేంద్రము, ఛత్రము, చామరము మొదలగునవి భోగస్వరూపములు. కామి యగువాఁడు వీనియం దనురక్తుండగును.

స్నేహ మద్దమువంటిది. దానియందు జీవులు తిలలంబోలి పీడితులగుచుందురు. అయినను మాయామోహితులై స్నేహమునే విశేషముగ నాశ్రయించి కష్టసుఖానుభవంబులం గాంచుచుందురు. జీవులెల్లరియు నీయు సంసారచక్రంబునం బరిభ్రమించుచు దుఃఖార్తులై

నానాయోనులంబుట్టుచుఁ గాలవశంబునఁ బుడకు దుర్లభంబగు మానవజన్మంబు గాంచుచుండును. పుణ్యవశంబునఁగూడ మానవజన్మంబు లభించుచుండును. గురులఘుకర్మానుసారంబుగ విచిత్రగతు లేర్పడుచుండును. మానవుండై జనించియు స్వర్గమోక్షసాధకంబును, గల్యాణప్రదంబు నగుననుష్ఠానంబు సేయనివాఁడు మరణానంతరంబునఁ జిరకాలంబువఱకును శోకతప్తుం డగుచుండును. మానవజన్మము దేవాసురదుర్లభమైనది. అది లభించినప్పుడు నరకకారణంబులుగాని సత్కర్మంబుల నాచరింపవలయును. స్వర్గమోక్షయత్నంబు సేయకున్నను మానవధర్మమునైనఁ బాలింపవలయును. మనుష్యజన్మము ధర్మమూలకమైనది, అది సర్వప్రయోజనంబులకును సాధకమైనది. లోభవశంబున నితరయత్నంబులు చేయకున్నను మానవుఁడు మూలరక్షణమునైనఁ గావింపవలయును. మానవత్వంబున దుర్లభంబగు బ్రాహ్మణుండై పుట్టియు నాత్మకల్యాణసాధనంబు చేయనివానికంటె నవివేకి యెవ్వఁడుండును? సకలద్వీపంబులకంటె నీద్వీపమునందే యుపార్జితకర్మఫలంబు భోగ్యం బగుచుండును. ఇందుఁ గర్మఫలమే స్వర్గమోక్షరూపంబునఁ బ్రాప్యంబగును. ఈభారతవర్షంబున మానవుండై పుట్టి యాత్మమంగళమును సాధింపనివాఁ డాత్మవంచకుం డగును. ఇదియే కర్మభూమి; ఇదియే ఫలభూమి; ఇందుఁ గావించిన కర్మంబులకు స్వర్గాదులయం దనుభవ మగుచుండును. శరీర మారోగ్యముగా నున్నంతవఱకు సత్కర్మంబు లాచరింపవలయును. అస్వస్థుఁడై యున్నప్పుడన్యప్రేరితుండయ్యును ధర్మాచరణంబు చేయఁజాలఁడు. అనిత్యంబగు నీశరీరమూలంబున నిత్యవస్తుసాధనముం గావింపఁదలంపనివానికి నిత్యవస్తుసిద్ధి లేకుండుటయే కాక యనిత్యం బగుశరీరముకూడ వినష్టంబై పోవును. అహోరాత్రరూపంబున నాయువు ఖండఖండంబులుగ

నశించిపోవుచున్నను నేల తెలిసికొనఁజాలరు? ఎప్పుడు వచ్చి పైఁబడు నో యించుకంతయుఁ దెలియఁబడని మృత్యువిషయంబున నేల నిశ్చింతులై యుందురు? మృత్యుహతులై సర్వమును విడిచి యేకాకులై పోవలసి వచ్చునని యెఱింగియుండియు దారిబత్తెముకొఱ కెప్పుడైన నెవ్వరికైన నించుకంత ధనదానము నేల చేయకున్నారు? దానరూపం బగుపాథేయము గలవారికి యమాలయపథము సుగమమై యుండును. అది లేనివారు క్లేశముల ననుభవింపవలయును. మరణానంతరము పుణ్యమెవ్వరిముందు నడచుచుండునో వారికి స్వర్గపథంబునఁ బ్రతిపథమునందును సుఖలాభం బగుచుండును. పుణ్యము స్వర్గదంబనియు, పాపము నరకకారణం బనియు నెఱింగి పుణ్యకార్యంబులఁ జేయుచుఁ బాపములఁ ద్యజింపవలయును.

ఈశ్వరశరణ్యులగువారికి నరకంబును యమదర్శనంబును గలుగదు. అట్టివారు మహాపాపులైనచో శివాజ్ఞచే భారతవర్షంబునఁ గొంతకాలముండి యంతంబున శివపురంబుఁ జేరుదురు. ఎల్లవిధంబుల శివశరణ్యులగువారు జలంబులపైఁ బద్మపత్రంబులవలెఁ బాపలిప్తులు గాక యుందురు. శివనామంబు గీర్తించువారికి నరకయమభీతులు లేవు. కావున జ్ఞాను లగువారు సర్వదా శివభక్తులై యుండవలయును.

## వర్ణవిశేషకథనము.

వ్యాసుం డిట్లనియెను. ఓమునులారా! బ్రాహ్మణత్వము దుర్లభమైనది. ప్రకృత్యనుసారంబుగ మానవులు బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రు లగుచుందురు. బ్రహ్మముఖమునుండి బ్రాహ్మణులును, బాహువులనుండి క్షత్రియులును, ఊరువులనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును జనించినట్లు వేదప్రమాణము గలదు. ఇట్టిస్థితిలో నున్నతియు, నవనతియు నెట్లు తటస్థించుచుండు నని యడుగుటయు

సనత్కుమారుం డిట్లు చెప్పం దొడంగెను. వ్యాసమునీంద్రా! పండితుడైనను దుష్కృతపరిభావముచే భ్రష్టుడగుచుండును. కావున శ్రేష్ఠత్వము లభించినప్పుడు దానిని రక్షించుకొనుచుండవలయును. బ్రాహ్మణత్వమును ద్యజించి క్షత్రియస్త్రీయందు సంతానముం గల్గించువాఁడు బ్రహ్మభ్రష్టుండై క్షత్రియత్వముం గాంచును. అధర్మాచరణవశంబున నిట్టిపరివర్తనం బగుచుండును. తమోగుణమయంబులగు సహస్రజన్మంబులయనంతరమున లభించినయుత్తమస్థానమును బ్రమాదవశంబున వినష్టంబు గావించుకొనంగూడదు. శూద్రాన్నముదరస్థంబైయుండ మరణించిన బ్రాహ్మణుఁడు సాగ్నికుండైనను, విద్వాంసుఁడైనను దప్పక శూద్రుండై జన్మించును. బ్రాహ్మణుం డయ్యును బ్రాహ్మణ్యము నవమానించుచు భోజ్యాభోజ్యజ్ఞానంబు లేకుండువాఁడు క్షత్రియజన్మంబు గాంచును. శూద్రుఁడయ్యును స్వకర్మనిరతుండైయున్నచో వైశ్యుం డగును. వైశ్యుండైనను పాపద్వేషియు, విద్వాంసుండును, అగ్నిహోత్రుండును, యజ్ఞశేషాన్నభోజియు నగువాఁడు క్షత్రియుం డగును. ఉత్తమదక్షిణలతో యథావిధిగ యజ్ఞంబులఁ జేయుచు, నధ్యయనం బాచరించి స్వర్గకాముండై శ్రేతాగ్నుల నారాధించుచు, నిత్యదానము, ధర్మపాలనము, ధర్మతత్పరత్వము. ఋతుకాలపత్నీగమనము, సర్వాతిథేయత్వము, సర్వభూతసంతర్పణము, త్రివర్గానుష్ఠానము, గోబ్రాహ్మణవిషయంబునఁగాని, యాత్మార్థంబునఁగాని రణమరణమునుగాంచిన యగ్నిమంత్రపూతుం డగుక్షత్రియుండు బ్రాహ్మణుండై విధిజ్ఞుండును, యాజ్ఞికుండును శైవప్రియుండు నగుచు బహుకాలము స్వర్గభోగంబు లనుభవించును. దుర్లభంబగు బ్రాహ్మణత్వ మతికష్టంబునఁగాని ప్రాప్తింపదు. కావున దాని నెల్ల విధముల రక్షించుకొనవలయును.

ధర్మయుద్ధంబువలన లభించుపుణ్యము అగ్నిష్టోమాదియజ్ఞంబులవలనఁగూడఁ బ్రాప్తింపదని యజ్ఞవిదులు చెప్పుదురు. శత్రుసైన్యమును మర్దించుచు సమరనిహతుండగువీరుఁడు ధర్మార్థకామసంపాదకంబగుయజ్ఞఫలంబు నందును. ద్వంద్వరణంబునఁ బ్రతివీరుని నిర్జించి యతనియానంబు నధిరోహించువారును, యుద్ధంబునఁ బరాజయంబెన్నఁడు నెఱుంగనివారును విష్ణుపదప్రాప్తు లగుదురు. యుద్ధంబు సేయుచు నిహతుండగువాఁ డశ్వమేధచతుష్టయఫలంబుగాంచును. శస్త్రబలంబున నప్రతిహతుండై సేనాముఖంబుననిలుచువాని కెన్నటికిని స్వర్గచ్యుతి లేదు. రాజుగాని, రాజపుత్రుఁడుగాని, సేనానాయకుఁడుగాని కేవలవీరులుగాకున్నను ధర్మానుసారంబుగ రణనిహతులైనచో నిశ్చయముగ వారికక్షయలోకావాప్తి యగును. యుద్ధంబున శస్త్రాఘాతిచే నెన్నిరోమకూపంబులు విక్షితంబులగునో సర్వకామదంబులగునన్ని యక్షయలోకసుఖంబు లాతనికిఁ జేకూరును. వీరాసనంబును, వీరశయ్యయు వీరలోకావాసంబునకు హేతువులు. గోబ్రాహ్మణప్రభువిషయంబున నిహతుం డగుయోధుఁడు పుణ్యశీలురంబోలి స్వర్గలాభంబు నందును. బ్రహ్మహంతయైనను, గోబ్రాహ్మణప్రభువిషయంబునఁ బ్రాణంబులు విడుచువాఁడు పాపముక్తుండగును. తనభగ్నసైన్యమును రక్షించుకొనుచు నజేయుఁడై నిలుచువీరుఁడు జీవించియున్నచో విశేషఫలంబును, మరణించినచోఁ బునరావృత్తిరహితం బగుస్వర్గమ్మును గాంచును. గోబ్రాహ్మణప్రభువులకొఱకు క్రూరజంతునిహతుం డగువాఁడు సద్గతిం గాంచును. ధనమున్నచో ననేకయాగములం జేయవచ్చును గాని రణమరణంబుఁ గాంచుటమాత్రము దుష్కరము. సకలవర్ణంబులకంటెను క్షత్రియులకు రణయజ్ఞము సద్గతిహేతువైనది. వేదవిదుం డగువిప్రుండైనను నాతతాయియై హింసకుఁడై యెదిరించినప్పు

డాతని వధించినచో బ్రహ్మహత్యాదోషంబు లేదు. క్షుత్పిపాసాతురు లును, భీతులునగు యోధులను వధించువారు బ్రహ్మహత్యాదోషముం గాంతురు. వ్యాధిగ్రస్తుండును, దుర్బలుండును, బాలకుండును, స్త్రీరక్షితుండును, దీనుండును, జడభావస్థితుండును, భగ్నధనుండును భిన్నగుణుండు నగువాని రణంబున వధింపఁగూడదు. ముక్తకేశుండై పలాయితుం డగువాఁడును, యుద్ధభయంబున జడుండై యున్మత్తుం డగువాఁడు, పర్ణశాఖాతృణగ్రాహియు, క్షమాప్రార్థియు వధార్హులు గారు. నేనిఁక యుద్ధము చేయఁజాల ననువాఁడును, నీవాఁడనని లొంగినవాఁడును, వృద్ధుండును, రణానభిజ్ఞుండును క్లీబుండును మొదలగు వారిని ప్రమాదవశంబుననైన వధింపఁగూడదు. తపోయజ్ఞంబులవలన బ్రాహ్మణులకు లభించుపుణ్యము సమరనిహతు లగుక్షత్రియులకు సిద్ధింపఁగలదు. ధర్మయుద్ధంబున హతుండగువాఁడు వేదవేదాంగపరిశీలనంబువలనను, యోగంబువలనను, వానప్రస్థాదులవలనను లభించు ఫలముం గాంచును.

## —◆ సంసారచికిత్స ◆—

సనత్కుమారుం డిట్లనియెను. సాత్యవతేయా ! నరకపురుషశరీరము పంచభూతంబులచేతను, ధర్మబలమువలన దివ్యశరీరము భూతసారంబుచేతను క్షణమాత్రంబున నుత్పన్నం బగును. మిశ్రకర్మఫలంబునం గలుగుదేహము భూతపరిణామంబువలన నుదయించును. అట్టి దేహంబులుగలజీవసముదాయమునందు తృణగుల్మలతాదు లుద్భిజ్జము లనియు, క్రిమికీటాదులు స్వేదజంబులనియు, మత్స్యనక్రవిహంగాదు లండజంబు లనియు, మానవచతుష్పదాదులు జరాయుజంబు లనియుఁ జతుర్విధంబులఁ బరగుచుండును. తేజస్స్తంబును, జలసిక్తంబు నగు

భూమి వాయుసంయోజితం బగునాకాశసంబంధమున బీజప్రాప్తంబగుచున్నది. ఋతుకాలంబునం దట్టిబీజములు జలసిక్తంబులై స్ఫీతంబులును, మృదులంబులునై క్రమంబుగ మూలముం గాంచును. పిమ్మట నమ్మూలంబునుండి క్రమంబుగ నంకురంబును, ఛత్రంబును, నాళంబును, గాండంబును, ముకుళంబును, దూషంబును, క్షీరంబును జనించి యాక్షీరంబుచేఁ దండులంబులుత్పన్నంబులై యవిపక్వంబులైనంతనే యోషధి విశుష్కంబై పోవును. ఫలపరిపాకంబున నోషధులన్నియును నిర్జీవంబులగును. అందు యవప్రభృతి సప్తదశౌషధలు శ్రేష్ఠములు. తక్కినవి కనిష్ఠములు. యవాదిసస్యంబులు కర్తితంబులును, మర్దితంబులునై ముసలోలూఖలశూర్పాదులచేఁ బరిశోధితంబులై జలాగ్నిసాహాయ్యంబున భక్ష్యభోజ్యపేయలేహ్యచోష్యపిచ్ఛిలంబులను షడ్విధఖాద్యరూపంబులఁ బరిణమించును. పరస్పరసంయోగంబున వానికి వివిధంబులగు రుచులును షడ్విధరసంబులును గలుగును. ఆయన్నము జీవులచే భుజింపఁబడి స్థూలాశయంబునఁ జేరి ప్రాణవాయువును స్థాపించును. ఆవాయువు భక్ష్యపేయవస్తుమధ్యంబునఁ బ్రవేశించి మొదట నన్నజలంబులను వేఱుపఱచి యగ్నిపై జలంబును, జలముపై నన్నమును, నిలిపి తాను తనవాయురూపముతో జలాధోభాగంబున నిలిచి యగ్నిని బ్రజ్వలింపఁ జేసి జలంబున కుష్ణముం గూర్చుటచే నన్నము పరిపక్వం బగును. పిమ్మట నాపక్వాన్నమునందు కిట్టము, రసము నని రెండురూపము లేర్పడును. అందుకిట్టము విష్ఠామూత్రకఫాదిద్వాదశవిధమలరూపమై శరీరమునుండి బహిర్గతం బగును.

జీవులహృత్పద్మమధ్యమునుండి దేహమంతటను సర్వనాడులును వ్యాపించి యుండును. ప్రాణవాయు వానాడులయందు రసంబు నింపుటయు నవి స్ఫీతంబులై వ్యాపించును. అందలి శరీరోష్ణముచే

పక్వంబై యొడలంతటను వ్యాపించి చర్మరక్తరూపంబునఁ బరిణమించును. ఆరక్తమునుండి రోమమాంసంబులును, మాంసమునుండి కేశస్నాయువులును, స్నాయువులనుండి సిరాస్థినఖమజ్జలును, మజ్జనుండి యుత్పత్తినిదానం బగుశుక్రంబును నుత్పన్నంబు లగును. అన్నపరిణామం బిట్లు ద్వాదశవిధంబు లనిపండితులు చెప్పుదురు. ఈశుక్రమునుండియే దేహోత్పత్తి యగును. ఋతుకాలంబున నిర్దుష్టం బగుశుక్రము గర్భంబునఁ జేరి వాయుపరిచాలితంబై శోణితసమ్మిళితం బగును. జీవులు కర్మవశంబుచే శుక్రక్షరణసమయంబున సర్వేంద్రియపరివృతులై గర్భమధ్యంబునఁ జేరుటకు బాధ్యులగుదురు. శోణితసంకలితం బగుశుక్ర మొకదినంబునకుఁ గలలాకృతిని పంచదివసంబులకు బుద్బుదరూపమును గాంచును. వారముదినములలో నాబుద్బుదము మాంసపేశియై ద్వివారంబులకు జర్మరక్తంబులచే దృఢత్వముం జెందును. దానినుండి పంచవింశతిదివసంబులకు బీజమునుండి యంకురంబులవలెనే దేహాంకురంబు లుదయించును. ఒకమాసంబున కటి గ్రీవము శిరము, స్కంధము, పృష్ఠవంశము, ఉదరము ననుపంచరూపంబుల విభక్తంబగును. మాసద్వయంబునకు హస్తపాదపార్శ్వకటిగాత్రంబులును, మాసత్రయంబునకు సర్వాంగాంకురసంధులును, మాసచతుష్కంబున కంగుళులును, మాసపంచకంబునకు ముఖనాసికాకర్ణదంతగుహ్యంబులును, మాససప్తకంబునకు నాభిపాయూపస్థాదులును, సకలగాత్రసంధులును సముత్పన్నంబు లగును. అష్టమమాసంబున సకలాంగప్రత్యంగములును, మస్తకకేశాదినిఖిలావయవంబులును సుస్పష్టముగ నేర్పడును. అప్పుడు శిశువు మాతృభక్షితంబులగు నాహారంబుల వలన నేర్పడు షడ్రసంబులను నాభినాళమునుండి గ్రహించుచు ప్రాణసంచారయుతుండై దినదినంబును వర్ధిల్లుచుసంపూర్ణుండై పూర్వస్మృతి

గాంచి పూర్వోపభుక్తంబు లగు సుఖదుఃఖనిద్రాస్వప్నములను, జన్మ మృత్యుపరంపరలనుగూర్చి చింతించుచు నేనిఁక గర్భనరకదుఃఖంబులఁ దొలఁగించు శుభకర్మములం గావించి సంసారనాశకంబగు శివజ్ఞానంబు నాశ్రయించి తరించెద నని భావించుకొనుచుండును. గర్భవాసకాలం బున జీవుఁడు గర్భనరకపీడితుండై మోక్షోపాయమును జింతించుచు జరాయువేష్టితుండై పర్వతంబులనడుమఁ జిక్కువడినవానిఁబోలి కాల క్షేపము చేయుచుండును. మఱియు సాగరగర్భపతితుండై వ్యాకులుం డైనవిధంబున గర్భోదకనిమగ్నుండై ప్రాణమాత్రావశిష్టుండై విచారిం చుచుండును. గర్భకుంభపతితుం డగుజీవి జఠరానలంబువలనఁ దప్తకుం భపతితుం డగువానివలె దగ్ధుం డగుచుండును. పరితప్తసూచిముఖంబు లచే వేధింపఁబడువానింబోలి గర్భస్థుం డగుజీవి బాధపడుచుండును. గర్భవాసంబు కంటె నతిదారుణంబగు క్లేశం బెందును లేదు. నవమా సమునుండియే జీవులు గర్భమధ్యంబునందుండి సకలబాధల నొందు చుందురనియు, వారికప్పుడు కేవలధర్మబుద్ధియే యుండు ననియుఁ బెద్దలు చెప్పుదురు. ఇక్షుయంత్రంబునఁ జెఱకులవలెను, గానుగునం దుఁ దిలలవలెను గర్భస్థజీవులు పీడితు లగుచుందురు. ఈశరీర మస్థి స్తంభకలితంబును, స్నాయురజ్జుబంధితంబును, రక్తమాంసమృత్తికాలి ప్తంబును, విణ్మూత్రభాజనంబును, కేశతృణాచ్ఛన్నంబును, వ్యాధి లీలారంగంబును, క్లేశాకరంబును, ఏకమూర్తిముఖద్వారవిస్తృతంబును, కర్ణరంధ్రాది వాతాయనాష్టకయుతంబును, ఓష్ఠద్వయకవాటాంచితం బును, దంతజిహ్వాగ్గళబంధితంబును, భోగతృష్ణాతురంబును, మహాంధ కారపూర్ణంబును, రాగద్వేషవివశంబును, అమేధ్యపూర్ణగర్భవినిర్గ తంబు నగునస్థిపంజరమాత్రం బనియే యెఱుంగవలయును. అందెనిమి దివందలయెముకలునదిమాంసపేశులుగలవు. దానియందంతటను సార్ధత్రి

కోటిరోమకూపంబులును నాడులును వ్యాపించి యుండును. ఆరోమ కూపంబులనుండి నిత్యమును స్వేదాదిమలంబులు బహిర్గతము లగు చుండును. దాని కిరువదినఖంబులును, ముప్పదిరెండుదంతములు నుండును. అందు చిత్తం బొకకుడవంబును, కఫంబొకయాఢకంబును, పన వింశతిపలంబులును, కపిలధాతువు దశపలంబులును, పలలము పంచార్ధపలంబులును, మేదస్సు దశపలంబులును, మహారక్తము త్రిపలంబులును, మజ్జ ద్వాదశపలంబులును, శుక్ర మర్ధకుడవంబును నిండియుండును. శుక్రమే దేహులకు బలంబును బీజంబు నని యెఱుంగునది. మఱియు సహస్రపలంబులు మాంసపిండంబులును, శతపలంబులు రక్తంబును, అపరిమితంబు లగువిణ్మూత్రంబులు నందు నిండి యుండును. ఆత్మనిత్యంబును, విశుద్ధంబు నైయుండియుఁ గర్మవశంబున నిట్టి యశాశ్వతంబును, నశుద్ధంబునగుగృహంబును గల్పించుకొని యుండును. ఈదేహము శుక్రశోణితంబులచే నుత్పన్నంబై విణ్మూత్రపూర్ణంబై యుండుటచే నిత్యము నపరిశుద్ధమై యుండును. అమేధ్యపూర్ణంబగుఘటము పైనెంత కడిగినను బరిశుభ్రంబు గానట్లు మలపూర్ణంబగు శరీరము జలస్నానములచేఁ బవిత్రంబు గానేరదు. అతిపవిత్రంబులగు పంచగవ్యంబులును, సుగంధమనోహరాన్నపానాదులును దేహమధ్యంబునం జేరి క్షణమాత్రంబుననే యపవిత్రంబు లగును. ఇట్టిస్థితిలో శరీరంబుకంటె నపవిత్రం బగువస్తువింకేమున్నది? నిరంతరమును సేవించుచున్న [illegible]బులం గాంచుచుండియు, వానికాధారం బగుశరీర మెట్లు పవిత్ర[illegible] యని భావింపఁగలరు? ఎంత గడిగినను బొగ్గు మాలిన్యమును విడనట్లు పంచగవ్యకుశోదకాదులచే నెంతశోధించినను శరీరము నిర్మలము కాఁజాలదు. పర్వతము జలప్రవాహములం బోలె [illegible] [illegible] వాహినుల [illegible]వరించుచుండు నీదేహ[illegible]

పవిత్రం బగును ? విణ్మూత్రపాత్రం బగునీగాత్రంబున కించుక శుచిత్వంబు లేదు. దేహమలస్పర్శమాత్రంబున మృత్తికాజలాదులచే వాస్తశోధనంబు గావింపవలసియుండ నట్టిమలభాండము నంటువిషయంబున హస్తంబునకు విరాగంబు గలుగుట లేదు. ఎట్టిసుగంధపుష్పాదులచే సంస్కరించినను గుక్కతోంక యెట్లును దిన్నంబడనియట్లు శరీరము తనస్వాభావదుర్గంధమును విడువదు. దుర్గంధమలంబుల దర్శించుచు నాఘ్రాణించుచు గూడ మానవులు స్వశరీరంబుపై విరక్తి నందకుండుట యెంతయాశ్చర్యము ! మోహమాహాత్మ్య మెట్టిదియో గాని శరీరమునం దంతలును దోషంబులనే కాంచుచుండియు జీవులు దానియందే ముగ్ధు లగుచున్నారు. స్వదేహదుర్గంధముం గాంచియు విరక్తినందని వానికి విరాగకారణము నెవ్వరుపదేశింపగలరు ? సర్వజగంబును బవిత్రమైనదియే కాని దేహముమాత్ర మపరిశుద్ధమైనది. దేహమలంబుచే బవిత్రవస్తువుగూడ నపవిత్రంబగును. దేహదుర్గంధాపనోదనంబునకై శౌచవిధి నిర్దేశింపబడినది. కాని యంతఃకాలుష్యము మరణపర్యంతము, గంగాజలంబంతటిచేతను, బర్వతోపమం బగుమృత్తికచేతను శోధించినను విశుద్ధంబు గానేరదు. అఖిలతీర్థస్నానంబు చేసినను, తపంబాచరించినను గలుషాత్ముం డెన్నటికిని బవిత్రుండు కాజాలడు. కుక్కముట్టినచర్మపాత్రమునకు తీర్థజలాభిషేచనంబువలన నేమిప్రయోజనము ? అంతర్మలిను లగువా రగ్నిప్రవేశంబు గావించినను నపవర్గంబు నందజాలరు. అంతర్దూషితులగువారి కాజన్మాంతగంగాస్నానంబులుగూడ నిష్ఫలంబు లగుచున్నవి. భావదుష్టుల కాజ్యపరిజ్వాలితం బగుహుతాశనమధ్యంబునం బడి భస్మంబైనను లాభము లేదు. నిత్యగంగావాసంబులగుమీనంబులును, నిత్యదేవాలయస్థితంబులగువిహంగములునుంబోలి భావదుష్టులు తీర్థావగాహన దానదేవపూజాదులవలన ఫలంబు నందజాలరు.

ఎల్లయెడలను భావశుద్ధియే పరమశౌచము. కౌఁగిలింత తల్లి బిడ్డలయెడల నొక్కటియే యైనను భావముమాత్రము విభిన్నమైనది. కాంత పుత్రినొకభావమునను, భర్తనొకభావమునను గౌఁగిలించుకొనును. నిశ్చలభావులగువారు కాంతాలింగితులయ్యును గామవశ్యులు గారు. బంధమోక్షంబులకు భావమే కారణమైనది. కామాదులచే నాక్రాంతుండయ్యును మానవుఁడు భావవిశేషముచే ముక్తుండు గాఁగలఁడు. అంతర్భావవిశుద్ధుం డగువాఁడే మోక్షంబున కధికారి యగును. సద్భావంబునను, నిర్మలతేజంబునను మానవుఁడు భావశ్వా మాదులం గావించి పుణ్యలోకంబు లన్నిటిని జేరఁగలఁడు. జ్ఞానతబనుజలముచేతను, వైరాగ్యమనునగ్నికచేతను మానవులయవిద్యామలంబు విదూరితం బగును. స్వభావముచే నపరిశుద్ధంబగుశరీరము నిస్సారంబగుకదళీస్తంభమువలెఁ జర్మమాత్రసారమైనది. దోషబహుళం బగుదేహముం గాంచి విజ్ఞుం డగువాఁడు విరాగుండై నిశ్చలబ్రహ్మవలంబనంబు గాంచి సుస్థిరుండై యుండును. అజ్ఞానదోషంబునను వివిధకర్మవశంబునను జీవులకు దుస్సహంబగుజన్మదుఃఖంబు గలుగునని పండితులు చెప్పుదురు. విద్వాంసులు కోటిగ్రంథములలో బోధించిన విషయ మొక్కశ్లోకార్థమునఁ జెప్పుచున్నాను. "మమత్వమే పరమదుఃఖాకరము. నిర్మమత్వమే పరమసుఖాశ్రయము." అనేకరాజన్యులు నిర్మములై సంసారవిముక్తులైరి. శతసహస్రవ్యక్తులు మమత్వముచే సంసృతిబద్ధులైపోయిరి. గర్భవాసంబున ధర్మస్మృతి గలజీవులు ప్రసవకాలంబునఁ బ్రజాశోకమూర్ఛితులై తద్విస్మృతిం గాంచుచుందురు. జన్మించినంతనే మోహసంజ్ఞకం బగుఘోరబాహ్యవాయుస్పర్శవశముచే దేహులకు జ్వరంబును, జ్వరహేతుకం బగుమోహంబును ప్రాదుర్భూతం బగును. ఆసమ్మోహంబువలననే స్మృతిభ్రంశంబై పూర్వ

కర్మవశంబున జన్మాసక్తి యుదయించును. అందుచే విషయానురక్తుం డగుచు యాధమానవుం డెన్నఁడును బవిత్రహితకార్యప్రవృత్తుండు గాఁ జాలఁడు. అట్టివానికి ఆత్మ, పరమవస్తువు, దేవుఁడు అనుజ్ఞానమే కలుగదు. అతఁడు కన్నులుండియుఁ జూచుటకైనను, చెవులుండియు వినుటకైనను, శక్తుండు గాఁడు. సమతలంబున నడచుచుండియు నడుగడుగునకుఁ బడిపోవుచుండును; బుద్ధియుండియుఁ బెద్దలబోధల నెఱుంగ నేరఁడు. అతఁడు గర్వలోభవివశుండై వివిధక్లేశంబుల నందుచుండును. అందుచేతనే భగవానుండగు శంకరుండు గర్భస్మృతిం గలిగించునట్టియు, గర్భదుఃఖమును బ్రకటించునట్టియు, మోక్షసాధనం బగునట్టియు శాస్త్రమును బ్రసాదించెను. సర్వార్థసాధనం బగునట్టి శివజ్ఞానం బున్నను మానవు లాత్మహితకార్యప్రవృత్తులు గాకుండు టెంత చిత్రము! బాల్యంబున నింద్రియంబు లస్ఫుటంబు లగుటచే జీవుఁడు ఘోరదుఃఖంబు లనుభవించుచుండియు నేమియుఁ జెప్పఁజాలకుండును. దంతోద్గమకాలంబున బాలగ్రహాదిపీడలచే బహుదుఃఖంబు లందుచు క్షుత్పిపాసాపీడితులై దుఃఖించుచు, నజ్ఞానంబుచే విణ్మూత్రంబులనుగూడ భక్షించుచుండును. కౌమారంబున దల్లిదండ్రులచే నాజ్ఞాపితులగుచుండియు నాత్మహితంబు గావించుకొననేరక యధ్యయనసమయంబుల గురుతాడితులగుచు దుఃఖించుచుందురు. యౌవనంబున నింద్రియలంపటులై కామరాగాదులచేఁ బీడితులగుచు నాశాపాశంబులఁ జిక్కి సుఖహీనులై యుందురు. మోహాంధులగుయువకు లీర్ష్యావశంబున సర్వదా దుఃఖితులగుదురు. విషయానురాగము కేవలదుఃఖహేతువు. కాముకులకు రాత్రులయందు నిద్రయు, దివంబులయం దర్థోపార్జనాది ప్రయత్నంబును లేదు. కాంతాసక్తులగుపురుషులకు స్వేదబిందువులం బోలె శుక్రము వినష్టం బగుచు నసుఖంబుఁ గూర్చును. స్త్రీసుఖము

కుష్ఠరోగికండూతివంటిదని యెఱుంగవలయును. రమణీసంయోగసుఖము మలమూత్రవిసర్జనంబువలనం గలుగుసుఖమువంటిదే యని పంచచూడుండు వచించెను. కాని మోహాంధు లట్లు భావింపఁజాలరు. సర్వదోషాకరంబగు సతీసంయోగసుఖము నామమాత్రమైనది. అవమానముచే మానంబును, వియోగముచే సంగమంబును, జరచే యౌవనంబును నశించుచుండ మానవుల కిఁక సుఖ మెక్కడిది? జరాగ్రస్తులగు మానవులసకలాంగములును శిథిలములై, కేశములు పలితంబులై శక్తులు నష్టములై పోవును. ప్రథమంబున స్త్రీపురుషులకుఁ బరస్పరప్రీతిదాయకమగునవస్థ జరాగ్రస్తంబైనంతనే యుభయులకు నప్రీతికరంబై పోవును. యౌవనంబునఁ దనసౌందర్యముం గాంచి సంతసించువాఁడు వృద్ధావస్థయందుఁ దనరూపము తనకే వికృతముగఁ దోఁచుచున్నను విరక్తుండు గాకుండుట యెంతయవివేకము! జరాయుతుండగుపురుషుని బత్నీపుత్రులును బంధువులునుగూడ నశక్తుండని యనాదరింతురు. భృత్యులుగూడ నాతని లక్ష్యము చేయరు. వార్ధకమునందు మానవుఁడు ధర్మార్థకామమోక్షసాధనంబున కశక్తుండగును గావున యౌవనమునుండియే ధర్మాచరణంబునకుఁ గడంగవలయును.

## —♦ స్త్రీస్వభావకథనము ♦—

ఓమునీంద్రా! స్త్రీస్వభావముంగూర్చి చెప్పెదను వినుము. లఘుచిత్త లగుకాంతలు సకలదోషంబులకు నాకరములు. ఈవిషయంబునఁ బంచచూడానారదసంవాదమును పండితులు వర్ణించి యున్నారు. పూర్వమొకప్పుడు దేవర్షియగునారదుఁడు లోకసంచారంబు చేయుచుఁ ద్రిలోకసుందరియగు పంచచూడయను వారాంగనం గాంచి యోసుందరీ! నాకుఁగలిగినయొకసందేహమును నివారింపుమని యడు

గుటయు నయ్యప్సరవెలంది నాశక్తి కొలఁదిఁ బ్రయత్నించెద ననియెను. అప్పుడు నారదుఁడు నారీస్వభావముఁ గూర్చి నాకెఱింగింపవలయు నని కోరుటయు నప్సరచేడియ యో మునీంద్రా! నేనాఁడుదాననై స్త్రీనింద గావించు టుచితము గాదు. స్త్రీలచరిత్రస్వభావములు నీవెఱుంగనివి గావు. అట్టి నీవు నన్నిట్లు ప్రశ్నించుట సమంజసము గాదు అని చెప్పిన నారదుం డోరమణీ! సత్యము వచించుటెవ్వారికి నెన్నఁటికిని నెట్టిలను దోషము గాదనియెను. అంతఁ జారుహాసిని యగుపంచచూడ సత్యంబులును, శాశ్వతంబులు నగుస్త్రీదోషములం గూర్చి యిట్లు చెప్పందొడంగెను. నారదమునీంద్రా! కాంతలెంతటికులరూపవతులైనను, సనాథలైనను మర్యాద నతిక్రమింపక మానరు. కావున స్త్రీలకంటెఁ బాపవస్తువు లీజగంబున నింకేవియును లేవు. పతి యెంతటిప్రసిద్ధుఁడైనను, ధనరూపవతుండైనను, వశవర్తియైనను గాంత యాతనిలోపమునే యన్వేషించుచుండును. మఱియు స్త్రీలకుఁ గల గొప్పదోష మేమనిన వారు నిస్సంశయముగా సిగ్గువిడిచి ఘోరపాపు లగుపురుషులనుగూడ సేవింతురు. తమ్ముఁ బ్రార్థించుచుఁ దఱుచుగ వర్తించుచు కొలఁదిమాత్రముగ నైన నాశ్రయించుపురుషులకు వారు లోఁబడిపోవుదురు. కులమర్యాదలకు లొంగియు, పరిజనంబులకు భయపడియుఁ గాంతలు భర్తృవశవర్తినులై యుందురుగాని లేకున్నచో వారు కోరనిపురుషులే యుండరు. ఆవిషయంబున వారికి వయసుతోఁ గూడ నిమిత్తము లేదు. సురూపియైనను, కురూపియైనను పురుషుఁ డన్నంతనే వారికి భోగపాత్రుఁ డగుచుండును. భయముచేఁ గాని, దయచేఁగాని, ప్రయోజనముచేఁగాని, కులబాంధవసంపర్కముచేఁగాని కాంతలు కాంతులకు వశవర్తులగుటలేదు. వారెప్పుడును యౌవనవతులును, సర్వాలంకారభూషితలు నగువారాంగనలప్రవృ

త్తిని భావించుచుందురు. స్వామిప్రియలై, బంధుగురుజనాదరపాత్రలై సురక్షిత లగుకామినులును పంగ్వంధజడవామన కుబ్జాదులగుపురుషు లయందుగూడ నాసక్త లగుదురు. ఈలోకంబున స్త్రీల కగమ్యుం డగుపురుషుం డెందును లేడు. కలసికొనుట కవకాశము లేకున్నను బరపురుషునియందే కామాసక్త లగుదురుగాని స్వభర్తలయం దనుర క్తలు గాఁజాలరు. అన్యపురుషాభావంబునను, బరిజనభయంబునను, వధబంధనాదిసంశయంబులవలననుమాత్రమే స్త్రీలు పతివశవర్తినులై యుందురు. స్త్రీలు చపలస్వభావలు, దుస్సేవ్యలు, దుర్గ్రాహ్యలు నని ప్రాజ్ఞులు చెప్పుదురు. కాష్ఠంబులచే నగ్నికిని, నదీజలంబులచే సముద్రునకును, ప్రాపజీవులచే యమునకును బోలి పురుషులచే యువ తులకుఁ దృప్తి తీరదు. ఇంతియేకాక కాంతలయం దింక నెన్నియో రహస్యవిషయంబులు గలవు. రూపవంతునిం గాంచినంతనే రమణీహృ దయము కరంగి మారును. కామోద్రేకయు, నాదరప్రియవచనం డును, తి.... సర్వోత్తముండు నైయున్నను గాంతలు కాంతుని వంచింపక మాన రు. రమణీమణులకు రతియందు దృప్తి కలిగిన పర మానాలంకారాదిసంచయంబులవలనంగూడఁ గలుగదు. అంతకుండును, శమనుండును, మృత్యువును, పాతాళంబును, బడబాముఖంబును, అసి ధారయు, విషంబును, సర్పంబును, మహానలంబును గలసి యొకయె త్తును కాంత యొకయెత్తు నై యొప్పుంగనగును. పంచభూతంబులను, జగంబులను, స్త్రీపురుషులను విధాత యెప్పుడు సృజించెనో యప్పటి నుండియు స్త్రీజాతి కిట్టి దుష్టత్వము సంఘటిల్లి యున్నది.

అని చెప్పుటయు వ్యాసుం డోమునివర్యా! ఈజగంబున మూ ఢమానవులు దురదృష్టవశంబున నాటినాటికిని గాంతలయందే యా సక్తు లగుచుందురు. ఈసంతతసంగ మేలకో తెలియకున్నది. మద

నుండు స్త్రీలకంటెఁ బురుషులకే దుర్జయుం డని తోఁచుచున్నది. ఓతపోధనా! మన్మథునిచే విజితుండు గాని పురుషుం డెవ్వఁడైన నున్నచో నాతనిచరిత్రముం దెల్పుము. స్త్రీలు సహధర్మచారు లని మహాత్ములు చెప్పినమాట నాకు విరుద్ధముగఁ దోఁచుచున్నది. స్త్రీ లనృతస్వభావలని వేదములుకూడఁ దెలుపుచున్నవి కావున సహధర్మిణీశబ్ద ముపచారవిధిమాత్రమే యని బోధయగుచున్నది. ఈవిషయంబున నెంతయాలోచించినను నాకు గాఢాంధకారముగానున్నది. దీనింగూర్చి మీ రెఱింగినవిషయం బేమైననున్న నెఱింగింపఁగోరెదనని ప్రార్థించుటయు సనత్కుమారుం డిట్లనెను.

సాత్యవతేయా! పూర్వకాలంబున నష్టావక్రుం డను నొక బ్రాహ్మణుండు వదాన్యుం డనుఋషిచెంతకుం బోయి గుణవతియు, సచ్చరిత్రయు, సాధ్వియు నగునాతనితనయను ప్రభయనువానిని దనకిచ్చి పెండ్లి చేయవలయు నని యర్థించెను. అంతవదాన్యుండు "నీవు త్తరదిక్కుం జూచి వచ్చినచో నేను నీకీకన్యక నీయఁగలను" అని చెప్పెను. అష్టావక్రుఁ డందులకంగీకరించి యుత్తరదిక్కు నెట్లు దర్శింపవచ్చునని యడుగుటయు వదాన్యుం డోకుమారా! అలకాపురియు, హిమాలయంబును దాఁటి సిద్ధచారణసేవితంబగు కైలాసమును దర్శించి ముందటికిం బోయినచో రమణీయంబును, మనోజ్ఞంబును, మేఘసన్నిభంబు నగు నీలవనభూమి గాననగును. అచ్చటఁ దపస్వినియు,వృద్ధయు, దీక్షితయు, మహాభాగయు నగునొకరమణీమణిని దర్శింపఁగలవు. ఆమెను బ్రయత్నపూర్వకంబుగఁ బూజించి నీవు మరలి వచ్చినచో నీకు నాతనయ నిచ్చి పెండ్లి చేసెదను. నీవీప్రతిజ్ఞను నిర్వహింపఁగలవేని పోయి రమ్మని చెప్పెను. అష్టావక్రుండును సమ్మతించి యోసాధుపుంగవా! నేనిప్పుడే పయనంబై నీయానతిచ్చినతావునకుం బోయి వచ్చి నాప్రతి

జ్ఞను జెల్లించుకొందును. మీవచన మవశ్యముగ సత్యము గావలయును. అని భగవానుం డగునష్టావక్రుం డుత్తమం బగునుత్తరంబున సిద్ధచారణసేవితం బగు హిమాలయంబునకుం జని యటం బుణ్యవాహిని యగు బాహుదానదిం గాంచి యందు యథావిధిగ నవగాహనంబు చేసి యత్తిరంబున శయనించి ప్రాతఃకాలంబున లేచి మరల స్నానము చేసి రుద్రాణీకూపంబుకుం బోయి యందును సుస్నాతుండై యటనుండి కైలాసంబునకుం జని పిమ్మట నలకాపురప్రాంతంబున యక్షరక్షితంబగు మందాకినిం దర్శించి యందు స్నానంబు చేసి తీరంబునం గూర్చుండి యుండం గుబేరానుచరు లగుయక్షు లాతని దర్శించి మోమునిసత్తమా! అలకేశ్వరుండు మీదర్శనార్థియై యరుదెంచుచున్నాడని విన్నవించిరి. ఇంతలోం గుబేరుండును వచ్చి యాఋషివర్యునిం బూజించి మహాత్మా! మీరెట్టిసంశయంబును లేక నాయం దనుగ్రహించి మన్మందిరంబునకు విచ్చేయవలయు నని ప్రార్థించి యమ్మునీంద్రుని దన గృహంబునకుం దోడ్కొనిపోయెను.

అచ్చటం గుబేరుం డమ్మునిచంద్రు నర్ఘ్యపాద్యాసనాదిపరిదానంబులచేం బూజితుంగావించి సుఖోపవిష్టుం జేయుటయు దేవగంధర్వాదు లాతనిం బరివేష్టించి యాసీనులై యుండిరి. అప్పుడు ధనేశ్వరుండు మధురస్వరముతో మునీంద్రా! మీకు సర్వోత్తమం బగునాతిథ్యముం గూర్చుటయే మాకుం గర్తవ్యము. మీయనుజ్ఞయైనచో మీవినోదంబుకొఱకు దేవకాంతలు నృత్యగీతంబులం గావించెదరని మనవి చేసెను. అందుల కమ్మునితల్లజుండు వల్లె యనుటయు ఘృతాచి, మిశ్రకేశి, ఊర్వశి, రంభ, అలంబుస, చిత్ర, విశ్వాచి, సుకేశి, సుముఖి, హాసిని, రతిప్రియ, మనోహర మొదలగు దివ్యప్రధానాప్సరలు నృత్యములం గావింప నారంభించిరి. గంధర్వులు దివ్యవాద్యంబుల మ్రోగించ

చుచుండిరి. ఇట్లు నృత్తగీతవాద్యములు రేయింబవలేకరీతిగా జరగి పోవుచుండెను. ఋషిభయంబుచే నొకనిమిషమైనను విరమింపఁబడుటలేదు. అష్టావక్రుం డేమియుమాటాడక యట్లే చూచుచుండెను. ఈ రీతిగా నొకదివ్యవత్సరము గడచిపోయెను. అప్పుడు యక్షనాథుం డో తపోధనా! ఈవినోదములతో నించుమించుగ నొకదివ్యవత్సరమైనది. ఇంకను మీ కేమికావలయునో యాజ్ఞాపింపవలయును. మేమందఱము మీ సేవకులము. అని విన్నవించుటయు మునిశేఖరుండు పరితుష్టుండై యో రాజరాజా! నీపూజలచే నేను సంతుష్టుండనైతిని. నీవభ్యుదయపరంపరలచే వర్ధిల్లెదవుగాక! నేను కార్యార్థినై పోఁదలంచి యుంటిని. అని చెప్పి యానిధినాథునిచే నంపకంబువడసి యటనుండి సత్వరంబుగ నుత్తరాభిముఖుండై కైలాసమందరహిమశైలంబులం గడచి కైలాసంబునకుఁ బ్రిణమిల్లి సమభూభాగంబునుండి పయనంబు సాగించుచుఁ గ్రమంబుగఁ బోయి నందనవనసన్నిభం బగు నొకయరణ్యంబున రమణీయంబగు నాశ్రమంబును సందర్శించెను. అచ్చట స్వర్ణరత్నమయంబులగు శుభశైలంబులును, రత్నభూములును, మనోజ్ఞపుష్కరిణులును మునీంద్రునకు నయనానందముం గూర్చెను. అందుచే నాతఁడు సంప్రీతుండై రమణీయంబులగువివిధవస్తువులం దర్శించుచు నట రాజరాజభవనంబుకంటెను నుత్కృష్టం బగు రత్నమయమందిరంబును బొడఁగాంచెను. ఆదివ్యభవనము దివ్యవిమానంబులపై విహరించుచుండు నచ్చరవెలందులచే రమణీయంబులగుశిఖరంబులు గలకాంచనకృతకశైలంబులచేతను, మందారకుసుమాకీర్ణమగుమందాకినీప్రవాహముచేతను, ముక్తాతోరణకలితంబు లగువివిధమణిగృహంబులచేతను విరాజిల్లుచుండెను. దానికి నలుదెసలను మనోహరపర్వతపంక్తులును వానిపై సుందరసౌధంబులును గన్నులపండువు గావించుచుండెను.

అష్టావక్రుం డప్పుడు గృహద్వారంబు చేరంజని దానివైచిత్ర్యంబున నచ్చెరువంది తన్నుఁదానే మఱచిపోయెను. కొంతసేపటి కాసంయమివరుండు స్మృతిం దెచ్చుకొని ముందటికిం బోయి యుచ్చైస్స్వరంబుతో "ఈస్థానమును సందున్నవా రెవ్వరైన నగుదురుగాక! వారు నేనిచ్చటి కతిథినై వచ్చితి నని తెలిసికొందురుగాక!" అనిపలుకుటయు నంతలోనే యాభవనద్వారమునుండి వివిధాలంకారవిభూషితలును, ప్రసన్నవదనలును, మనోహరవిగ్రహలు నగు నేడ్వురుకన్యకలు ఋషిసమ్ముఖంబునకు విచ్చేసిరి. ఆసుందరీమణు లందఱు నాతనికి వందనంబులు గావించి లోనికి దయచేయవలయు నని ప్రార్థించుటయు నతికుతూహలంబున నమ్మునీంద్రుండును వారితోఁగూడ నమ్మందిరంబునఁ బ్రవేశించెను. ఆభవనాభ్యంతరమున విశుద్ధవసనయు, సర్వాలంకారభూషితయు, రత్నపర్యంకాసీనయు నగు నొకకన్య యమ్మునివరుం గాంచినంతనే లేచి యెదురేఁగి నమస్కరించుటయు నష్టావక్రుండు శుభం బగుఁగాక యని దీవించెను సాధ్వియగు నయ్యువతి యాతపోధనుని సుఖాసీనుం గావించి సప్తకన్యాపరివృతయై యాతనిసన్నిధిని నిలిచియుండెను. ఆకన్యకలందఱును గామాసక్తలై యున్నట్లు వారిలక్షణములంబట్టి యష్టావక్రుండు గ్రహించి విస్మితుండై "ఓ కాంతలారా! మీలో నిత్యసదాచారవతులును, నిత్యవిశుద్ధహృదయలు నగువా రెవ్వరో వారే నాకాతిథ్యమును నిర్వహింపవలయును. తక్కినవారందఱును తమతమగృహంబులకుఁ బోవచ్చును." అనియాజ్ఞాపించుటయు సుందరీరత్నము లగు నేడ్వురుకన్యకలును మునివరునకు వందనంబులు చేసి సెలవు గైకొని వెడలిపోయిరి. ఒకకన్యమాత్రము పర్యంకోపవిష్టుం డగు నయ్యతిథిసన్నిధిని నిలిచియుండెను. ఆమె వృద్ధరూపిణియై యాతనికిఁ బరిచర్యలఁ గావించుచుండెను. ఒక్కంటి నే

పైనపిమ్మటఁ బరితాపితవ్రతుండగు నమ్మహాత్ముఁడు తనపర్ణాశ్రమమును జేరి శయనించుచు నక్కామినిం గాంచి "యోభద్రా! చాలరాత్రియైన దది. నీవును శయనింపఁగూడదా?" అనియెను. ఆమ్మునివచనంబు లాలించినంతనే యక్కన్య గడగడవడంకుచు నీతిబాహ్యమునదానివలె ఋషిశయ్యం జేరి "మహాత్మా! నీయాగమనంబు సుఖజనకం బగుఁగాక!" అని పలుకుచు బాహుయుగళంబుచే నాతని గాఁగిలించుకొనియెను. కాని యాసంయమివరుండు నిద్రానిమగ్నుఁడై కాష్ఠప్రతిమవలె నంతలో నిశ్చేష్టుఁడై పోయెను. అప్పు డాయువతీమణి దుఃఖితయై "యోమహాత్మా! నేను కామమోహితనై యున్నదానను. అతివలు పురుషులకంటె నధీరలు గదా! ఓబ్రహ్మతేజా! ఇఁక నేను సహించు శక్తియును లేదు. నేను నిన్నుఁ గోరివచ్చితిని. నాకోరిక సఫలంబు సేయుము. నీయం దనురక్త నగునాయొక్క ప్రార్థన వినుము. ధర్మాత్మా! ఇదియే నీతపఃఫలము. దర్శనమాత్రంబుననే నన్నుఁ గామించి సేవింపఁగోరిన నన్ననుగ్రహింపుము. నాసర్వస్వమునకును నాకును నీవే ప్రభుండవు. సకలసంపన్నిధానంబగునీమందిరంబును, సర్వర్తురమణీయం బగునీయుద్యానంబును సర్వాంగంబును నాయవియ. నేను నీసకలమనోరథంబులను సఫలమొనర్పఁగలను. రమణీయం బగునీ పుష్పోద్యానమున నాతోఁ గలసి యథేచ్ఛావిహారివై సుఖింపుము. నేను నీయధీనను. నాతోడ దేవమానవభోగంబులం గాంచుచు విహరింపుము. కాంతలకుఁ బురుషసంసర్గంబుకంటెఁ గావింపఁదగిన యుత్తమభోగం బేదియును లేదు. మనస్వినులగుకామినుల స్వేచ్ఛాగమనంబును బ్రతప్తవాలుకాప్రదేశముగూడ నడ్డగింపఁజాలదు." అని యనేకవిధంబులఁ బ్రార్థించుచుండ నష్టావక్రుండు "ఓభద్రా! ఎట్లైనను నేను పరదారగమనం బాచరింపఁజాలను. అది కేవలము ధర్మ

శాస్త్రప్రభాషితమైనది. నేను సత్యము చెప్పుచున్నాను. నాకు విష యాభిలాషత యెంతమాత్రమును లేదు. పుత్రార్థినై మాత్రమే గార్హస్థ్యము నభిలషించుచున్నాను. పుత్రసంతతిఫలంబువలన స్వర్గగమనంబు సేయం దలంచితిని. ఓరమణీమణీ! నాధర్మమును నిశ్చయముగ గ్రహించి నీవిక్కార్యమునుండి విరమింపుము." అని చెప్పుటయు నా సుందరి "ఓవిప్రోత్తమా! రతిప్రియ లగు రమణులకుఁ గామదేవుని కంటె వాయువరుణానిలాదిదేవతలు ప్రియులు గాఁజాలరు. శతసహస్ర స్త్రీజనంబులలోఁ బతివ్రత యొక్కతెయైన నుండుట కష్టము. కామార్తలగు యువతులు జననీజనకులను, భ్రాతలను, భర్తలను, బంధువులను, గులమును, దేవునిఁగూడఁ బరిగణింపక కూలంబును గూల్చిప్రవహించు వాహినులంబోలి కులనిపాతనంబు గావింపఁగలరు. స్త్రీల బహుదోషంబులంగూర్చి ప్రజాపతి సవిస్తరంబుగఁ దెలిపియున్నాఁడు" అని యుగ్గడించుటయు మునీంద్రుండు నిశ్చలచిత్తుండై "ఓయబలా! ఆయాసపడకుము. మెల్లగఁగూర్చుండి నేనేమి చేయవలయునో చెప్పుము" అనియెను. అప్పుడ వ్వెలంది "ఓమహాప్రాజ్ఞా! కొన్నిదినంబులు మద్భవనంబున నుండుము. దేశకాలానుసారంబుగ సర్వంబును దిలకించి కృతకృత్యుండవై స్వస్థానంబునకు వేంచేయుదువుగాక" అని కోరెను.

అష్టావక్రుండును దనకుఁజ్చవచ్చినంతకాల మటనుండుట కంగీకరించెను. ఆసుందరీమణి యాభిలాంగకములు నొక్కొక్కటిగ దర్శించిన నతి లోకరమణీయములై యుండెను. కాని యామె కేవలము వృద్ధురాలుగ నగపడు[illegible] గాంచి యాతఁడు మిగుల విచారించి తనలో "ఈగృహాదేవత యగునీవెలఁది యిట్టి వృద్ధభావముం గాంచుటకు నిశ్చయముగా నేదియో శాపము కారణమై యుండును. అట్టికఠినశాపకారణముంగూర్చి యీమెను బ్రశ్నించుట యుచితము గాదు." అని భా

వించుకొనుచుండెను. ఇట్లాపగలంతయు గడచిపోయెను. అప్పుడకోమలి “మునీంద్రా! సంధ్యామేఘసంకలితం బగుసవితృమండలముం దిలకించితిరా! ఇప్పు డేమి చేయవలయునో యానతిచ్చెదరుగాక” అనుటయు నతండు “ఓచెలువా! స్నానజలంబును గొనితెమ్ము! జితేంద్రియుండనై మౌనముం దాల్చి సంధ్యోపాసనంబు సేయవలయును” అని చెప్పెను. ఆమెయు నట్లే యని దివ్యపరిమళ తైలంబును స్నానజలంబును సమకూర్చి యమ్మునియనుజ్ఞం గాంచి యాతనియొడలంతటను తైలమర్దనంబు గావించి స్నానశాలకుం గొనిపోయి సుపరిష్కృతంబగుపీఠంబున నాతని నాసీనుం గావించి యభిషేచనంబు నిర్వర్తించి యనంతర మతిరుచ్యంబులగు దివ్యఖాద్యంబులచే నమ్మునిశేఖరుని బరితృప్తుం గావించెను. ఇట్లారాత్రి యంతయును మునివరునకుఁ దెలియకుండఁగనే వేగిపోయెను. అప్పుడు పూర్వదిక్తటంబున సూర్యోదయం బగుటచు సందర్శించి మునివరుం డదరిపడి లేచి స్నానసంధ్యోపాసనంబులు నిర్వర్తించి యస్త్రీలంతం గాంచి యింక నిప్పుడు చేయవలసిన దేమియని యడిగెను. అవ్విలాసిని యపు డాతనికి మధురాహారంబులంగొనితెచ్చి నివేదించుటయు మునీంద్రుండు వానిని మితంబుగ భుజియించెను. ఈవిధముగాఁ బగలతిక్రమించి రాత్రి యగుటయు నామె యాతని శయ్యాభవనంబునకుం దోడ్కొనిపోయెను. అందు రమణీయంబు లగు రెండుపర్యంకములు సిద్ధపఱుపఁబడి యుండెను. అప్డావశుని ఁ జేకశయ్యపై శయనించి తనచెంతకే వచ్చినిలిచియున్న యక్కామినియభిప్రాయంబును గ్రహించి “ఓభద్రా! నామనంబెన్నఁటికిని బరదారాసక్తంబు గానేరదు. నీవిటనుండి పోయి యాపర్యంకమ్మపైఁ బరుండి సుఖంబుగ నిదురింపుము. నీకు శుభంబగుఁగాక” అనుటయు నాహేలావతి “మహాత్మా! నేను స్వతంత్రురాలను.

కావున నీకు నావలన ధర్మభంగంబు గలుగదు" అనియెను. మునీం ద్రుండును విస్మితుండై "నీవు స్త్రీవైయుండియు స్వతంత్ర వెట్లయితి వి? స్త్రీలకెందును స్వాతంత్ర్యంబు లేదని ప్రజాపతిధర్మవచనంబు గలదుగదా!" అని యుగ్గడించుటయు నామె నిట్టూర్పులు విడుచుచు "మునిప్రవరా! దుర్లభమనోరథనగు నేను కామపీడితనై మిగులఁ బరి తపించుచుంటిని. నీయందనురాగంబుచేఁ గామబాధసహింపక భూత లంబునం బొరలుచు దుఃఖించుచున్న నన్ననుగ్రహింపుము. నీకుఁ బర దారగమనదోషశంక గలదేని నేను నీకిప్పుడే యాత్మార్పణంబు గా వించుకొనుచున్నదానను. నాపాణిగ్రహణంబు గావించి నిశ్చింతుండ వై నాయభిమతంబు దీర్పుము. నేను సత్యము చెప్పుచున్నాను. ఇందు నీకెట్టిదోషంబును లేదు. నిక్కముగ నేను స్వతంత్రనే యని యెఱుం గుము. ఈవిషయంబున నేదైన దోషంబు గలదేని నిశ్చయముగ నది నాదే యగుఁగాక! ఇట్లు వేఁడుకొనుచున్నయబలనగు నన్ననుగ్రహింపక విడిచినచో నీవధర్మగ్రస్తుండవు గాఁగలవు." అని వేఁడుకొనుటయు నష్టావక్రుండు "కాంతామణీ! విధినతిక్రమించి యథేచ్ఛాచారియగు పురుషునకు సకలదోషంబులును సంఘటిల్లక మానవు. నీవెన్ని చెప్పి నను నేను పరదారరతుండను గాఁజాలను. నామాట విని నీవు నీ శయ్యం జేరి సుఖంబుగ నిద్రింపుము" అనియెను. ఆకామినియును దనపట్టు విడువక "ఓవిప్రకులచూడామణీ! నీపదకమలంబులకుఁ బ్రి ణామంబులు గావించెదను. నాయెడలఁ బ్రసన్నుండ వగుము. నాచి త్తము నీయందే యనురక్తంబైయున్నది. సర్వస్వతంత్ర నగునన్నుఁ బరిగ్రహించి నాయభీష్టసిద్ధిం బ్రసాదింపుము" అని ప్రార్థించెను. కాని ధీరుండగు నమ్మునిసింహుం డించుకంతయుఁ జలింపక "ఓయువతీ! నీవు స్వతంత్రవెట్లయితివి? స్త్రీజాతియందు స్వతంత్రురా లొక్కతెయుం

డుట కెంత మాత్రియవకాశమును లేదే! నీకుమాత్రి మట్టిస్వాతంత్ర్య ము లభించుటకుఁ గారణమేమి?'' అనుటయు నామె నేను చిన్నతన మునుండియు బ్రహ్మచారిణినే యనియు, నందుచేఁ గన్యకనే యగుదు ననియు నీవిషయంబున నవిశ్వాసంబుఁ జూపవలదనియు విన్నవించెను. మునివరుం డామాట లాలించి ''ఓమానినీ! మనమిరువురమును బ్రహ్మ చర్యవ్రతనిరతులమే కావునఁ దద్విరుద్ధంబగుకార్యంబు గావించుట మనయుభయులకు నుచితంబు గాదు. నీవిప్పుడుగూడ నీబ్రహ్మచర్య వ్రతమును గాపాడుకొనుము'' అని ప్రత్యుత్తరం బిచ్చి తనలో ''ఆహా! దివ్యాభరణభూషిత యగునిక్కన్య నాసన్నిధిని నిలిచి నన్నభి లషించుచున్నది. కాని యీయామె దివ్యస్వరూప మొక్కొక్కప్పుడు జరాదూషితంబై కానవచ్చుచుండుటకుఁ గారణ మేమై యుండును? ఇప్పు డీమె పరమరూపవతియగు కన్యకయై యున్నది. ముందేమగు నో? ఎట్లయినను నానియమమును స్వశక్తిచే నిలుపుకొనవలయును. ఈపరీక్షయం దుత్తీర్ణుఁడనైనచో సర్వశ్రేయములును నాకు లభింపఁ గలవు'' అని భావించుకొని ''ఓసుందరీమణీ! నిన్నొక్కమాట యడు గుచున్నాను. బ్రాహ్మణకామ్యానుసారంబుగ సత్యమును వచింపుము. అసత్యము చెప్పఁగూడదు. అప్పుడప్పుడు నీవు నీరూపమును వికార ముగాఁ జేసికొనుటకుఁ గారణ మేమి?'' అని ప్రశ్నించుటయు నాసతీ తిలకమిట్లు చెప్పందొడంగెను.

ఓసత్యప్రతిష్ఠా! బ్రాహ్మణోత్తమా! కామమనుసది భూమ్యా కాశంబులకు వ్యాపించియున్నదని తెలిసికొనుము. నేనుత్తరదిక్కాంత ను. స్త్రీచాపల్యంబునుగూర్చి సర్వంబును నీసన్నిధిని బ్రదర్శించి తిని. ఏమైననేమి! సకలలోకంబులను జయింపఁగలయసాధారణసామ ర్థ్యము నీయందున్నది. ఓయనఘా! ఎంతటివృద్ధురాండ్రైనను గామ

జ్వరపీడితులు గాకనుండవని నీకుం దెలియంజేయుటకే నాహూపములు ... ని యుని మాయలం గావించితిని. విజితేంద్రియుండవగు నీ మొదల బ్రహ్మేంద్రాదిదేవతలందఱును బరితుష్టులై యున్నారు. ఓము హేశ్వరా! వదాన్యుండు నీకుం గన్యాదానంబు సేయందలంచి యుక్తియుపదేశంబుగావించుటకే నిన్నిచ్చటికిం బంపి యున్నాఁడు. ఆతని యుద్దేశమును సర్వసంపన్నంబుం గావించి నేను కృతకృత్యు నైతిని. నీవింక సురక్షితుండవై యాశ్రమంబునకు గృహంబునకుం బోవచ్చును. పరమపతివ్రతయు, రూపవతియు నగు నక్కన్యకామణి నీకు లభింపం గలదు. ఈశ్వరానుగ్రహంబున నామె సుపుత్రవతియు నగును. బ్రాహ్మణకామ్యానుసారంబుగ సత్యంబు నివేదించితిని. బ్రాహ్మణ కామ్యము సకలలోకంబులకు నతిక్రమణీయము గదా. నీవింక వెళ్ళ యవచ్చును. సర్వోత్తమరూపంబున నీవు నీకార్యము సాధించితివి. సర్వవృత్తాంతంబును నావలన నాలకించితివిగదా! ఇంకను బ్రశ్నింప వలసిన దేమైన నున్నచో నడుగుము. మహర్షియగువదాన్యునియొక్క గృహముకంటె నీమూలంబున నాకు లభించినది. అతనిప్రేరణంబుననే నేనిట్లు నీయెడలం బ్రవర్తించితిని. అని చెప్పెను. అష్టావక్రుం డంతయు నాలించి కృతాంజలిపుటుండై సెలవుగోరి యాదేవియనుజ్ఞం గాంచి పయనంబై కతిపయదినంబులకు స్వాశ్రమంబుం జేరి స్వజనంబులచే నాదృతుండై కొన్నిదినంబులు విశ్రమించి యనంతర మొక నాఁడు పరమానందముతో ధర్మానుసారంబుగ మహర్షియగు వదాన్యునిచెంతకుం బోయి దర్శించుటయు నాతఁడు పరమాదరంబున సన్మానించి "కుమారా! నా చెప్పినవిధంబున సకలస్థలంబులను సందర్శించితివిగద!" అని ప్రశ్నించెను. అష్టావక్రుండును సుప్రీతాంతరంగుండై "మునీంద్రా! నేను మీయనుజ్ఞం గాంచి ప్రప్రథమంబున

గంధమాదనంబునకుం బోయి దానికుత్తరంబునం గలమహావనంబును దర్శించితిని. అట నుత్తరదిగ్దేవతకును నాకును నెన్ని యోవిధంబులం బ్రసంగంబు జరగినది. ఆమె మీచరిత్రముం దెల్పుటయే కాక మీ యుద్దేశమునుగూడ నాకెఱింగించినది " అని సంక్షేపంబుగ సర్వంబును నివేదించుటయు వదాన్యుండు సంతసించి యొకశుభముహూర్తంబునం దనతనయ నాతనికిచ్చి యథావిధిగ వివాహంబు గావించెను. అష్టావక్రుండు పరమసుందరీమణి యగునవ్వధూమణిం బరిగ్రహించి సుఖం బుండెను. నిరంతరకామాసక్త లగుకామినీమణులందెవ్వరో యొకరిద్ద అుమాత్రమే పతివ్రతలుందురు. ఎవ్వరినామస్మరణమాత్రంబున సకలకలికలుషంబులును నశించునో యట్టిస్త్రీగాని, పురుషుఁడుగాని లోకంబున నతిదుర్లభులై యుందురు.

## —♦ అరుంధతీప్రస్తావము ♦—

పూర్వమొకప్పు డింద్రుండును సూర్యుండును, వైశ్వానరుండును గలసి యిట్లాలోచించుకొనిరి. సతులకుఁ బతులును, విప్రులకు సూర్యాగ్నులును, గృహస్థుల కతిథులును, క్షత్రియులకు ద్విజులును దేవతలై యుందురు. పతులు సతులచేతను, సూర్యాగ్నులువిప్రులచేతను, అతిథులు గృహస్థులచేతను, బ్రాహ్మణులు క్షత్రియులచేతను సంతృప్తులైనచో బ్రహ్మేంద్రాదిసకలదేవతలును వారిచే సంతృప్త లగుదురు. సతులకుఁ బతులవలన నిహలోకంబున సకలాభీష్టంబులును, బరంబున సద్గతులును లభించును. కావునఁ గాంతలయం దిట్టిసత్యము గలదేమో మనము పరీక్షింపవలయును. మిథ్య, సాహసము, మాయ, మూర్ఖత, లోభము, అపవిత్రత, నిర్దయ యనునీసప్తగుణంబులును వారికి నైజంబులు. వారిలోఁ గొందఱు సత్యధర్మపరాయణ లున్నా

రనికూడ వినుచున్నాము. అట్లే బ్రాహ్మణులలో గృహధర్మనిరతులును, క్షత్రియులలో స్వధర్మపాలకులును గొందఱుందురు. వసిష్ఠపత్ని యగునరుంధతి విఖ్యాతపతివ్రత. అగ్నిభార్యయగు స్వాహాదేవి సప్తర్షిపత్నులరూపములను దాల్పవలసివచ్చినప్పు డరుంధతీరూపము నుమాత్రము గాంచఁజాలక యాపతివ్రత నతిభక్తితో సందర్శించి "ఓకల్యాణీ! ఈజగంబున నీవొక్కతెవే పతివ్రతవు. నేనుగూడ నీతో సమానురాలను గాఁజాలనప్పు డితరకాంతలలెక్క యేమున్నది? వివాహసమయంబులయందు వధువు లగ్నిసన్నిధిని బతికరస్పర్శంబు గావించి నిన్ను స్మరించినంతనే సుఖధనపుత్రలాభంబును, నిత్యసౌభాగ్యంబును గాంచఁగలరు." అని స్తోత్రంబు గావించెను.

ఇట్లు రమణులచేతనే పతివ్రతయుగా గీర్తింపఁబడు కాంతలే ప్రశంసనీయులు. గుణవంతులే గుణములనుగ్రహింపఁగలవారు గదా! కావున మనమిప్పుడు స్త్రీలపాతివ్రత్యముంగూర్చి తెలిసికొనుటకు సతీరత్నమగు నరుంధతిసన్నిధికిఁ బోవలయును. అని సూర్యేంద్రాగ్నులు నిశ్చయించుకొని బయలుదేఱి వచ్చుచు మార్గమధ్యంబుననే కలశకక్షయై జలాహరణార్థమై పోవుచున్న పతిప్రాణయగు నరుంధతీదేవిం గాంచి ప్రహృష్టహృదయులై యామెసమ్ముఖంబున సాష్టాంగనమస్కరించిరి. పతిదేవత యగునరుంధతి యాదేవత్రయముం గాంచి భక్తిపూర్వకంబుగఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి "ఓదేవతలారా! మీరిట్లు విచ్చేయుటకుఁ గతంబేమియో యానతీయవలయును" అని ప్రార్థించెను. అప్పు డమ్మువ్వురు దేవతలును "దేవీ! నిన్నొకవిషయంబు నడిగి తెలిసికొనవలయు ననిమేము నీచెంత కేతెంచితిమి. మాప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరం బిచ్చి మమ్ముఁ గృతార్థులఁ గావింపుము." అని యర్థించిరి. యు నరుంధతి ఓ ఘ త్ములారా! నేను

జలంబు గొని తెచ్చునంతవఱకును మీరు మద్గృహంబున విశ్రమించి యుండుడు. నేను వచ్చి మీ ప్రశ్నకు నాశక్తి కొలంది నుత్తరంబిచ్చెద ననియెను. అంతనా దేవత్రియమో సతీమణీ! నీవంత శ్రమపడ నక్కఱ లేదు. నీకలశమును మేమింతలో జలపూర్ణంబు గావింతుము. మేము శీఘ్రముగఁ బోవలయును గావున నిప్పుడే మా సంశయంబును దీర్చి పంపఁగోరెదము. అని కోరుటయు నా సతీతిలకంబు సమ్మతించి నా జల కలశంబును జలపూర్ణంబుగాఁ జేయుఁడని కోరెను. అప్పుడింద్రుండు "తపోబ్రహ్మచర్యబలంబుచే నన్నైనను స్వర్గచ్యుతుం గావింపఁగలరని నేను సర్వదా బ్రాహ్మణులయెడల భయభక్తితత్పరుండనై యుండుట సత్యంబేని నిమిషమాత్రంబున నీఘటంబు పాదమాత్రజలపూర్ణం బగుఁగాక" అనియెను. అనంతర మగ్నిదేవుండు "నేను హవ్యకవ్యం బులచేతను, బ్రాహ్మణసంతర్పణంబులచేతను బరితృప్తుండ నగుట సత్యంబైనచో నీకలశంబున ద్వితీయపాదభాగ ముదకపూర్ణం బగుఁ గాక" అనియెను. పిమ్మట సూర్యదేవుండు "నేను బ్రాహ్మణులు సుప్రీతులై యొసంగు నర్ఘ్యజలంబుల ప్రభావంబుచేతనే మందేహాది రాక్షసభయంబు వాసి సుఖంబుగ దినదినాభ్యుదయంబు గాంచుచుం డుట నిజంబైనచో నీకుంభంబునందలి తృతీయపాదభాగము నీరం బులచే నిండుఁగాక!" అనియెను. తరువాత వసుంధతీదేవి నిర్జనస్థానం బు లభింపనంతవఱకును, విశేషించి పరపురుష సాహచర్యసంభాష ణంబులు సిద్ధింపనంతవఱకును మాత్రమే సతుల సతీత్వరక్షణంబున కవ కాశంబు గలుగుటయు, కాంతలకు నిరంతరబంధుసంరక్షణావిధానమే యుచితధర్మం బగుటయు సత్యంబులైనచో నీపాత్రంబు జలప్రపూర్ణం బగుఁగాక" అనియెను. ఇట్లా నలువురును సత్యంబులు గావించునంతనే యా జలభాజనంబు సంపూర్ణంబుగ జలపూరితంబయ్యెను.

అది యంతయుం గాంచి సూర్యేంద్రాగ్నులు నిస్సంశయులై యామెనుద్దేశించి " సతీమణీ! మేమీవిషయంబు నడిగి తెలిసికొనుటకే నీసన్నిధికేతెంచితిమి. ప్రశ్నింపకుండఁగనే నీవు మాసందేహమును నివారించితివి. సెలవొసంగినచో నిఁక మేము పోయివచ్చెదము" అనుటయు నరుంధతీదేవి " ఓమహాత్ములారా! ఈజగంబున మనుష్యమత్స్య మానవాదిభేదంబులఁ బ్రవర్తిల్లురమణులందఱును దేవతలచే సృజింపఁ బడినవారే. ఈవిషయంబున విస్మయ మేమున్నది?" అని చెప్పెను. ఆమాట లాలించి సంప్రీతులై యింద్రాదులు నిజావాసంబులకుం బోయిరి.

## —♦ కాలకీర్తనము. ♦—

మహేశ్వరుండు పార్వతి కిట్లు చెప్పందొడంగెను. దేవీ! కాలచిహ్నంబులంగూర్చి సత్యముగఁ జెప్పెద నాలకింపుము. దినము, పక్షము, మాసము, ఋతువు, అయనము, వత్సరము మున్నగుకాలభేదంబుల ననుసరించి దేహంబునం దోఁచు బాహ్యాంతర్లక్షణంబులంబట్టి మృత్యుచిహ్నంబుల గ్రహింపవచ్చును. ఆకస్మికంబుగ దేహంబునఁ బాండువర్ణంబు గాన్పించినను, శరీరోర్ధ్వభాగము రక్తవర్ణంబై తోఁచినను, ముఖకర్ణనయనజిహ్వాదులకును, దక్కుంగలయింద్రియంబులకును జడత్వంబు తటస్థించినను షణ్మాసమధ్యంబున మరణంబు గల్గును. అకారణంబుగ సూర్యచంద్రాగ్నుల తేజంబులఁ జూడఁజాలనివారును, అనావృతస్థానంబుల నంధకారముం గాంచువారును షణ్మాసంబులకు మృతు లగుదురు. సప్తాహపర్యంతమును వామహస్తము నిత్యకంపితంబగుచున్నను, ఇతరాంగికంబులు రోమాంచితంబు లగుచున్నను, తాలువు వెల్లప్పుడును శుష్కంబు లగుచున్నను మాసమధ్యంబుననే



యాయుశ్శేషం బగును. వాతపిత్తకఫంబులు వికృతంబులైనను, నాసికా రంధ్రంబులనుండి నిత్యము కఫంబు బహిర్గతం బగుచున్నను పక్షం బుననే మరణించును. ముఖకంఠంబులు నిత్యశుష్కంబులై యున్నను జిహ్వ స్థూలంబైనను, దంతంబు లార్ద్రంబులైనను ఆఱుమాసంబుల లోనే వినాశంబు గలుగును. నిర్మలజలతైలఘృతదర్పణాదులయందుఁ బ్రతిబింబంబును గనఁజాలనివారును, వికృతంబుగఁ జూచువారును షణ్మాసమధ్యంబున దివంగతు లగుదురు. శరీరచ్ఛాయ మస్తకశూన్యం బై తోఁచినను, కేవలము దేహచ్ఛాయయే కానరాకున్నను మాస ముకంటె నధికంబుగ జీవంబు నిలువదు. ఇవి శారీరకమృత్యుచిహ్నం బులు. సూర్యచంద్రమండలంబులు కిరణరహితంబులై తోఁచినను, కేవలగోళాకారంబులై యగపడినను, పక్షమధ్యంబున విగతజీవు లగు దురు. అరుంధతిం గనఁజాలనివారును, అంతరాళంబున రథవాహనాది రూపములం గాంచువారును, చంద్రమండలమును గళంకశూన్యంబుగఁ జూచువారును, అక్షిదోషంబు లేకయే నక్షత్రంబుల వీక్షింపఁజాలని వారును షణ్మాసమధ్యంబున మరణింతురు. నిర్మేఘంబగునంతరాళం బున మెఱపులుదోఁచినను, పరిచితగృహంబునందే దిగ్భ్రాంతి గలిగి నను, మాసషట్కంబునకుఁ గాలగతుం డగును. రాత్రులయం దింద్ర ధనువును, మధ్యాహ్నంబున నుల్కాపాతంబును గాంచువారును, కాక గృధ్రాదులు చుట్టును దిరుగువారును, సప్తర్షిమండలంబును, స్వాతీప థంబును గానఁబడనివారును, అపర్వంబులయందు సూర్యచంద్రగ్రహ ణంబులఁ గాంచువారును ఆఱునెలలో మరణింతురు. మక్షికాదులు ముసురుకొనుచుండు దేహముగలవారు మాసమధ్యంబున మరణిం తురు. కాకగృధ్రపారావతాదు లకారణంబుగఁ దలపైవ్రాలుట శీఘ్ర మృత్యుసూచకము. ఈమరణచిహ్నంబులు బాహ్యంబులు:—వామదక్షి

షణ్మాసంబులకు మరణం బగును. మఱియు నది శుక్లవర్ణం బైన ధర్మలాభంబును, కృష్ణం బైనఁ బాపసంచయంబును, రక్తం బైన బంధనభయంబును, పీతం బైన శత్రుత్వంబును గలుగునని యెఱుంగవలయును. ఆఛాయ బాహుశూన్యం బైనచో బంధునాశంబును, ముఖశూన్యం బైనచో భోజనద్రవ్యాభావంబును, కటిశూన్యం బైనచో దారవినాశంబును, జంఘాశూన్యం బైనచో ధనక్షయంబును, చరణశూన్యం బైనచో విదేశగమనంబును దటస్థించు నని తెలియనగును. సాధకుండు సకలావయవపూర్ణంబగు నాత్మచ్ఛాయను దర్శించుచు, దేహమనంబుల నైక్యంబు చేసి శివహృదయస్వరూపముగు నక్షరమంత్రమును జపింపవలయును. ఇట్లొకవత్సరంబు జపించినచో జగంబున నాతనికి లభింపని సిద్ధి లేవియు నుండదు. అణిమాదిసిద్ధులును, ఖేచరత్వంబునుగూడ సిద్ధించును.

ఓ దేవీ! భవిష్యద్విషయంబులు విజ్ఞాతంబు లగునట్టి మఱియొక విధానంబు చెప్పెద నాలకింపుము. అజ్ఞేయంబును, సర్వీకృతంబునగు కుండలీశక్తి యుపాసనస్థితంబయ్యును నదృశ్యం బైయుండును. బ్రహ్మాండశిరస్థితంబులగు వేదశ్రుతులచే సంస్తుతయై, ఖేచరంబయ్యును సర్వజీవస్థితం బై, దృశ్యంబును, నదృశ్యంబును, అచలంబును, నిత్యంబును, వ్యక్తంబును, అవ్యక్తంబును, సనాతనంబును, అవర్ణంబును, వర్ణయుతంబును బిందుమాలినీనామకంబునగు నాదివ్యశక్తిని సర్వదా సందర్శింపఁగల యోగిపుంగవులు కృతకృత్యులగుదురు. సర్వతీర్థస్నానఫలంబును, సర్వదానఫలంబును, సర్వయజ్ఞఫలంబును తద్దర్శనమాత్రంబున లభించుననుట కెట్టి సంశయమును లేదు. కావునఁ బండితుడు నిత్యము నష్టయోగాభ్యాసంబు గావించుచు సర్వసిద్ధులం గాంచుచుండును. యోగమువలన ముక్తి గూడ సిద్ధించును. ఇది భుక్తిముక్తిదాయక మగు యోగతత్త్వము.

ఫలయును. అందువలన ధర్మార్థకామమోక్షసిద్ధి యగును. యజ్ఞము, దానము, తపము, తీర్థసేవ మొదలగుసత్కర్మంబులవలనం గలుగు ఫలము పురాణశ్రవణమాత్రంబున లభించును. శాస్త్రపురాణాదులే ధర్మప్రకాశకంబులు గాకున్నచో నిఁక మానవుల కాముష్మికోపాయము లేమున్నవి? వేదశాస్త్రములే లోకమునకు మార్గదర్శకములు. పౌరాణికధర్మము సర్వథా శ్రేష్ఠమైనది. సూర్యతేజంబు లేక జగం బంధకారంబైనట్లే వేదశాస్త్రంబులు లేకున్న లోకముశూన్యంబగును. సృష్టివిధము, వంశమన్వంతరప్రశంస, దానధర్మవ్రతనియమానుష్ఠానములు మొదలగువిషయములు పురాణంబుల వర్ణితంబులై యుండును. మహాపురాణంబులు, నుపపురాణములును గలసి ముప్పదియాఱు గలవు. అందొక్కదానినైన భక్తితో వినువాఁడును, బఠించువాఁడును మహాఫలంబు నందఁగలఁడు. అరణ్యంబున నుండి పురాణపఠనంబు చేయువాఁడు చతుర్వేదజ్ఞానలాభముం గాంచును. పురాణపఠనంబుచే యజ్ఞదానతపంబులవలనం గలుగుఫలంబు సిద్ధించును.

## లింగార్చనంబునకుఁగారణము.

ఇట్లు హరపార్వతీసంవాదమును, సూతుండు శౌనకాదులకుం దెల్పుటయు నాకర్ణించి యందఱును ప్రహృష్టహృదయులైరి. అప్పుడు శౌనకుం డోమహాత్మా! మానవులు సకలదేవతల నాపాదమస్తకమును పూజించుచు మహాదేవునిలింగమునుమాత్రమే పూజించుటకుఁ గారణమేమి యని ప్రశ్నించుటయు సూతుండిట్లు చెప్పం దొడంగెను. మునివరులారా! పూర్వము స్థావరజంగమాదిసకలపదార్థములును వినష్టంబులై జగం బంతయు జలమయంబై యున్నసమయంబున బ్రహ్మయు, విష్ణుండును, రుద్రుండును జలంబులం దేలియుండిరి. అప్పుడం

బగువారిగతిని బడసితులుకాఁడ గ్రహింపఁజాలరుగదా! అంత ప్రచండవాయువు చెలరేఁగి సప్తసాగరముల నింకఁజేయుచుండెను. జలంబంతయు నింకిపోవుటచే జగంబులు అన్నియును నశించిపోయెను. పిమ్మటఁ గ్రమంబుగ స్థావరంబులును విశుష్కంబులయ్యెను. అప్పుడు చతుర్దిశలయందును, నలుప్రక్కలను, ఉపరిభాగంబున నెనమండ్రను సూర్యులుదయించి ద్వాదశార్కులును, తమతీవ్రకిరణంబులచే జగంబును దహింపఁజేయఁజొచ్చిరి. ఆసమయంబునఁ గాలాగ్నిరుద్రుండు పాతాళంబునుండి వెలువడి యెల్లదిశలను నిండి వెలుంగుచుండుటయుఁ బాతాళోర్ధ్వభాగంబులును దిర్యగ్భాగంబును నిశ్శేషంబుగ దగ్ధంబులైపోయెను. అనంతర మగ్నిదేవుండు మరలఁ బాతాళంబునఁ బ్రవేశించెను. పిమ్మటఁ గాలమేఘంబులు క్రమ్మి యేనుఁగుతొండముల ధారాపాతంబుగ వర్షించుచు దశదిశలను జలసంపూర్ణంబులుగాఁ జేసివైచెను. సర్వము నేకార్ణవం బగుటచే భూమ్యాకాశములును, దిగ్విదిక్కులును తెలియకుండఁబోయెను. కేవలజలప్రవాహము ప్రపంచ మంతటను వ్యాపించి యగపడుచుండెను. అట్టిప్రళయసమయంబునను కేవలావ్యక్తగతులును, నిత్యులు నగుబ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఆజలరాశి మధ్యంబునఁ దేలి యాడుచుండిరి. అప్పుడు బ్రహ్మయు, విష్ణుదేవుండును మహానలంబును బోలి ప్రజ్వలించుచున్న రౌద్రమూర్తి యగు మహాదేవునకుఁ బ్రణామంబు లాచరించి "ఓదేవదేవా! నీవే నానావిధంబులఁ బ్రభుండవు. కావున నీసంకల్పానుసారంబుగ సృష్టిగావింపుము." అని కోరుటయు నట్లే చేసెద నని రుద్రుండు తానే జలనిమగ్నుండయ్యెను. అట్లు సహస్రదేవవత్సరంబులు గడచినను మహాదేవుండు కానరాకుండుటయు నేమిచేయుటకుం దోఁపక హరిబ్రహ్మలు సృష్టినిర్మాణంబునకు సముత్కంఠులై యుండిరి. అప్పుడు విష్ణు

దేవుండా [illegible]! ఇంక వృథాకాలక్షేపమువలనఁ బ్రయోజనము లేదు. నాయందు నీవు నీ ప్రజ్ఞానస్థంబునకుఁ బ్రయత్నింపుము. నేను నా [illegible] నీకుఁ బ్రసాదించెదను" అని బోధించుటయు తన జ్ఞాననయనంబు నాతని వచనంబుల గౌరవించి దేవాసురగంధర్వయక్షరాక్షసాదులను, సర్పగణంబులను, మఱియు సకలజీవులను; స్థావరజంగమ పదార్థయుతంబగు జగంబును సృష్టించెను. అట్లు సృజించిన కొంత కాలంబునకు మహాదేవుండగు రుద్రుండు జలంబు వెలువడి జగత్సర్గంబునకు సంకల్పించి తదుపాయంబు నాలోచించుచుండెను. అట్టితరి నూర్ధ్వాధోభాగంబులను, నలుదెసలను నిండి వివిధజీవసంతతులతో విలసిల్లుచున్న జగత్సృష్టి యంతయు నాతనికి గోచరించెను. ఆకారణముచే నద్దేవుండు చేయునది లేక కోపోద్దీపితుండై బ్రహ్మదేవుండు సృజించినయీజగంబునంతను వినాశంబు గావించెద నని నిశ్చయించి యాత్మతేజంబును వర్ధిల్లఁజేసి తనముఖంబునుండి యనలజ్వాలలను బ్రజ్వలింపఁజేసెను. ఆకాలానలకీలలచే జగంబంతయును దగ్ధం బైపోవుచుండుటం గాంచి బ్రహ్మదేవుండు భీతుండై పరమభక్తిపూర్వకంబుగ నద్దేవదేవుని నమస్కారంబుగావించి నిశ్చలచిత్తంబున నిట్లు స్తోత్రంబు గావింపందొడంగెను.

మహేశ్వరా! స్థాణుమూర్తీ! తిగ్మతేజా! ఈశానా! కాలస్వరూపా! నీకు నమస్కారము. సహస్రాక్షుండవును, విరూపాక్షుండవును, త్ర్యంబకుండవును, యజ్ఞప్రియుండవును, శంకుకర్ణుండవును, మహాకర్ణుండవును, కుంభకర్ణుండవును, అర్ణవవాసియు, గజేంద్రకర్ణుండవును, గోకర్ణుండవును, పాణికర్ణుండవు నగునీకు వందనము. శతోదరుండవు, శతావర్తుండవు, శతజిహ్వుండవు, శతాననుండవు, చండమూర్తివి, ముండధారివి, వరదుండవు నగు నీకు నమస్కారము. ఊర్ధ్వకేశదంష్ట్రుండవు, నీలగ్రీవుం

డవు, ప్రతిరూపుండవు, విరూపుండవు, భైరవుండవు, శంభుండవు, అమితతేజుండవు, శితికంఠుండవు, శుభ్రుండవు, కపర్ది వి, పశుపతివి, త్రిపురాంతకుండవు నైననీకుఁ బ్రణామంబులు. దేవా! నీవు త్రిశూలధారివి; కపాలమాలికాలంకృతుండవు; మహాదేవుండవు; దేవదేవుండవు—అట్టినీకు సాష్టాంగవందనములు. సర్వభూతంబులకు నీశ్వరుండును, యతులచే నక్షరరూపంబున ధ్యానము గావింపఁబడువాఁడును, సర్వవ్యాపియు, పరముండు నగుదేవుండు నాకు శరణం బగుఁగాక! దేవదానవమానవాదిసర్వజీవయుతంబును, బ్రహ్మభూతంబు నగునీజగంబును సృజించిన సర్వేశ్వరుండు నాకు శరణం బగుఁగాక! పార్శ్వంబులయందు హరిబ్రహ్మలు వెలుంగుచుండఁ ద్రిమూర్తిధారియు, శాంతుండు నగు దేవుండు నాకు రక్షకుం డగుఁగాక! చతుర్వేదమయుండును, జిష్ణుండును, ఆదిమూర్తియు నగుజగత్ప్రభుండు నన్ను రక్షించుఁగాక! బ్రహ్మరూపధరుండును, జగద్యోనియు, మహేశ్వరుండును, సృష్టికారణుండు నగుదేవాదిదేవుని నేనాశ్రయించెదను. సృష్టిస్థితిపాలనంబునకై విష్ణురూపధరుండై యున్నయాదిపురుషుండును, శంభుండును సనాతనమూర్తికి నేఁ బ్రణతుండ నయ్యెదను. భూతగణంబులతో విహరించువాఁడును, సర్వభూతప్రభుండును, సృష్టికర్తయు, సంహారకారణుండును, ఆదిపురుషోదితుండు నగుసనాతనమూర్తిని నేసేవించెదను. రజస్స్వభావులగుబ్రాహ్మణులు యజ్ఞంబులయం దెవ్వని నారాధింతురో యట్టియజ్ఞకర్తయు, శాశ్వతుండు నగుపురాణపురుషుని నే నుపాసించెదను. ప్రళయకాలంబున సర్వజగంబును సంహరించుచు మరల యుగారంభంబున సృష్టించువాఁడును, రుద్రాత్ముండు నగు సనాతనమూర్తి నాకు శరణ్యుం డగుఁగాక! కల్పాంతంబునఁ గాలమూర్తియై సకలజగంబును సంహరించి యవిజ్ఞేయుండై విహరించు

మహాదేవుఁడు నన్నుద్ధరించుఁగాక! స్థాణుండును, ఈశ్వరుండును, పశుపతియు, శితికంఠుండును, మహేశ్వరుండును, భక్తవత్సలుండును నగు దేవుండు నాకు దిక్కగుఁగాక! శూలపాణియు, మహేశ్వరుండును, శర్వుండును, త్రిలోచనుండును, భక్తవత్సలుండు నగుదేవుండు నాకు రక్షకుఁ డగుఁగాక! గంగాధరుండును, హరుండును, రుద్రుండును, శివుండును, శంభుండును, ఉమాపతియు, భక్తవత్సలుండు నగుదేవుండు నాకుఁ బ్రాపగుఁగాక! కామారియు, వామదేవుండును, త్ర్యంబకుండును, త్రిపురాంతకుండును, భక్తవత్సలుండు నగుదేవుండు నాకుఁ బ్రభుం డగుఁగాక! శివుండును, విరూపాక్షుండును, శంకరుండును, ప్రమథనాథుండును, భక్తవత్సలుండు నగుదేవుఁడు నన్నుగ్రహించుఁగాక! ఈశానుండును, శూలియు, అర్ధచంద్రధరుండును కపర్దియు, భక్తవత్సలుండు నగుదేవుండు నన్ననుగ్రహించుఁగాక! బ్రహ్మశిరోహర్తయు, పినాకియు, వృషభధ్వజుండును నగుదేవుఁడు నాచే నన్నతుండై నన్ను రక్షించుఁగాక! కపాలమాలియు, బాలేందు శేఖరుండును, సర్పభూషణుండు నగుదేవుఁడు మత్పూజితుండై నన్నుఁ గాపాడుఁగాక! ప్రజాసంహారకారియు, భూతేశ్వరుండును, చంద్రశేఖరుండును, కృశానురేతుండును, శ్రీకంఠుండు నగుదేవుం డెల్లయెడల నన్నుఁ గరుణించుఁగాక! గిరీశుండును, వ్యోమకేశుండును, శర్వుండును, భీముండును, సుయజ్ఞుండును, గృపాళుండును నగుదేవుండు నన్నుఁ బాలించుఁగాక!

అని యిట్లు చతురాననుండు సన్నుతించుటయు శంకరుండు ప్రసన్నుండై "ఓ విధాతా! భక్తిపూర్వకంబుగ నాశరణంబు నపేక్షించువారికి నేను సకలమంగళంబులను సమకూర్చుచుందును. శ్రద్ధాభక్తులతో నన్నుఁ బూజించువారిని నేననుగ్రహింపకుందునా? నీస్తోత్రం

బునకు నేను సంతుష్టుండనైతిని. నీయభీష్టంబు దీర్చెదను. ఏమికావలయునో కోరుకొనుము" అని సర్వేశ్వరుం డానతిచ్చుటయు జలజాసనుండు "ఓపరమేశా! నీవు నాయెడలఁ బరితుష్టుండవైతివేని నేను సవిస్తరంబుగఁ గావించిన యీసృష్టిని సంహారంబు గావింపక రక్షింపుము." అని ప్రార్థించుటయు మహాదేవుండు జగద్వినాశకరంబగుదగ్ధ తేజంబు నుపసంహరించి యింకను నేమి కావలయు నని యడిగెను. అప్పుడు బ్రహ్మదేవుండు ప్రజాహితంబు నాలోచించి "ఓదేవదేవా! నీదివ్యతేజమును సూర్యమండలంబునఁ బ్రవేశింపఁజేయుము. నీవాదృశ్యమునకు స్రష్టవును, ప్రభుండవును, నియామకుండవును గదా! త్రిమూర్తులమగుమనము సూర్యతేజమునందే యుండి సకలదేవదానవమానవాదులచేతను త్రికాలార్చనములను గ్రహించుచుందుము. మహాదేవా! కల్పాంతంబునం దీచరాచరప్రపంచమునంతను నీవు సూర్యమూర్తిం దాల్చి దహించుచుందువు. కావున నట్లనుగ్రహింపుము" అని వేడుకొనియెను.

మహాదేవుం డందులకు సమ్మతించి నవ్వుచు ప్రజాసృష్టి కుపయోగింపని యీలింగంబువలనఁ బ్రయోజనం బేమున్నదని పలుకుచు నాత్మలింగోత్పాటనంబు గావించి భూమధ్యంబున నిక్షేపించెను. అదియాకాశమును భేదించి వర్ధిల్లుచుండెను. దాని యాద్యంతములను గాంచవలయునను నుద్దేశముతో విష్ణుదేవుండు పాతాళంబునకును, బ్రహ్మదేవుం డూర్ధ్వలోకంబునకును బోయి యన్వేషించి యిరువురును గృతార్థులు కాఁజాలక పోయిరి. అప్పు డాకాశవాణి "ఓహరివిరించులారా! లోకంబునం దీమహాదేవుని దివ్యలింగమును బూజించువారికి సకలాభీష్టంబులును సిద్ధింపఁగలవు." అని బోధించెను. ఆవచనంబు నాలకించి హరిబ్రహ్మలును, సకలదేవతలును, భక్తిపూర్వకంబుగఁ దత్పరచిత్తులై మహాదేవలింగమును బూజింప నారంభించిరి.

## — లింగస్తోత్రము —

అప్పుడు భగవానుం డగువిష్ణుదేవుండు సర్వతోముఖంబును, అనంతంబు నగుశివలింగముం గాంచి భయభక్తివిస్మితుండై మహాదేవునిదివ్యనామంబులచే నిట్లు స్తుతింపఁదొడఁగెను. శివుండును శాంతుండును, స్థాణుండును, అమితతేజుండును, ఈశానుండును పశుపతియు నగుదేవునకు నిత్యమును నమస్కరించెదను. ఓశితికంఠా! రుద్రా! నీకు నమస్కారము. మహాదేవుండవు, శూలహస్తుండవు, భీముండవు, శంభుండవు నగునీకుఁ బ్రణామంబులు. భర్గునకు, త్రినేత్రునకుఁ, గంగాధరునకు నేను నిరంతరమును వందనము లాచరించెదను. హరుండును, శుభ్రుండును, గౌరీప్రియుండును, స్మరారియు నగులోకపురాంతకునకు నానమస్కారము. వామదేవుండును, వేద్యుండును, శిపివిష్టుండును, మహేశ్వరుండును, ఉగ్రుండును, కపాలమాలియు, ప్రమథాధిపుండును, కాముండును, కపర్దియు, విషాణుండును, నీలగ్రీవుండును, నీలలోహితమూర్తియు నగుదేవుని నేనాశ్రయించెదను. విషాదియు, ఘోరేశ్వరుండును, నిత్యుండును సంహారకారియు, బాలేందుశేఖరుండును, కృశానురేతుండును, శ్రీకంఠుండును, దక్షయజ్ఞధ్వంసకుండును, వ్యోమకేశుండును, శర్వుండు నగుదేవుండు నాకు నిత్యశరణ్యుం డగుఁగాక!

అని యిట్లు శ్రీనాథుండు సన్నుతించుటయు మహాదేవుండు ప్రసన్నుండై "ఓహరిబ్రహ్మలారా! మీస్తోత్రంబునకు నేను సంతుష్టుండ నైతిని. మీయభీష్టసిద్ధి యగుఁగాక" అనియెను. అంత భగవానుం డగువిష్ణుదేవుండు శివలింగప్రసాదంబున శత్రుదుర్జయత్వంబును, త్రిలోకపూజ్యత్వంబును, ప్రజాపాలనశక్తియుం గాంచెను. బ్రహ్మదేవుండు మన్వంతరంబులవఱకును దనసృష్టి కక్షయత్వంబును గాంచెను. ఇట్లు నిర్మలచిత్తంబున భక్తిపూర్వకంబుగా శివలింగమును

స్తుతించువారు ఇహపరలోకసుఖంబులం గాంచఁగలరు. శివలింగపూజాఫలంబువలన స్వర్గసుఖంబును మోక్షలాభంబు నగును. శివలింగమును బూజించుమానవులకు సర్వాభీష్టంబులును లభించును. రాజ్యకాములకు రాజ్యప్రాప్తియు, శ్రీకాములకు సంపత్ప్రాప్తియు, సుఖకాములకు సుఖప్రాప్తియు సిద్ధించును.

## ఆదిసర్గము

ప్రధానుండును, నిత్యుండును, సదసదాత్మకుండు నగుపురుషుండును, ప్రధానపురుషుండై జగంబుల సృజించువాఁడును, లోకభావనుండును, సర్వభూతస్రష్టయు, నారాయణపరాయణుండును, బ్రహ్మస్వరూపముగా మునివరులకు వేద్యుండును, అమితతేజుండును, కల్పకల్పుండును, పవిత్రుండును, హిరణ్యగర్భుండును, పురుషుండును, ఈశ్వరుండును, అజుండును, స్థాణుస్వరూపుండును, వరిష్ఠుండును, జగత్కర్తయు నగుబ్రహ్మదేవునకు నమస్కారంబు గావించి యత్యుత్తమం బగుసృష్టింగూర్చి చెప్పెదను. బ్రహ్మదేవుండు సృష్టికిని, విష్ణుదేవుండు పాలనంబునకును, మహాదేవుండు సంహారంబునకును కర్తలై యున్నారు. ఆదికాలంబున బ్రహ్మకంటె సృష్టికర్త యన్యుం డెవ్వఁడును లేఁడు. స్వయంభూతుం డగునాభగవానుండు ప్రజాసృష్టి గావింపఁ గుతూహలుండై ప్రప్రథమంబున జలరాశిని సృజించెను. ఆజలంబుల యందు వీర్యంబును సృష్టించెను. నరరూపుఁడగు దేవునిచేఁ గల్పితం బగుటచే జలంబునకు నారంబనియు, ప్రళయకాలంబున జలంబుల యందే నివసించియుండుటచే విష్ణుదేవునకు నారాయణుండనియు నామ నిర్దేశంబయ్యెను. ఆనారాయణునుండి హిరణ్యవర్ణం బగునొకయండం బుదయించి జలంబులం దేలుచుండెను. ఆయండమును భేదించుకొని

బ్రహ్మదేవుం డుత్పన్నుం డయ్యెను. అందుచే నద్దేవునకు స్వయంభు వనునామంబు గలిగెను. ఆహిరణ్యగర్భుండు బహుకాలం బయ్యండం బునందుండి దానిని రెండుఖండములుగ భేదించి యొకఖండమును ది వంబుగను, రెండవఖండమును భూమిగను జేసెను. పిమ్మట భూమి కధోభాగంబున సప్తలోకంబులను, దివంబున కూర్ధ్వభాగంబున సప్త లోకములను గల్పించెను. ఈచతుర్దశభువనాంతరాళంబులయందు నా కాశమును సృష్టించెను. ఆసమయంబున భూమ్యాకాశములును దశ దిశలునుగూడ జలనిమగ్నములై యుండెను. అప్పు డద్దేవుండు కాలం బును, మనంబును, వాక్కును, కామక్రోధంబులను, రతినిసృజించెను. అనంతరము మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు మున్నగుమహాతేజుల నేడ్వురను మానసపుత్రుల నుగా సృష్టించెను. అనంతరము బ్రహ్మమానసపుత్రులై యేకాదశ రుద్రులు సృజింపఁబడిరి. అందఱికంటెను ముందుగా బ్రహ్మదేవుండు తనమనంబునుండి సత్కుమారునిఁ బుట్టించెను. ఆసనత్కుమారుండు తన తేజంబును సంక్షిప్తంబుగావించి యుండెను. మరీచిప్రభృతులగు సప్తర్షులవలనను దేవర్షిగణమాన్యంబులగు సమస్తమహావంశంబులు ను త్పన్నంబు లయ్యెను. మఱియు విద్యుత్తు, వజ్రము, మేఘము, ఇంద్ర ధనువు జలరాశిని మొదట సృష్టించి పిమ్మటఁ బర్జన్యుని బుట్టించెను. తరువాత యజ్ఞసిద్ధికొఱకు ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవే దమును గల్పించెను. పూజ్యులగుమునివరు లీవేదత్రయముచే సకలదే వతలను యజించుచుందురు. సర్వజగత్కర్త యగుబ్రహ్మదేవుండు తనముఖమునుండి దేవతలను, వక్షమునుండి పితృగణంబులను, పిమ్మ ట మానవులను, జఘనమునుండి యసురగణంబులను బుట్టించెను. ఆ దేవుని యితరాంగంబులనుండి క్రమంబుగ బ్రధానాప్రధానులగు సమ

స్వజీవులును సంభవించిరి. ఇట్లు సృష్టిం గావించియు వనజాసనుండు జగంబున సంపూర్ణముగ జీవవృద్ధి గాకుండుటను విచారించి యప్పుడు తనదేహంబును రెండు భాగంబులు చేసి స్త్రీపురుషరూపంబులం గావించెను. అనంతర మమ్మహాత్ముండు తనమహిమచే విశ్వమంతటను దనసృష్టిని వ్యాపింపఁజేయుచు ప్రథమంబున విరాణ్మూర్తి యగువిష్ణుదేవుని సృజించెను. విరాడ్మూర్తియు, నద్వితీయుండును, బురుషుండును, భగవానుండు నగువిష్ణుదేవుండు మనువున కనంతరము సృష్టింపఁబడిన కారణముచే ద్వితీయమనువుగా సుప్రసిద్ధుం డయ్యెను. ఆజగత్ప్రభుం డప్పుడు సృష్టిం గావించెను. ఆనారాయణసృష్టియందలి సకలజీవులు నయోనిజులైరి. ఇది యాదిసర్గవృత్తాంతము. ఈచరిత్రము నాకర్ణించువారు దీర్ఘాయుష్మంతులును, యశస్వులును, ధనవంతులును, పుత్రపౌత్రసంపన్నులునై యిహలోకంబున సకలసుఖంబులం గాంచుచు, పరలోకంబున నభిమతసద్గతిలాభంబుల నందఁగలరు.

## —♦ పృథూత్పత్తి. ♦—

బ్రహ్మదేవుండు మొదటఁ గొంతప్రజాసర్గంబు గావించి యట్టి మానససృష్టివలనఁ బ్రజావృద్ధియగుట దుష్కరంబని భావించి తన ప్రభావంబునను, ధర్మబలంబువలనను శతరూపయనునొకరమణీమణిని సృజించెను. అద్దేవి యేకశతవర్షంబులు కఠినతపంబు చేసి యాదిపురుషుం డగుప్రజాపతిని బతిగాఁ బడసెను. అయ్యాదిపురుషుం డగుస్వాయంభువు మనునామంబున విఖ్యాతుండై యేకోత్తరశతయుగపర్యంతమును జీవించెను. ఆతనికిఁ బ్రియవ్రతుండును, ఉత్తానపాదుండు నను తనయులును, వీరక యనుతనయయుఁ గలిగిరి. మహాభాగ యగుకామ్యా యనుకాంతయందుఁ గర్దమప్రజాపతివలన స్వరాట్టుఁడు, అక్షి

విరాటుఁడు, ప్రభువు ననునలుగురుసుతులు పుట్టిరి. ఇంద్రతుల్యుండగు నుత్తానపాదుండు ధర్మతనూజయగు సునీతి యనుసుందరివలన బహు పుత్రులం గాంచెను. అందు ధ్రువుండు త్రిసహస్రదివ్యవర్షంబులు మహాతపంబు చేసి బ్రహ్మలోకసదృశం బగుసప్తర్షిమండల సమ్ముఖంబున నక్షయపదంబుం గాంచెను. అతనికి పుష్టియు, ధాన్యయు నను నిరువురుతనూజు లుదయించిరి. అందు పుష్టి, యవంతికన్యయగుభార్య యందు రిపుఁడు, పురంజయుఁడు, విప్రుఁడు, వృకలుఁడు, వృకతేజుఁడు నను పుత్రపంచకముం గాంచెను. అందు రిపునకు చాక్షుషుం డను మను వుదయించెను. ఆచాక్షుషమనువునకు పుష్కరిణియను భార్య వలన వరుణుండు జనించెను. మఱియు నాతఁడు నడ్వలయనుకాంత వలన రురుఁడు, పురుఁడు, శతద్యుమ్నుఁడు, తపస్వి, సత్యజిత్తు, కవి, అగ్నిష్టోముఁడు, అతిరాత్రుఁడు, అతిమన్యుఁడు, సుయశుఁడు ననుపది గురు తనూజులం గాంచెను. రురుపత్నియగు నాగ్నేయిగర్భంబున అంగుఁడు, సుమనుఁడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుఁడు, శిబుఁడు నార్గురుసుతులు జనించిరి. అంగునకు సునీథయను భార్యవలన వేనుం డనునొక యాత్మజుం డుదయించెను. అవ్వేనుం డధర్మపరుండును, దురాచారుం డునై ప్రజాక్షోభంబున గతాసుం డగుటయు లోకహితంబుకొఱకు మునివరు లాతనిదక్షిణభుజంబును మథించుటయుఁ గవచధనుర్ధారియు నాదిత్యతేజుండు నగుపృథుండను కుమారుండు జనించెను. అతఁడే క్షత్రియకులంబున కాదిపురుషుండై ప్రథమంబున సర్వభూపరిపాలనంబు గావించి రాజసూయాధ్వరమును నిర్వహించెను. అతనికి సూతుఁడు మాగధుఁడు నను నిద్దఱుపుత్రులు గలిగిరి. ప్రజాహితంబు గోరి యాపృథురాజేంద్రుండు దేవపితృగణంబులతోడను, అసురగంధర్వాప్సరోగణంబులతోడను, పుణ్యజనగణంబులతోడను తరులతా

పర్వతంబులతోడను గలసి పృథ్వీదోహనంబు గావించెను. అమ్మహీ పాలుని నిరంతర యజ్ఞద్రవ్యంబులచే దేవతలందఱును జీవించుచుండిరి.

—♦ దక్షోత్పత్తి. ♦—

ఆపృథుచక్రవర్తికి హావిర్ధాని, హావిర్ధాముఁడు నను నిద్దఱుతన యులు గల్గిరి. హావిర్ధామునకు శిఖండియందు ప్రాచీనబర్హి పుట్టెను. అతనివలనఁ బ్రాచీనాగ్రంబులగుకుశ లుత్పన్నంబు లయ్యెను. అతఁడు సముద్రతనయను బెండ్లియాడి పదిమందికుమారులం గాంచెను. ఆప్రచే తసులు వరుసగను ధనుర్వేదంబును గూలంకషముగ నభ్యసించి యేకధర్మపరాయణులై సముద్రజలంబుల వసించి పదివేలసంవత్సర ములు మహాతపంబు గావించిరి. అట్లు వారందఱును దపోనిమగ్నులై యుండుటయు భూమండలమంతయు నరణ్యామయంబై సస్యోత్పత్తి కవ కాశము లేకుండఁబోయెను. జగమంతయు నరాజకంబగుటచేఁ బీడి తయంబగుచుండెను. అదియంతయుం గాంచి ప్రచేతసులు సముద్రము నుండి యగ్నిని వాయువును వ్యాపింపఁజేయుటయు, వాయువు వృక్షో త్పాటనంబును, అగ్ని వృక్షదహనంబును గావింపనారంభించెను. అట్లు వృక్షవినాశనంబగుచుండుటయు నోషధీశ్వరుం డగుసోముండు ప్రచేతసులపాలికింబోయి "ఓరాజకుమారులారా! మీకోపము నుప సంహరింపుఁడు. ఈభూజంబుల కిట్టిపాటు గలుగునని నేనుముందే గ్రహించి యీవృక్షకన్యకను నాగర్భంబున ధరించి యుంటిని. ఓమహా భాగులారా! సోమవంశవర్ధని యగునికన్యకను మీరు పరిగ్రహిం పుఁడు. ఈమెగర్భంబున మహాత్ముం డగుదక్షప్రజాపతి జన్మింపఁ గలఁడు. మీ తేజంబులయం దర్ధాంశమును, నాయంశమును గాంచి బిమ్మట తేజుండగుదక్షప్రజాపతి మరలఁ బూర్వాధికంబుగఁ బ్రజాసర్గం

బు చేయఁగలఁడు.'' అని బోధించుటయు, ప్రచేతసు లాసోమకన్యను దమసహధర్మిణిగా స్వీకరించిరి. ఆమెగర్భమునందు దక్షప్రజాపతి యుదయించెను. మహాతేజుండగు దక్షుండు సోమాంశంబున సర్జించి స్థావరజంగమంబులను, ద్విపాదచతుష్పాదయుతంబులగుసకల జీవులను సంకల్పమాత్రంబుననే సృజించెను. పిమ్మటనాతఁడు కన్యాసృష్టిం గావించి ధర్మునకుఁ బదుగురుకన్యలను, కశ్యపునకుఁ ద్రయోదశకన్యకలను, చంద్రునకిరువదియేడ్వురుకన్యకలను దానము చేసెను. అనంతరము దేవదానవాదులును, సర్పవిహంగాదులు నుత్పన్నంబు లయ్యెను. అదిమొదలుగఁ బ్రజలందఱును స్త్రీపురుషసంయోగంబు వలననే జనింపందొడంగిరి. ఆదికాలంబున సందర్శనసంస్పర్శనాదులచే మాత్రమే సృష్టి యగుచుండెనని పురాణంబులవలనఁ దెలియవచ్చుచున్నది.

అని సూతుండు చెప్పుటయు మును లోసూతనందనా! దక్షప్రజాపతి బ్రహ్మదేవుని యంగుష్ఠమునుండి జన్మించెనని నీవిదివఱకు వచించి యుంటివి. ఇప్పుడు ప్రచేతసులవలన నుదయించెనని చెప్పితివి. చంద్రునకు దౌహిత్రుండైనదక్షుండు మరలఁ జంద్రునకెట్లు కన్యాదానంబు గావించెను? మాకీసంశయమును నివారింపవలయు నని ప్రార్థించిరి. సూతుండు మందహాసంబు చేసి యోమహాభాగులారా! ఈజగంబునఁ బ్రతికల్పంబునందును జీవులుత్పత్తివినాశనంబులం గాంచుచుందురు. దక్షాదిప్రజాపతులుగూడ నట్టివారే యని యెఱింగి ప్రాజ్ఞులు నిస్సందేహులై యుందురు. దక్షప్రజాపతిచేఁ గావింపఁబడిన స్థావరజంగమాదిసృష్టిక్రమముంగూర్చి పఠించువారును విను వారును పుత్రపౌత్రవంతులై దీర్ఘాయుష్మంతులై యిహసుఖంబులం గాంచుచుఁ బరలోకంబున స్వర్గభోగంబు లనుభవింపఁగలరు.

## దేవదానవాదిసర్గము.

దక్షప్రజాపతి మొట్టమొదట మానససృష్టి నారంభించి యందువలనఁ బ్రజాభివృద్ధి యగుట దుష్కరం బని భావించి తపస్వియగు వీరణప్రజాపతితనయను బెండ్లియాడి యామెవలన నైదువేలమంది పుత్రులం బడసెను. బ్రహ్మపుత్రుం డగునారదుండు దక్షకన్యామూలంబునఁ గశ్యపునివలన జగంబునఁ బురుషసృష్టివర్ధిల్లఁగలదని వినియున్నవాఁడుగావున నాతఁ డప్పుడు దక్షసంతానముం గాంచి "ఓమూర్ఖులారా! దిక్పరిజ్ఞానమే లేని మీరు సృష్టిసముద్యమంబు గావింతు రేల? జ్ఞానమును సంపాదించుకొనుఁడు" అని బోధించుటయు వారందఱును బరివ్రాజకులై దిక్కుల నన్వేషించుటకై బయలుదేఱి పోయిరి. అట్లు వారు పోవుటయు దక్షుండు మరల నైదునందలమంది తనయులం గల్గించెను. వారందఱును సర్గంబున కుపక్రమించుటయు మరల నారదుం డాహర్యశ్వులం గాంచి "ఓయవివేకులారా! భూపరిమాణమునే యెఱుంగనిమీరు సృష్టికొఱకుఁ బ్రయత్నించుట యుక్తముగాదు." అని చెప్పుటయు వా రనంతం బగునాకాశపదంబునుబట్టి పోయి పరాభవనామకం బగు దేశంబును జేరి సముద్రమునం జొచ్చిన నదులవలె నిప్పటికిని వెనుదిరిగి రాలేక యుండిరి. పిమ్మట దక్షుఁడు సృజించినపుత్రులందఱును దమసోదరుల నన్వేషింపఁ బ్రయత్నించి హతాశులై నశించుచుండిరి. ఇట్లు తనసృష్టియత్నం బంతయు విఫలం బగుచుండుటయు దక్షప్రజాపతి చింతించి వీరణివలన మరల నఱువది పుత్రికల నుత్పాదించెను. అందు అరుంధతి, వసు, జామి, లంబ, భాను, మరుద్వతి, సంకల్ప, ముహూర్త, సాధ్య, విశ్వ యను పదుగురను ధర్మునకు గన్యాదానంబు చేసెను. వారిలో విశ్వయందు విశ్వేదేవతలును, సాధ్యయందు సాధ్యులును, మరుద్వతియం దూనపఞ్చాశద్వా

యుగణంబులును, వసుగర్భంబునం దష్టవసువులును, భానుగర్భంబున ద్వాదశాదిత్యులును, ముహూర్తయందు ముహూర్తజులును, లాబయందు ఘోషుండును, జామియందు నాగవీథియు, అరుంధతియందు పృథ్వీవిషయంబును సంకల్పయందు సంకల్పమును జనించెను. అయ్యెడ ధ్రువుండు, సోముండు, ధరుండు, అనిలుండు, అనలుండు, ప్రత్యూషుండు, ప్రభాసుండు, ననువారష్టవసువు లనంబడుదురు. అందు ముసకు వేతండుండు, శ్రముండు, శాంతుండు, ముని యనువారు జనించిరి. ధ్రువునకు లోకోత్పాదనకారణుండగు కాలుండును, సోమునకు వర్చసుండును, ధరునకు దేవాన్నవాహి యగుద్రవిణుండును, అనిలునకు శివయందు పురోజవుండు, అవిజ్ఞాతుండును, అనలునకు శరగుచ్ఛంబున కుమారుండును జన్మించిరి. అక్కుమారుండు కృత్తికాగర్భజాతుం డగుటచే కార్తికేయనామంబునం బ్రసిద్ధుం డయ్యెను. ప్రత్యూషునకు దేవలుండు జనించెను. ఆతని కిరువురుతనయులు గలిగి వారు సంతానవంతులైరని పెద్దలు చెప్పుదురు. త్రిలోకసుందరియు, బ్రహ్మచారిణియు, కామగమనయు, యోగసిద్ధయు నగుబృహస్పతిసోదరి యష్టమవసువగు ప్రభాసునకు ధర్మపత్ని యయ్యెను. ఆమెగర్భంబున బహుశిల్పనిపుణుండును, దేవతాగృహనిర్మాతయు, అలంకారస్రష్టయు శిల్పశ్రేష్ఠుండును, దివ్యవిమాననిర్మాణకుశలబుద్ధియు, మహాభాగ్యశాలియు నగువిశ్వకర్మ యుదయించెను. అజైకపాదుండు, అహిర్బుధ్న్యుడు త్వష్ట, రుద్రుండు, హరుండు, బహురూపుండు, త్ర్యంబకుండు, వృషాకపి, శంభుండు, కపర్ది, రైవతుండు, ననువారు త్రిభువనేశ్వరులగు నేకాదశరుద్రులు. త్వష్టపుత్రుండు మహాయశస్వియు, శ్రీయుతుండునై విశ్వరూపనామంబున విఖ్యాతుం డయ్యెను. ఇది రుద్రవంశము. అదితి, దితి, దను, అరిష్ట, సురస, ఇల, సురభి, వినత, తామ్రి, క్రోధ

వసు, కద్రు, శని యనుపదుమూగ్గురుకన్యలను దక్షుండు కశ్యపున కిచ్చెను. ఆమన్వంతరంబున సర్వశ్రేష్ఠులగు పన్నిద్దఱు సురవరులు జన్మించి యుండిరి. వారందఱును జేరి చాక్షుషమన్వంతరసమయంబున మనమందఱము నదితిగర్భంబున సాధుమంగళార్థమై జన్మింపవలయు నని నిశ్చయించుకొనిరి. అట్లే వారు చాక్షుషమన్వంతరంబునఁ గశ్యపున కౌరసులై యదితియం దింద్రోపేంద్రులు జనించినతరువాత ఆర్యముఁడు, ధాత, త్వష్ట, పూషుఁడు, వివస్వంతుఁడు, సవిత, మిత్రావరుణులు, అంశుఁడు, భగుఁడు, అతితేజుఁడు ననునామంబులతో జనించి ద్వాదశాదిత్యనామంబునఁ బ్రసిద్ధులైరి. వారే రైవతమన్వంతరంబునను ద్వాదశాదిత్యులై జనించిరి. చంద్రుని యిరువదియేడ్గురుభార్యలును సువ్రతలై యుండిరి. వారిసంతతి యంతయును, దీప్తిమంతమై విలసిల్లెను. అరిష్టనేమిభార్యలగర్భంబులయందుఁ బదియాఱుగురు సుతు లుదయించిరి. బహుపుత్రునకు నలుగురుతనయులుమాత్రమే కలిగిరి. దేవర్షి యగుకృశాశ్వునకు దేవతలశస్త్రాస్త్రంబు లుత్పన్నంబు లయ్యెను. ఈసకలదేవతలును యుగసహస్రాంతంబున మరల జనించుచుందురు. అందు ముప్పదిమూగ్గురుమాత్రము యథేచ్ఛానుసారంబుగ జనింపఁగలరు. వారికిని భవవినాశంబులు గలవు. సూర్యుండు ప్రతిదినంబు నుదయించునట్లే దేవతలును బ్రతియుగంబున నుదయించుచుందురు. కశ్యపునకు దితియందు, హిరణ్యకశిపుఁడు, హిరణ్యాక్షుఁడు నను మహాబలవంతు లిద్దఱుపుత్రులు గలిగిరి; సింహికయను తనయ జనించెను. ఆసింహికను విప్రచిత్తి పెండ్లియాడెను. అతిబలుం డగు హిరణ్యకశిపునకు అనుహ్లాదుఁడు, హ్లాదుఁడు, ప్రహ్లాదుఁడు, సంహ్లాదుఁడు నను నలుగురు పుట్టిరి. హ్లాదునకు హ్లాదుండును, ఆయుష్మంతుండును, శివుండును, కాలుండును జనించిరి. ప్రహ్లాదునకు విరోచ

నుండును, అతనికి బలియును జన్మించిరి. ఆబలికి నూర్గురుపుత్రులు గలిగిరి. అందు జ్యేష్ఠుండు బాణాసురుండు:—హిరణ్యాక్షునకు కుకురుండు, శకుని, భూతసంతాపనుండు, మహానాదుండు, కాలనాభుండు ననునైదుగురు సుతులుదయించిరి. పరాక్రమవంతులును, బలవంతులు నగునూర్గురుతనయులు దనుగర్భంబునం గశ్యపునకు జనించిరి. వారిలో ద్విశిరుండు, శకుకుండు, పరిభువు, బలి, శివుండు, అయోముఖుండు, శంబరుండు, కపిలుండు, వామనుండు, విశ్వానరుండు, పులోముండు; విద్రావణుండు, మహాశిరుండు, స్వర్భానుండు, వృషపర్వుండు, వీర్యవంతుండు, విప్రచిత్తి యనువారు ప్రధానులు. అందు స్వర్భానునకుం బ్రభ యనుతనయయు, పులోమునకిందిపత్నియగు శచియు, వృషపర్వునకు హయశిర, ఉపదానవి, శర్మిష్ఠయను ముగ్గురుతనూజలును గలిగిరి. విశ్వానరునకు పులోమ, కాలిక యను నిద్దఱుపుత్రికలుదయించిరి. ఆయిరువురను ప్రజాపతి యగుమరీచి పెండ్లియాడి దానవకులానందదాయకు లగు నాఱువేలమంది పుత్రులం గాంచెను. పౌలోమకాలకేయు లనువారు మహాబలవంతులై యమరులకవధ్యులై హిరణ్యపురంబున వసించి యుండిరి. పితామహుండగు బ్రహ్మదేవుని యనుగ్రహముచేం బాండునందనుం డగునర్జునుండు వారినందఱను వినాశంబు గావించెను. విప్రచిత్తికి సింహికయందు సైంహికేయులు పదుముగ్గురు జనించిరి. వీరు దైత్యదానవసంసర్గజాతులగుటచే నజేయపరాక్రములైరి. రాహువు, శల్యుండును మిగుల బలవంతులు. బలుండు, మహాబలుండు, వాతాపి, నముచి, ఇల్వలుండు, స్వసృపుండు, అజకుండు, నరకుండు, కాలనాభుండు, శరమాణుండు, శరకల్పుండు మొదలగువారు వంశవృద్ధికరులైరి. వీరిపుత్రపౌత్రగణంబులవలన దనువంశం బభివృద్ధిం గాంచెను. నిత్యతపఃపరతంత్రుం డగుసంహ్లాదునివం

శంబున నివాతకవచగణంబులు జనించెను. మఱియుఁ గశ్యపునకుఁ తా మ్రాగర్భంబున ఖగాదు లుదయించిరి. మఱియు కాకో, లూక, శ్యేన, భాస, సుగ్రీవ, గృధ్రి, శుక పక్షికాంత లుదయించి యాయాపక్షిజాతులను వర్ధిల్లఁ జేసిరి. అశ్వములు, ఉష్ట్రములు, గర్దభంబులునుగూడ తామ్రయందే జనించెను. వినతగర్భంబున అరుణుఁడు, గరుడుండును బుట్టిరి. అందరుణుండు సూర్యతేజంబును సహింపఁగల శక్తిం గాంచి సూర్యసారథియై జగద్విఖ్యాతుం డయ్యెను. గరుడుండు పక్షిరాజై సుపర్ణనామంబునఁ బ్రసిద్ధుం డయ్యెను. సురసగర్భంబున బహుమస్తకయుతంబులును, గగనచరంబులును, బాహుబలయుతంబులును, బృహత్కాయంబులు నగు సర్పంబు లనేకంబులు జనించెను. అందు సర్పరాజగు శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, ఐరావతుఁడు, మహాపద్ముఁడు, కంబళుఁడు, అశ్వతరుఁడు, ఏలాపత్రుఁడు, పద్ముఁడు, కర్కోటకుఁడు, ధనంజయుఁడు, మహానీలుఁడు, మహావర్ణుఁడు, ధృతరాష్ట్రుఁడు, వలాహకుఁడు, కుహరుఁడు, పుష్పదంతుఁడు, దుర్ముఖుఁడు, సుముఖుఁడు, బహుశుఁడు, ఖరరోముఁడు, పాణి మొదలగువారు సర్పప్రధానులై విఖ్యాతులైరి. మఱియు సురభియందు శశంబులు జనించెను. ఇలయందు తృణలతావృక్షంబులు గలిగెను. స్వసయందు యక్షరాక్షసులుదయించిరి. అరిష్టయందు సకలజీవులు జన్మించిరి. ఇట్టికశ్యపసంతానము జగంబంతటను వ్యాపించెను. ఇది యంతయును స్వారోచిషమన్వంతరసృష్టి యని యెఱుంగనగును. వైవస్వతమన్వంతరంబున వరుణుం డాచరించు మహాయజ్ఞంబునఁ బ్రజాపతి యగు బ్రహ్మ హోతయై యుండెను. ఆసమయంబున నాతని మానసమునుండి ప్రజాసృష్టి యయ్యెను. పూర్వకాలంబున బ్రహ్మమానసపుత్రులగు మరీచిప్రభృతి సప్తర్షిగణంబులే బ్రహ్మపుత్రులుగాఁ బ్రసిద్ధులైరి. అనంతరము దేవదా

నవయుద్ధంబున దానవులు నిహతులగుటయు నపుత్రిక యగుదితి భర్త యగుకశ్యపుని చెంత కేతెంచి శ్రద్ధాభక్తులతో నాతని నారాధించు చుండెను. ఆమెయుపచారంబుల కమ్మునిశ్రేష్ఠుండు సంతుష్టుండై నీ కేమి కావలయునో కోరుకొమ్మనియెను. అప్పుడు దితి "నాథా! ఇంద్రుని వధించుటకు సమర్థుండగుతనయుని నాకుఁ బ్రసాదింపుము" అని వేడుకొనియెను. మహాతపుండగుకశ్యపుం డట్లే యనుగ్రహిం చెను. రమణీరత్నమగు దితి యప్పుడు కశ్యపునివలన గర్భమును ధరించెను. అది యెఱింగి కశ్యపుండు ప్రహృష్టుండై తపంబునకుం బోయెను. దేవనాథుం డగునింద్రుం డీవృత్తాంతమంతయు నెఱింగి యెట్లయిన దితిగర్భంబును వినష్టంబు గావింప నిశ్చయించి ఛిద్రాన్వే షణముం జేయుచుండెను. ఏకశతవత్సరంబులుముగియకుండుకాలంబున నొకప్పుడు దితి పాదప్రక్షాళనంబు చేసికొనకుండఁ బశ్చిమశిరస్కయై నిదురించుచుండుటం గాంచి దేవేంద్రుండు దితిగర్భంబునఁ బ్రవేశించి యందలిపిండమును సప్తఖండంబులుగా భేదించెను. వజ్రాహతిచే నా పిండఖండములు రోదనము గావించుటయు గర్భస్థుం డగునింద్రుండు వానిని వారించి మరల నొక్కొక్కఖండమును సప్తఖండములుగా ఖండించెను. ఆనలువదితొమ్మండ్రును వియత్సంచారసమర్థులును, మ హాబలవంతులు నగుమరుద్గణంబులై పుట్టి యింద్రునకు సహాయులైరి. వారు క్రమంబుగ వర్ధిల్లుటయు భగవానుండగు హరి వారికిఁ బ్రత్యేక ముగ రాజ్యప్రదానముం గావించెను.

## —◆ ఆధిపత్యకల్పనము. ◆—

పృథుచక్రవర్తి ద్విజులను వీరుధులను, నక్షత్రగ్రహంబులను యజ్ఞతపంబులకును సోముని, జలంబులకు వరుణుని, రాజగణంబులకు

వైశ్రవణుని, ద్వాదశాదిత్యులకు భగవానుండగువిష్ణుదేవుని, వసువుల
కుఁ బావకుని, ప్రజాపతులకు దక్షుని, మరుత్తులకు వాసవుని, దైత్య
దానవుల కమితతేజుం డగుప్రహ్లాదుని, పితృదేవతలకు వైవస్వతుని,
మాతృగణంబులకును, వ్రతంబులకును, మంత్రంబులకును, గోవులకు
ను, యక్షులకును, రాక్షసులకును, పార్థివులకును, సర్వభూతపిశా
చంబులకును శూలపాణి యగుమహాదేవుని, శైలంబులకు హిమవంతు
ని, నదులకు సముద్రుని, మృగంబులకు శార్దూలమును, గోవులకు వృ
షభంబును, వనస్పతులకు వృక్షమును, దిక్కులకు దిక్పాలకులను, ప్ర
భువులుగాఁ జేసి యభిషేకించెను. మఱియు విరాట్ప్రజాపతిపుత్రుని
పూర్వదిగ్భాగమునకును, కర్దమప్రజాపతితనయుం డగుసుధన్వుని దక్షి
ణదిగ్భాగంబునకును, రజసిసుతుండును సర్వకార్యదక్షుండును, మహా
త్ముం డగు కేతుమంతుని బశ్చిమదిగ్భాగంబునకును, పర్జన్యప్రజాపతి
సూనుండగు హిరణ్యరోముని నుత్తరదిగ్భాగంబునకును బ్రభువులుగాఁ
జేసెను.

## —♦ పృథుచరిత్రము ♦—

తొల్లి ధర్మరక్షణకర్తయు, నత్రితుల్యుండును, అత్రికులసంభూ
తుండు నగునంగుండను ప్రజాపతి మహీమండలమును బరిపాలించుచుం
డెను. ఆతనికి మృత్యుతనూజ యగుసునీథయందు వేనుండను తనయుం
డు గలిగెను. అక్కుమారుండు మాతామహదోషవశంబున స్వధర్మ
పరిత్యక్తుండును, అధర్మపరుండును, స్వేచ్ఛావిహారియునై ధర్మశాస్త్ర
విరుద్ధంబులగుశాసనంబులం గావించి వర్ణధర్మంబులనతిక్రమించి యక్ర
మప్రవర్తకుండగుచుండెను. ఆదుష్టశాసనునిపరిపాలనంబున నెవ్వరును
దేవాధ్యయనంబు చేయుటకవకాశము లేకుండెను. ఎందును వషట్కా

రాదిశబ్దంబులు వినరాకుండెను. దీక్షితులు యజ్ఞకార్యనిర్వాహకులు గాఁజాలకుండిరి. సోమపానం బనుమాటయే లేకుండెను. "నారాజ్యంబున యజ్ఞంబులును, హోమంబులు నెవ్వరును గావింపఁగూడదు" అని యాతఁడు నిరంతరమును శాసించుచుండెను. ఆతఁడు నిరంకుశుండై యయోగ్యంబులగుపన్నులను ప్రజలవలన బలవంతముగ గ్రహించుచుఁ బీడించుచుండెను. ఒకప్పుడు మరీచిప్రభృతు లగుమహర్షు లమ్మహీపాలుంగాంచి "రాజేంద్రా! మేము బహువత్సరవ్యాప్తం బగుయజ్ఞంబు గావింపఁబూనితిమి. నీవధర్మాచరణంబు గావింపకుము. అధర్మమును ద్వేషించుటే సాధువులధర్మము. నీవు ప్రజలకుఁ బ్రభుండవై పుట్టితివి. కావున నీవే వారిని బాలింపవలయును. ధర్మయుక్తముగఁ బ్రజాపాలనంబు చేయుదు నని నీవిప్పుడు మాయెద్ద ప్రతిజ్ఞ చేయవలయును" అని బోధించిరి. కాని నిర్భాగ్యం డగువేనుఁడు వారిసదుపదేశములకు లక్ష్యము చేయక వికటహాసము చేయుచు "ధర్మమును సృజించువాఁడు నాకంటెను నింకెవ్వఁడున్నాఁడు? అట్టినాకుఁగూడ నొకరు బోధించుటయా? ధర్మ మన నేమో మూఢులకెల్లఁ దెలియును! విశేషించి మీకుఁగూడ నాసంగతి తెలియుటలేదు. నేనీభూమండలమునంతను గరగతంబుగఁ జేసికొని, సకలసముద్రములను స్వస్థానచ్యుతంబులుగాఁ జేయఁగలను. భూమ్యంతరాళములను భేదింపఁగలను. ఇట్టి నాసామర్థ్యముంగూర్చి మీరెంతమాత్రమును సంశయింపవలదు." అని ప్రత్యుత్తరం బిచ్చెను. ఎంతప్రయత్నించినను మాయాముగ్ధుండగు నారాజాధముని సన్మార్గమునకుం ద్రిప్పఁజాలక తుదకమ్మహర్షులు మహాబలవంతుండగు వేనుని నిర్బంధించి యాతని యూరుదేశంబున మథనంబు గావించుటయు నందుండి ఖర్వశరీరుండును, కృష్ణవర్ణుండు నగునొకపురుషుం డుదయించి కృతాం

జలిదై ముకులమొకుట నిలువంబడియెను. అతివిహ్వాలుం డగునా తనిం గాంచి యత్రిముని "నిషీధ" అనెను. ఆహేతువుచే నతిృము స్నీంద్రుండు నిషాదవంశమునకు సృష్టికర్త యయ్యెను. ఆవేణుని పాప సంతతినుండి మత్స్యోపజీవులగుధీవరుల నత్రిమునీంద్రుండు సృజించెను. మఱియుఁ జండశాసనుం డగునవ్వేణుని పాపసమూహాము నుండి వింధ్యపర్వతప్రాంతవాసులును, అధర్మప్రవర్తకులు నగుపుళిందతుంబురజాతులును, చండాలురును జనించిరి. అనంతర మమ్మహార్షులు మరలవేణుని దక్షిణహస్తమును మథింప నారంభించిరి. అప్పుడు సుందరాకారుండును, పావక తేజుండు నగుపృథుచక్రవర్తి మహారవ యుతంబును, ఆద్యంబు నగునజగవంబను ధనుస్సుతోడను, అద్భుత శరంబులతోడను, ఆత్మరక్షాకరంబగు సుందరకవచంబుతోడను సకల జీవానందకరుండై జనించెను. అప్పు డెల్లదిక్పాలురును దమతమస్థానంబుల నధిగమించిరి. దుష్పుత్రుం డయ్యును వేణుండు స్వర్గముం గాంచెను. సత్పుత్రజననము సద్గతికారణంబుగదా! పుత్రశ్రేష్ఠుం డగు పృథుండు తండ్రిని బున్నామనరకమునుండి యుద్ధరించెను. సముద్రంబులును నదులును నాతని కభిషేకించుటకై రత్నోపహారంబులం గైకొని నలుదెసలనుండియు వెలువడి యాతనిచెంత కేతెంచెను. ప్రజాపాలనదక్షుండును, దీప్తిమంతుండును, మహాబలవంతుండును, ప్రతాపనిధియు నగువేణునందనుండు బ్రహ్మాదిదేవగణంబులచేతను, సకలమునిగణంబులచేతను, ప్రజాగణంబులచేతను రాజ్యాభిషిక్తుండై తండ్రికాలంబున నతివిరక్తులైయున్నప్రజలనందఱ ననురక్తులం గావించెను. పృథుచక్రవర్తి యట్లు ప్రజారంజకుండై యత్యద్భుతవిధానంబున రాజ్యపాలనము చేయుచుండెను. ఆతనిప్రయాణంబులయందు నదులు పాయవిడిచి మార్గము నిచ్చుచుండెను. పర్వతంబులు తమయం

తరాళంబులనుండి యాతనికిఁ బథమును విడుచుచుండెను. ఆతనిజయ కేతనంబున కెందును నిరోధంబు లేకుండెను. ఆతనిపరిపాలనంబున విత్తులు చల్లకయే సస్యోత్పత్తి యగుచుండెను. అనలసంయోగంబు లేకుండనే సంకల్పమాత్రంబున వంటకంబులు సిద్ధంబు లగుచుండెను. గోవులు కోరినన్నిపాలను బిదుకుచుండెను. ప్రతిపత్రపుటంబునను మధువు లభించుచుండెడును. ఆసార్వభౌముండు పితామహునింగూర్చి మహాయజ్ఞంబు గావించుసమయంబున సౌత్యదివసంబున సూతిగర్భంబు నుండి సూతుండు జనించెను. అప్పుడే మాగధుం డుద్భవించెను. మహర్షులాసూతమాగధులను పృథురాజేంద్రునిఁ గీర్తించుటకుని యోగించిరి. అప్పుడువారు మహర్షులారా! ఈచక్రవర్తిచరిత్రము వించుంతయు నెఱుంగనిమే మీతనినెట్లు స్తుతింపఁగలమని విన్నవించుటయు నీమహారాజుశుభలక్షణములనుబట్టి యీతనిభావిచరిత్రమును వర్ణింపుఁడని యాజ్ఞాపించిరి. వారును సంతుష్టులై బహువిధంబుల నమ్మహారాజును ప్రశంసించుటయుఁ బ్రజారంజకుం డగుపృథుండు సుప్రీతుండై సూతున కనూపదేశంబును, మాగధునకు మగధదేశంబును దానంబు చేసెను. అప్పుడు బ్రహ్మాదిదేవతలందఱును పరమానందభరితహృదయులై ప్రజావర్గముం గాంచి మీకెల్లరకు నీప్రభుండు వృత్తిప్రదానముం గావింపఁగలఁడని తెలిపిరి. అంత బ్రాహ్మణు లందఱును గలసి యమ్మహారాజును సమీపించి మహాబోఁటినీప్రజలకందఱకును జీవనాధారముం గల్పింపవలయునని యర్థించిరి. ఆమాటలు విని ప్రజాపరిపాలనతత్పరుండగు పృథుచక్రవర్తి యటనుండి చటాలున లేచి ధనుర్బాణహస్తుండై భూదేవిని వెంబడించెను. భగవతిభూదేవి యారాజేంద్రుం గాంచి భీతిల్లి గోరూపముం దాల్చిపలాయిత యయ్యెను. పృథుండు నామెను దఱిమికొనుచుఁ బోవుచుండెను. అట్లు భూదేవి

భయభ్రాంతయై సకలలోకంబులను బరిభ్రమించి యెందును రక్షణంబు గానక తుదకమ్మహారాజుశరణంబుగోరి కృతాంజలియై “ఓమహారాజా! నేను లేకున్నచోఁ నీప్రజలనందఱు నెట్లు భరింపఁ గలవు? సకలజీవులును నాయందే వసించియున్నారు. నేనే యందఱను భరింపవలయునుగదా! నాకొఱకే యెందఱోరాజన్యులు నశించి యున్నారు. మహాత్మా! నీవు శుభాకాంక్షివే యైనచో నన్ను వధింపఁబ్రయత్నింపకుము. ఉపాయ మెఱింగి యారంభించిన సర్వకార్యంబులును సిద్ధింపఁగలవు. కావున నీప్రజలనందఱను బరిపాలింపఁగలమంచియుపాయము నాలోచించి పని చేయుము. కోపము నుపసంహరింపుము. నే నెల్లవిధంబుల నీకానుకూల్యంబు గావించెదను. మఱియొకమాట వినుము. పశుపక్షిగణంబులయందుఁగూడ స్త్రీజనం బవధ్యమైనది. నేనబలనుగదా! ఓపృథ్వీపతీ! నీవు ధర్మంబును త్యజింపకుము. నన్ను రక్షించి లోకకల్యాణంబు గావించునుపాయం బాలోచింపుము” అని వేఁడుకొనుటయు ధార్మికవరుండును, బుద్ధిమంతుండు నగుపృథుచక్రవర్తి తనకోపంబును మరలించుకొని “ఓభూదేవీ! బహుజీవరక్షణంబునకై యొకజీవిని సంహరించుట పాపంబు గానేరదు. ఒక్కప్రాణికొఱకు బహుప్రాణులను వధించుట మహాపాపమగును. ఓవసుంధరా! నేను సకలప్రజారక్షణంబుకొఱకు నిన్నుఁ బీడింపఁ బ్రయత్నించితిని. నీవు నామాట విని జీవహితంబు గావింపనిచ్ఛగింతువేని నాయాజ్ఞానుసారంబుగ సకలజీవులకును జీవనోపాయంబు గల్పింపుము” అని హెచ్చరించెను.

భగవతి యగుభూదేవి యాసార్వభౌముం గాంచి “మహారాజా! నన్నుఱక హింసింపకుము. నాకనుకూలం బగువత్సంబును గల్పింపుము. దానిమూలంబున నేను నీయభిమతఫలసుగ్ధంబులఁ బిది

కిదను. ఎల్లయెడలఁ బర్వతసమూహంబులచే నావరింపఁబడి యున్న నాకు సమత్వంబుఁ గూర్పుము. అప్పుడు నేనంతటను దుగ్ధప్రదానంబు గావింతును." అని ప్రార్థించుటయు నాపృథ్వీపాలుండు తనధనుష్కోటిచేఁ బర్వతంబులను దూరంబుగఁ జిమ్మివైచి భూమిని సమతలంబుగఁ గావించెను. అంతకుఁ బూర్వ మీభూమండలమునఁ బురగ్రామవిభాగంబు గాని, సస్యోత్పత్తి గాని, కృషివాణిజ్యాదికర్మంబులు గాని లేవు. ఏదేనొకసమప్రదేశమున జీవులు నేలమీఁదనే వసించుచుండిరి. ప్రజలందఱును నప్పుడు ఫలమూలాదులుమాత్రమే యాహారములై యుండెను. అప్పుడు పృథుచక్రవర్తి స్వాయంభువమనువును వత్సంబుగాఁ జేసి భూమివలన నోషధీసంతతులం బిదికెను. మహాప్రతాపవంతుం డగునాతనిచేఁ గల్పింపఁబడిన యన్నంబులవలననే ప్రజ లిప్పటికిని బ్రతిదినమును జీవించుచున్నారు. అనంతర మాభూదేవివలన మహాత్ములందఱును సోముని వత్సంబుగను, ఛందంబులఁ బాత్రంబుగను జేసి శాశ్వతం బగుతపోదుగ్ధమును, దేవతలిందుని వత్సంబుగను, స్వర్ణమును బాత్రముగను, సూర్యుఁడు దోగ్ధగను జేసి యమృతదుగ్ధంబును, పితృదేవతలు యముఁడు వత్సంబుగను, రౌప్యము పాత్రంబుగను, కాలుఁడు దోగ్ధగను జేసి స్వధాదుగ్ధంబును, సర్పగణంబులు నాగరాజగు తక్షకుని వత్సంబుగను, అలాబువు పాత్రంబుగను, ఐరావతనాగము దోగ్ధగను జేసి విషదుగ్ధంబును, అసురులు విరోచనుని వత్సంబుగను, లోహము పాత్రంబుగను, మధుఁడు దోగ్ధగను జేసి మాయాదుగ్ధంబును, యక్షులు కుబేరుని వత్సంబుగను, ఆమపాత్రంబును జేసి యంతర్ధానదుగ్ధంబును, పిశాచరాక్షసులు సుమాలిని వత్సంబుగను, రాక్షసాధిపతిని దోగ్ధగను జేసి రక్తదుగ్ధంబును, గంధర్వాప్సరోగణంబులు గంధర్వరాజగుచిత్రరథుండు వత్సంబుగను, వసురుచి దోగ్ధగను

జేసి పద్మపాత్రంబున నభిమతదుగ్ధంబును, పర్వతంబులు హిమవంతుండు వత్సంబును, మేరువుదోగ్ధగను జేసి యోషధీరత్నదుగ్ధంబులను నీవిధముగ నెల్లజీవులును దమతమ యభీష్టానుసారంబు లగుక్షీరంబులను బిదుకుకొనిరి. సముద్రపరివేష్టిత మగునీభూతల మంతయును మధుకైటభులను రక్కసుల మేదస్సుచేఁ బరిప్లుతమైనది. పృథుచక్రవర్తి యీభూమిని సంస్కరించి తనతనయవలెఁ బరిపాలించుటం జేసి దీనికిఁ బృథ్వీనామంబు గలిగెను. ఈధరామండలమును పృథుభూపాలుఁడే దేశదేశంబులుగా విభజించెను. ఆమహారాజంతటిప్రభావసంపన్నుఁడు. అతఁడు వృత్తికాము లగురాజుల కందఱకును వందనీయుఁడు. ధనకాములగు బ్రాహ్మణవైశ్యశూద్రులకును, రాజ్యాభిలాషులగు బలవద్యోధులకును బూజనీయుఁడు. ప్రప్రథమమునందే యుద్ధము నారంభించిన పృథుసార్వభౌముఁడు వీరయోధుల కందఱకు నాదిపురుషుఁడై యున్నాఁడు. యుద్ధార్థులగుపురుషులు పృథునరేంద్రుని నామమును స్మరించుచు సంగ్రామరంగంబునఁ బ్రవేశించినచో సిగపూవైన వాడకుండ విజయులై యిల్లుచేరఁగలుగుదురు. ఆతనినామస్మరణంబు చేయుచుఁ గృష్యారంభంబు గావించువైశ్యులు సస్యసంపన్నులగుదురు. శూద్రులు రాజేంద్రునినామకీర్తనంబుచేఁ బుణ్యఫలప్రాప్తులగుదురు. ఐశ్వర్యకాములగు మానవులెల్లరును బర్వదివసంబులయందాభూపాలుని మాటిమాటికిని స్మరించుచు నమస్కరింపవలయును.

## — మన్వంతరచరిత్రము. —

మునివరులారా! మనువులలో స్వాయంభువుండు మొదటివాఁడు. అతనితరువాత స్వారోచిషాదులు పాలించిరి. ఇప్పుడు వైవస్వతమనువు పరిపాలించుచున్నాఁడు. తరువాత సావర్ణికుండను మనువు

పాలింపఁగలఁడు. ఆతనివెనుక సావర్ణినామంబున నలువురుమనువులు పాలింపఁగలరు. స్వాయంభువమన్వంతరంబున బ్రహ్మమానసపుత్రు లగు మరీచి, అత్రి, అంగిరుఁడు, పులహుఁడు, క్రతువు, పులస్త్యుఁడు, వసిష్ఠుఁడు ననునేడ్గురును మహర్షులై దేవతలు యామనామంబున విఖ్యాతులై యుందురు. స్వారోచిషమన్వంతరంబున ఆగ్నీధ్రుఁడు,అగ్నివాహుఁడు, మేధ, మేధాతిథి, వసువు, జ్యోతిష్మంతుఁడు, ద్యుతిమంతుఁడు, హవ్యుఁడు, సవనుఁడు, శుభ్రుఁడు ననుఋషులు ధర్మకర్తలై యుందురనియు, తుషితులనుదేవతలు స్వర్గపాలకులగుదు రనియు వాయుపురాణంబునఁ బ్రకీర్తితం బయ్యెను.స్వారోచిషునకు హవిఘ్నుఁడు, సుకృతి, జ్యోతి, అపోమూర్తి, అయుఁడు, స్మయుఁడు, ప్రథితుఁడు, మనస్యుఁడు, నభుఁడు, సూర్యుఁడు ననుమహాబలపరాక్రమవంతులు పుత్రులు గలరు. వైవస్వతమన్వంతరంబున వసిష్ఠసంతతి యగునేడ్గురు వసిష్ఠులును, బ్రహ్మపుత్రులైన యూర్జనాములగుకొండఱును ఋషులై ధర్మనిర్ణయంబు గావింతురు. ఆక్కాలంబున దేవతలు ఋషభనాములై యుందురు. ఆమనువునకు ఇషుఁడు, ఊర్జాతుఁడు, ఊర్జుఁడు, మధువు, మాధవుఁడు, శుచి, శుక్రవహుఁడు, నభసుఁడు, నభుఁడు ననువారు పుత్రులైరి. తామసమన్వంతరంబున గార్గ్యుఁడు, పృథుఁడు, అగ్ని, జన్యుఁడు, ధాత, కపీనకుఁడు, కపీవానుఁడు ననువారు ఋషులు. అప్పుడు దేవతలు సత్యనామంబునఁ బ్రథితు లగుదురు. ఆతనికి ద్యుతి, పోతుఁడు, సౌతపస్యుఁడు, తపుఁడు, శూలుఁడు, తాపస్యుఁడు, తపోవతి, అకల్మాషుఁడు, తన్వి, ధన్వియనువారు పదుగురుతనయులు, రైవతమన్వంతరంబున వేదవాహుఁడు, జయుఁడు, ముని, వేదశిరుఁడు, హిరణ్యరోముఁడు, పర్జన్యుఁడు, ఊర్ధ్వబాహుఁడు మొదలగువారు ఋషులై దేవతలు వైభ్యనములై యుందరు. ఆరైవతునకు ధృతి

భరద్వాజపుత్రుండగుద్రోణునితనయుఁ డశ్వత్థామ, గౌతమనందనుం డగుశరద్వంతుఁడు, కుశికాత్మజుండగుగాలవుఁడు, కశ్యపతనూజుఁ డగు ఋష్యశృంగుఁడు ననువారేడ్గురును భవిష్యత్సప్తర్షులు. మఱియు సావర్ణిమనువు నకు వీరవంతుఁడు, అవనీవంతుఁడు, సుమంత్రుఁడు, ధృతిమంతుఁడు, వసువు, వరిష్ణుఁడు, ఆర్యుఁడు, విష్ణు, రాజు, సుమతి యను పదుగురు సుతు లుదయించిరి. రోహితమన్వంతరంబునఁ బులస్త్యతనయుం డగు మేధాతిథియు, కాశ్యపగోత్రుం డగువసుండును, భార్గవుండగు జ్యోతి ష్మంతుండును, అంగిరుండగుద్యుతిమంతుండును, వసిష్ఠగోత్రజుం డగు సవనుండును, ఆత్రేయుం డగుహవ్యుండును, పులహాత్మజుండును సప్త ర్షులగుదురు. అప్పుడు దేవతాగణంబులు ముత్తెఱంగుల విరాజిల్లుచుం డును. ఆరోహితునకు ఇష్టకేతు, దీప్తకేతుఁడు, పంచహస్తుఁడు, నిరా కృతి, పృథుశ్రవుఁడు, భూరిద్యుమ్నుఁడు, రుచీకుఁడు, బృహత్తు, గయుఁడు ననువారు తనూజులగుదురు. ద్వితీయసావర్ణిమన్వంతరంబున హవిష్మంతుండును, పులహుండును, భార్గవుండగుసుకృతియు, ఆత్రే యుం డగుసత్యోముక్తియు, అవ్యయుండును, ప్రమాతియు, సౌభా రుండును, నభసుండును ఋషులగుదురు. అక్షత్వంతుఁడు, ఉత్తమౌ జుఁడు, భూరిసేనుఁడు, వీర్యవంతుఁడు, శతానీకుఁడు, నిరమిత్రుఁడు, వృషసేనుఁడు, జయద్రథుఁడు, భూరిద్యుమ్నుఁడు, సువర్చుఁడు నను వారతనిపుత్రులగుదురు. తృతీయసావర్ణిమన్వంతరంబున హవిష్మం తుఁడు, వపుష్మంతుఁడు, ఆత్రేయుఁడు, అనఘుఁడు, చారుధృష్ణుఁడు, నిష్ప్రకంపుఁడు, తేజసుఁడు ననువారుసప్తర్షు లగుదురు. అక్కాలంబున దేవగణత్రయము స్వర్గపాలనంబు చేయుచుండును. సర్వత్రగుఁడు, సుశర్మ, దేవానీకుఁడు, క్షేమకుఁడు, దృఢేషువు, పశుచుఁడు, ధూమ్రుఁడు, సునేత్రుఁడు, భోజుఁడు నను వారతనిపుత్రు లగుదురు. చతుర్థసావర్ణి

మన్వంతరంబున ద్యుతియు, సుతపుండును, తపోమూర్తియు, తపోనుండును, తపోరతియు, తపోనిధియు, తపస్వియు ననువారు సప్తర్షులగుదురు. దేవతాగణపంచకము స్వర్గంబును బాలించును. చాక్షుషమన్వంతరంబున ధృతిమంతుండును, హవ్యవంతుండును, తత్త్వదర్శియు, నిరుత్సుకుండును, నిష్ప్రపంచుండును, నిర్మోహుండును, సుతపుండును సప్తర్షులగుదురు. శైబ్యమన్వంతరంబున అగ్నీధ్రుండును, మాగధుండును, అతివాహ్యుండును, శుచియు, యుక్తుండును, శక్తుండును, అజితుండును సప్తర్షులగుదురు. ప్రభాతకాలంబున భూతభవిష్యద్వర్తమానకాలంబులయందలి యీమహాపురుషులందఱిని స్మరించువారు సుఖులగుదురు. త్రయోదశమన్వంతరంబున దేవతాగణపంచకము స్వర్గంబున విరాజిల్లుచుండును. తరంగభీరువు, బుధ్నుఁడు, తనూగ్రుఁడు, అనుగ్రుఁడు, అతిమాని ప్రవీణుఁడు, విష్ణుఁడు, సంక్రందనుఁడు, తేజస్వి, శంబరుఁడు ననువారు పదుమూఁడవమనువునకుఁ దనయులు. భౌత్యమన్వంతరంబుతోఁ బూర్వకల్పంబు పరిపూర్ణం బగును. ఇట్లు భూతభవిష్యద్వర్తమానమన్వంతరంబులవృత్తాంతమునుగూర్చి యమితతేజుండగుసనత్కుమారుండు వ్యాసునకు బోధించెను. స్వధర్మంబుచేఁ బ్రజారక్షణంబు గావించుచు సహస్రయుగంబులకు మునిగణంబు లెల్లరును బ్రహ్మసహితంబుగ బ్రహ్మలోకంబుఁ జేరుదురు. డెబ్బదియొక్కయుగంబులకాలము మన్వంతరంబు గాఁగలదు. మన్వంతరాంతంబున జగంబంతయును విలయంబు నంది క్రమ్మఱ సృష్టి యగుచుండును. శతసహస్రకల్పంబులకుఁ గల్పశేషం బగును. అప్పుడు విశ్వం బంతయు రవికిరణంబులచే విదగ్ధంబై పోవును. కల్పాంతంబున సకలదేవతలును బ్రహ్మయునుగూడ నారాయణునందు విలీను లగుదురు. మహాకాలుండగురుద్రదేవుఁడు జగత్సంహారంబు గావించును.

## —♦ యమాదులజననము ♦—

మునివరులారా! భగవానుం డగుకశ్యపునకు దాక్షాయణి గర్భంబున వివస్వంతుండు పుట్టి త్వష్ట్రప్రజాపతి తనయయగు సంజ్ఞను బెండ్లియాడి వైవస్వతుఁడు, శ్రాద్ధదేవుఁడు ననుపుత్రులను, యమున యను తనయను గాంచెను. శ్రాద్ధదేవుం డగుయముండును, యమునయుఁ గవలు. పరమరూపవతియు, యువతియు నగుసంజ్ఞాదేవి సూర్యదేవుని తేజస్తాపమును సహింపఁజాలక యుద్విగ్నయై తనదేహమునుండి ఛాయ యనుసుందరీమణిని సృజించి "ఓరమణీ! నీకు శుభం బగుఁ గాక! నేనిప్పుడు నాపుట్టినింటికిఁ బోయెదను. నాకుఁ బ్రియంబు చేయఁగోరుదువేని నీవు నిశ్చలచిత్తంబున నాయింట నుండి యీనాపుత్రద్వయమును, బుత్రికను భద్రముగాఁ బెంచుచుండుము" అని యాదేశించుటయు ఛాయాదేవి సమ్మతించి "అమ్మా! నా కేశగ్రహణపర్యంతమును గష్టమును సహించి నేనిందుండఁగలను. నీవు సుఖంబుగఁ బుట్టినింటికిఁ బొమ్ము!" అని చెప్పెను. సంజ్ఞాదేవి తనకావించినపనికి సిగ్గుపడుచుఁ బితృగృహంబునకుం బోయెను. తండ్రియు నామె నిందించి మరల నత్తింటికిఁబొమ్మని ప్రతిదినమును గోపపడుచుండెను. అదియును సహింపఁజాలక యద్దేవి తనరూపమును గోపనంబు చేసికొని బడబాకృతిం దాల్చి పోయి యుత్తరకురుదేశంబులయందు సంచరించుచుండెను. ఇటసూర్యదేవుండును దనకడనున్నఛాయయే నిజపత్నియగుసంజ్ఞాదేవి యని భావించి యామెయం దొకపుత్రునిం గనియెను. ఆతఁడు సావర్ణినామంబున మనువై ప్రఖ్యాతుండయ్యెను. సంజ్ఞామూర్తిం దాల్చియున్న ఛాయ కనిష్ఠపుత్రుండగుసావర్ణి నధికముగఁ బ్రేమించుచుఁ దన్ను వేరసు చేయుచుండుటం గాంచి జ్యేష్ఠుం డగుయముండు బాల్యచాపలంబువలనను, భవితవ్యత దుర్నివారం బగుటవలనను

క్రుద్ధుండై ఛాయాదేవిని గాలితోఁ దన్నెను. ఆపాదాఘాతముచే నలి గినకోపావేశంబున హతజ్ఞానయై స్వధర్మంబు నుడివి ఛాయాదేవి యిటు వచనంబులతో "తల్లినగునన్నవమానించితివి గావున నీచరణంబు భగ్నం బగుఁగాక" యని యముని శపించెను. కుమారుండగు యముండామాట నాలించి శాపభీతుండై [illegible] తండ్రిచెం తకుం బోయి కృతాంజలియై "జనకా! పుత్రులనందఱను సమదృ ష్టితోఁ బాలించుట మాతృధర్మముగదా! అట్టియెడ మాతల్లి తన కనిష్ఠపుత్రుని బాగుగ నలంకరించి నన్ను నిరసించుచుఁ గోపించి నేనామెను దన్నితిని. ఈనాయపరాధమును మన్నింపవలయును. ఓదే వదేవా! మాతల్లి నాపాదము పతితంబగునట్లు శపించినది. నీయను గ్రహముచే నాకట్టియపాయము గలుగకుండుఁగాక!" అని ప్రార్థించు టయు నాదిత్యభగవానుండు "కుమారా! భవితవ్యము తప్పదు. కాక యున్నచో ధర్మజ్ఞుండవు, సత్యవ్రతుండవునగు నీకుఁ [illegible] మేల కలుగవలయును? నాయనా! నీతల్లిమాట నసత్యముగాఁ జేయుటకు నేనును సమర్థుఁడను గాఁజాలను. క్రిములు నీచరణమాంసము నుపహ రించి భూతలంబునకుఁ గొనిపోఁగలవు. అందువలన నీమాతృవచనము సత్యము గాఁగలదు" అని యూఱడించి వివస్వంతుండు క్రోధావి ష్టుండై ఛాయాదేవిం గాంచి "ఓసీ! నీకు [illegible]దఱును దల్లికి సమానులే కదా! ఇట్టిచో నీవు కనిష్ఠునియెడ [illegible]యుండు టకుఁ గారణమేమి? సత్యము వచింపుము!" అని [illegible] పలుకుటయు నద్దేవి నిగూఢం బగుసమస్తవృత్తాంతమును విస్పష్టముగ నాతనికి నివే దించెను. ఆమాటలాలించి సూర్యదేవుండు కోపముచే మండిపడుచు విశ్వకర్మయింటికిం బోవుటయు, త్వష్ట్రి యాతని సమయోచితంబుగఁ బూజించి తన్ను దహింపఁబూనియున్న యామార్తాండుని [illegible] శాం

తింపఁ జేసి "మహాత్మా! అతితీక్ష్ణంబు లగు నీకిరణముల తాపమును మా సంజ్ఞ సహింపఁజాలకపోయినది. ఇంతటి తీవ్రరూపముం దాల్చి యుండుట నీకుచితము గాదు. ఓగ్రహపతీ! ఇక్కారణంబుననే నా తనయ యాత్మయోగబలంబుచే బడబాకృతిం దాల్చి యుత్తమంబులును, నవతృణమయంబులు నగు వనంబులయందుఁ దిరుగుచుఁ బ్రాణములను నిలుపుకొని యున్నది. నీకు నాయం దనుగ్రహము గలదేని నాకును, సకలలోకంబులకును సహ్యంబును, గమనీయంబు నగునట్లు నీ రూపమును జక్కఁబఱచెదను. అందుకొఱకు నీవనుగ్రహింపవలయును" అని ప్రార్థించుటయు మార్తాండుండు విగతక్రోధుండై యట్లే చేయుమని యంగీకరించెను. మహాత్ముండగు త్వష్టయు, నద్దేవుని శాణయంత్రంబున నిలిపి యాతని కిరణతాపమునకు న్యూనత్వముం గల్పించెను. అందుచేఁ దీవ్రతేజంబునకు హ్రాసత్వంబు గలిగి ప్రభాకరునకు మనోహరాకారంబు సంఘటిల్లెను. తరువాత నాలోకసాక్షి తన యోగదృష్టిచే సంజ్ఞాదేవి యున్నతా వెఱింగి యశ్వరూపంబున నటకుం బోయి యశ్వినీరూపిణియగు నామెను వెంబడించుటయు స్వాహాదేవి పరపురుషశంకచే నాతనిఁ దప్పించుకొని పాఱిపోవఁదొడంగెను. సూర్యుండు నామెను విడువక యద్దేవి ముఖవివరంబునను, నాసారంధ్రంబులను శుక్రక్షేపంబు గావించెను. అందువలన దేవవైద్యులగు నశ్వినీకుమారు లిరువు రుదయించిరి. వారికి నాసత్యులని కూడ నామాంతరము గలదు. అప్పుడు సంజ్ఞాదేవి మనోహరాకారులగు కుమారులను గాంచి పరమానందభరితాంతఃకరణయై యయ్యశ్వమూర్తి తననాథుం డగు నా సూర్యమూర్తియే యని తెలిసికొని యాతనిపాదంబులపై వ్రాలి క్షమాప్రార్థనముం గావించుట సూర్యదేవుం డామె ననుగ్రహించెను.

సంజ్ఞాత్మజగు యముండు తల్లియెడలం గావించిన యపలారంబు

నకుఁ బశ్చాత్తప్తుండై ధర్మానుసారంబుగ జగత్పాలనంబు చేయుచు దీప్తిమంతుండై నిజకర్మబలంబునఁ బితృగణాధిపత్యంబును, లోకపాలకత్వంబును గాంచఁగలిగెను. తపఃపరాయణుం డగుసావర్ణి ప్రజాపతి యయ్యెను. కాలాంతరంబున నాతఁడు మనువు కాఁగలఁడు. ఆతఁడు సువర్ణమంబగు మేరుశైలంబునఁ దపంబు చేయుచుండెను. అతని సహోదరుండగుశనియు గ్రహశ్రేష్ఠత్వముం గాంచెను. విశ్వకర్మ సూర్యకిరణరజంబువలన విష్ణుచక్రమును నిర్మించెను. అదివ్యాయుధము దానవవినాశకరంబై రణరంగమున నప్రతిహతశక్తిమంతంబై విఖ్యాతిం గాంచెను. సూర్యపుత్రికయగుయమున త్రిభువనపవిత్రకారిణి యగు నదీమతల్లియై పొగడొందెను. ఈచరిత్రమును వినువారును, భావంబున నిల్పుకొనువారును విపద్విముక్తులై కీర్తిమంతు లగుదురు.

—౦ వంశకథనము. ౦—

వైవస్వతమనువునకు ఇక్ష్వాకుఁడు, శిబి, నాభాగుఁడు, ధృష్టుఁడు, శర్యాతి, నరిష్యంతుఁడు, రిష్ఠుఁడు, కరూశుఁడు, ప్రియవ్రతుఁడు నను తొమ్మండ్రుపుత్రు లుదయించి జనకసమానులై ప్రఖ్యాతిం గాంచిరి. ఆపుత్రులు జనింపకమున్ను వైవస్వతుండు పుత్రార్థియై పుత్రేష్టిం గావించుటయు యజ్ఞవేదినుండి, దివ్యవస్త్రాలంకారవిభూషిత యు, దివ్యసుందరవిగ్రహయు నగు ఇలయను కన్యక యుదయించెను. ఆమెంగాంచి వైవస్వతుండు "ఇలా! నావెంటరమ్ము!" అనియెను. పుత్రాభిలాషి యగునాతనివచనంబు లాలించి యిలారమణి ధర్మబద్ధంబులగువచనంబులతో "ఓవాగ్విశారదా! నేను మిత్రావరుణులను దేవతలయంశంబున జనించితిని. కావున నేను వారికడకుం బోయి వారి యనుజ్ఞం గైకొని వచ్చెదను. అప్పుడు నాధర్మంబున కట్టికళం

కంబును గలుగదు.'' అని చెప్పి యాక్షణమునందే యాసుందరి మి
త్రావరుణులసన్నిధికిం బోయి కృతాంజలియై ''ఓదేవతలారా! నేను
మీయంశంబులం గాంచి పుట్టితిని. నేనేమి చేయవలయునో మీరా
జ్ఞాపింపవలయును'' అని కోరెను. ఆమె పలుకులకు మిత్రావరుణులు
సంతసించి ''ఓకుమారీ! నీవు ధర్మజ్ఞురాలవు. నీవినయంబునకును,
దమంబునకును, సత్యంబునకును నేమత్యంతమును బ్రీతుల మైతిమి.
మహాభాగ్యవతీ! నీవు మాయిరువురిచరిత్రమునకును విఖ్యాతిం గూ
ర్పఁగలవు. నీవు వైవస్వతునకుఁ బుత్రుండవై సుద్యుమ్ననామంబునఁ
ద్రిభువనంబులయందును బ్రసిద్ధుండవగుదువు. మఱియు సకలలోక
ప్రియుండవును, ధర్మశీలుండవును, మనువంశకర్తవు నయ్యెదవు.'' అని
యభినందించుటయు నారమణీరత్నము వారికడ సెలవుగైకొని మరలఁ
దండ్రియగువైవస్వతుని చెంతకుఁ బోవుచుండెను. ఆసమయంబునఁ
జంద్రాత్మజుం డగుబుధుం డామెనుగాంచి మోహించి సంసర్గంబుగా
వించుటయు నద్దేవి గర్భంబునఁ బురూరవుండనుతనయుండు ప్రభవించె
ను. ఆపురూరవుండు పుట్టినంతనే యత్యాశ్చర్యముగా నయ్యిలాకన్య
సుద్యుమ్నుం డయ్యెను. ఆసుద్యుమ్నునకు ఉత్కళుఁడు, గయుఁడు,
వినతాశ్వుఁడు ననుధర్మశీలురు ముగ్గురు తనయులు గలిగిరి. అందుత్క
ళుండు ఉత్కళనామకం బగుదక్షిణదిగ్భాగమును, వినతాశ్వుండు పశ్చి
మదిగ్భాగమును, గయుండు పూర్వదిగ్భాగమును బరిపాలించిరి.

సూర్యభగవానుని యాజ్ఞానుసారముగా వైవస్వతుండీభూమండ
లంబును దశభాగంబులుగఁ జేసి పదుగురుపుత్రులకు నొసంగెను.
అందిక్ష్వాకుండు మధ్యదేశము గైకొని వసిష్ఠానుమతంబునఁ బ్రతిష్ఠా
ననగరంబునందుండి ధర్మపాలనంబు గావించెను. స్త్రీపురుషచిహ్న
ధారి యగుసుద్యుమ్నుండును రాజ్యభాగంబు గైకొని దానిని బురిత్రా

రవున కొసంగెను. నరిష్యంతునకు బహుపుత్రు లుదయించి శకనామంబునఁ బ్రసిద్ధు లైరి. నాభాగున కంబరీషుండు జనించి బాహ్లికదేశంబును బాలించెను. శర్యాతికి ఆనర్తుం డనుతనయుండును, సుకన్య యనుతనయయుఁ గలిగిరి. ఆసుకన్య చ్యవనునకుఁ బత్నియై ప్రఖ్యాతి నందెను. ఆనర్తునకు మహాతేజస్వి యగు రేవుండను వాఁ డుదయించి కుశస్థలి యనురాజధానియం దుండి యానర్తదేశమును బరిపాలించెను. ఆరేవునకు రైవతుండను సుతుండు గలిగెను. అతఁడొకప్పుడు కుమారీసహితుఁడై బ్రహ్మలోకంబునకుం బోయి యటగంధర్వగానశ్రవణంబున ముగ్ధుండై యట్లే యుండుటయు ముహూర్తమాత్రంబున భూలోకమునందు బహుశతయుగంబులు గడచిపోయెను. అయినను నాతఁడు బ్రహ్మలోకంబునందుండుటచే వృద్ధుండుగాక యెప్పటివలెఁ దరుణుండై పుత్రికాసహితంబుగ మరల భూమండలంబునకు వచ్చి చూచునప్పటికి తనరాజ్యమంతయు యాదవులచే నాక్రమింపఁబడి యుండెను. బహుద్వారశోభితంబును మనోహరంబును వాసుదేవనివాసంబును, యదువృష్ణిభోజాంధకయోధపరిరక్షితంబును నగుద్వారకానగర మారాజ్యమునకు రాజధానియై యుండెను. అప్పుడు రేవతుఁడు తనకాలము నాటి విషయంబుల దేనిని గనఁజాక బహుయుగాంతరములు గడచిపోయినట్లు గ్రహించి తనతనూజయగు రేవతిని శ్రీకృష్ణాగ్రజుండగు బలరామున కొసంగి సుమేరుశృంగంబునకుం బోయి తపంబు చేసికొనుచుండెను. ఆరేవతుండు బ్రహ్మలోకంబునం దున్నప్పు డాతనికి క్షుత్పిపాసలును, మృత్యుభయంబును లేకయుండెను. మరల భూలోకంబునకు వచ్చునప్పటికాతని రాజధాని యగుకుశస్థలి క్రూరరాక్షసులచే విధ్వస్తంబు గావింపఁబడియెను:—ఆరేవతునకు నూర్గురుతనయులు గలరు వారివంశము దశదిశలను వ్యాపించెను. ధృష్టునిపుత్రులు ధార్ష్టులను

బ్రాహ్మణగణంబులతోఁ జేరిపోయిరి. కరూశునిపుత్రులు కారూశనామంబున విఖ్యాతులైరి. అందు కారూశునిపుత్రుఁడు పృషధ్రుం డను వాఁడు గురుగోహింసం గావించి గురుశాపంబుచే శూద్రుండైపోయెను. ఇది వైవస్వతమనువంశవృత్తాంతము—

వైవస్వతుని జ్యేష్ఠపుత్రుండగు నిక్ష్వాకుండు భూరిదక్షిణలతో బహుయజ్ఞంబులం గావించి జగన్నుతుం డయ్యెను. ఆతనినూర్గురుతనయులయందును వికుక్షి యనువాఁ డయోధ్యారాజ్యమునకుఁ బ్రభుం డయ్యెను. ఆవికుక్షికి శకునిప్రభృతులు పంచదశపుత్రు లుదయించి క్షత్రవంశోద్ధారకులై యుత్తరాపథమును బాలించిరి. ఆవికుక్షి శ్రాద్ధార్థమై శశమాంసమును దెచ్చి శ్రాద్ధంబు ముగియకుండఁగనే యమ్మాంసమును భక్షించుటం జేసి శశాదనామంబున వ్యవహరింపఁబడియెను. అతనిజనకుం డగునిక్ష్వాకుండు వసిష్ఠాజ్ఞచే నాతని రాజ్యభ్రష్టునిం గావించి యరణ్యంబున కనిచి తానే యయోధ్యారాజ్యమును బాలించెను. అయోధ్యేశ్వరునకు కకుత్స్థుం డనుతనయుండు గలిగి కీర్తిమంతుం డయ్యెను. ఆకకుత్స్థున కరినాభుండును, ఆతనికి పృథుండును, ఆతనికి విష్టరాశ్వుండును, అతని కింద్రుండును, అతనికి యువనాశ్వుండును, అతనికి శ్రావుండును, అతనికి శ్రావస్తుండును, జనించిరి. ఆశ్రావస్తుండు శ్రావస్తినగరంబును నిర్మించెను. అతనికి మహాయశస్వి యగుబృహదశ్వుండును, అతనికి ధార్మికాగ్రణి యగుకువలాశ్వుండును, జనించిరి. కువలాశ్వుండు జగత్కంటకుం డగు దుందుం డనుదానవుని సంహరించి దుందుమారనామంబునఁ గీర్తితుండయ్యెను. అతనికి ధానుష్కాగ్రేసరులు నూర్గురుతనయు లుదయించిరి. కువలాశ్వుండు తనతనూజుల కందఱకును రాజ్యంబును విభజించి యిచ్చి తప

శ్చరణంబునకై వనంబునకుం బోవుచుండ మహాస్వయంభువబున బ్రహ్మ శ్రేష్ఠుం డగుపుత్రుఁడుం డనువాఁ డాతని వారించి "ఓ రిపుంజయా! ఈభూమండలమును నీవే పరిపాలింపవలయును. నీచే ప్రజ్ఞ నీజగంబు నిరుపద్రవంబు గాఁగలదు. కావున నీవు వనంబునకుం బోవలదు. నాయాశ్రమసమీపంబున సమతలంబగుమరుభూమియందు బలగర్వితుండును, భయంకరుండును, బ్రహ్మరాక్షసుఁడు నగువాఁ డుండును దానవుండు లోకభీకరంబగు తపంబు చేసి మహోన్నతసయుం డగునాతఁడు తపోబలంబుచే దేవాదికపష్యంత్రై సముద్రపాలాకా మధ్యంబున డాఁగియుండి సకలలోకవినాశంబు గావించుచుఁ దుగ్రశోభముతో నున్నాఁడు. అతఁ డొక్కవత్సరంబున కొక్కనిశ్వాసంబు విడుచును. ఆసమయమున పురవనపర్వతసహితంబుగా భూమండలము కంపించి పోవును. ఆనిశ్వాసప్రభంజనముచే నగ్నిస్ఫులింగములతో గూడి వెలువడి యాదిత్యపథంబునందును గగనభూమ్యంతరాళమున వ్యాపించి సప్తాహపర్యంతము లోకోపద్రవంబు గావించుచుండును. ఓ నరనాథా! ఆరాక్షసభయంబుచే మాయాశ్రమవాసులెల్లరును నిర్వేదంబు లనుభవించుచున్నారు. లోకహితంబుకొఱకు నీవారక్కసుని సంహరింపవలయును. నీవిమ్మహోపకారంబు గావించినచో నీజగంబంతయును స్వస్థము గాఁగలదు. ఇట్టిఘనకార్యంబు నిర్వహించుటకు నీవే సమర్థుఁడవు. ఓ యనఘా! నీయందుఁ దనతేజమును వ్యాప్తిఁ జేయునట్లు పూర్వయుగంబున విష్ణుదేవుండు నాకు వరం బిచ్చియున్నాఁడు. కావున లోకపాలనంబు ప్రజాపరిపాలనంబువలననే మహత్తరంబగుపుణ్యప్రాప్తి యగుచుండ నరణ్యవాసంబువలన నేమిప్రయోజనము? నీకు వనవాసఫలంబు కలుగకుండుఁగాక! రాజన్యులకుఁ బ్రజాపాలనంబుతోఁ దుల్యంబగు ధర్మం బొకటియును లేదు. పూర్వరాజన్యులు ప్రజాపరిపాలనంబువలన

నుపార్జించినంతటిపుణ్యమును మఱియేఘనకార్యమువలనను గడింపలేడు.” అని బోధించుటయు రాజర్షియగుకువలాశ్వుండు పుత్రసహితుండై దుందుదానవసంహారార్థమై యుతంకుని వెంట సముద్రతీరంబునకుం బోయెను. ఆసమయంబున భగవానుండగువిష్ణుదేవుని దివ్యతేజము కువలాశ్వునందుఁ బ్రవేశించెను. అప్పుడు గంభీరధ్వానముతో “ఈ రాజేశ్వరుండు దుందుమారుండు కాఁగలఁడు” అని దివ్యవాణి పచించెను.

అంత దుర్జయుండగు నమ్మహీనాథుండు పుత్రగణయుతుండై జలధితీరవాలుకాప్రదేశంబు చేరి యావాలుకాసముద్రమును ద్రవ్వుటకై కుమారుల కాజ్ఞయొసంగెను. తోడనే వారట్లు గావించుటయు పశ్చిమభాగంబున వాలుకామధ్యవర్తి యగుదానవుండు బయల్పడియెను. అతనిముఖంబునుండి జగంబంతయును దాహింపఁజేయఁజాలు నగ్నిజ్వాలలువెలువడియెను. మఱియు నాతనిదేహమునుండి లోకంబులముంచివేయునంతటిజలప్రవాహము బయలుదేరెను. ఆయగ్నిజ్వాలలయందుఁ బడి కువలాశ్వుని పుత్రులలోఁ దొంబదిమువ్వురు దగ్ధులై పోయిరి. అంతఁ గువలాశ్వుండు క్రోధోజ్జ్వలుండై యారక్కసుని సమీపించి యోగాస్త్రముచే నాతఁడు గావించినజలవాహిని శుష్కింపఁజేసి, వారుణాస్త్రముచే నాతనివదనానలమును జల్లార్చి కౌబేరదివ్యాస్త్రంబుచే జలమధ్యస్థుండగునాలోకకంటకుని నిహతుం గావించి యుతంకునకు సంతృప్తిం గలిగించెను. అమ్మహాకార్యంబు సాధించిన మహాతేజస్వియగు కువలాశ్వునియెడల నుతంకుండు ప్రసన్నుండై యాతనికక్షయధనంబును, నిత్యవిజయంబును, నిరంతరధర్మబుద్ధియు, నక్షయస్వర్గసుఖంబును దుందునిముఖానలకీలలచే దగ్ధులైన యాతనితనయులకు స్వర్గవాసంబును గలుగునట్లు వరంబులొసంగెను.

అకుకువలాశ్వునకు దృఢాశ్వుఁడు, హంసాశ్వుఁడు, కపిలాశ్వుఁడు
ననుముగ్వురుతనయులుమాత్రమునిగిలియుండిరి. అందు దృఢాశ్వుం
డును, అతనికి నిత్యధర్మపరుం డగునికుంభుండును, అతనికి సంహతా
శ్వుండును, అతని కృశాశ్వుండును జనించిరి. మఱియు సంహతాశ్వునకు
హైమవతి యను నొకతనయ జనించెను. ఆమె తనయుండగుప్రసేన
జిత్తు గౌరియనుకన్యను బరిణయం బయ్యెను. ఆగౌరి పతిశాపంబుచే
బాహుదానది యయ్యెను. ఆమెకుఁ దీర్ఘావనత్యపుండగుయువనా
శ్వుండు జనించెను. అతనికిమాంధాతృపుత్రి శశబిందుతనయయగుచైత్ర
రథిని బెండ్లియాడి యామెవలన పురుకుత్సుండు, ముచికుందుండునను
నిరువురుసుతులం గాంచెను. పురుకుత్సునకు త్రసదస్యుండును, అత
నికి త్రిధన్వుండును, అతనికి త్రయ్యారుణియు, అతనికి పరాక్రమ
వంతుం డగుసత్యవ్రతుండును జనించిరి. ఆసత్యవ్రతుండు పాణిగ్రహ
ణమంత్రంబులకు విఘ్నం బాపాదించి కామపరవశుండై వివాహితవ
ధువును బలవంతముగహరించెను. మఱియు జనకుండగుత్రయ్యారుణి యధర్మ
పరాయణుండగు తనయునిపైఁ గోపించి యిల్లువెడలఁగొట్టించెను. అట్లు
పితృత్యక్తుండైన సత్యవ్రతుండు దిక్కులేక చండాలవాటికం జేరి జీవిం
చుచుండెను. అయ్యధర్మంబునకు దేవేంద్రుండు కోపించి యాదే
శంబున ద్వాదశవర్షంబు లనావృష్టి గావించెను. ఆకాలమునను
మహాతపస్వి యగువిశ్వామిత్రుండు తనభార్యను త్యజించి సముద్రతీ
రంబు చేరియత్యుత్కటం బగుతపంబు చేయుచుండెను. అమ్మ
హర్షి భార్య యాదుర్భిక్షసమయంబునఁ బుత్రులను బోషింపఁజాలక
మధ్యమపుత్రుని మెడకుఁ దాడుగట్టి శతసువర్ణంబులకు విక్రయించి
యాధనమువలనఁ దక్కినపుత్రులను బోషింపవలయు నని ప్రయ
త్నించెను. సత్యవ్రతుం డాఋషిపత్ని యభిప్రాయంబును వారించి

విశ్వామిత్రునిప్రియంబుకొఱకును, ఆతనిప్రసాదంబుకొఱకును అమ్ముని కుమారుని బంధముక్తుం గావించి ప్రతిపాలించెను. తల్లిచే గళప్రదేశ మున బంధితుండైన కారణముచే నవ్విశ్వామిత్రనందనునకు గాలవుం డను నామంబు గలిగెను.

అది మొదలుగా సత్యవ్రతుండు విశ్వామిత్రునియెడలం గల భక్తి వలన నాతనిపత్నీపుత్రులను గృపాపరుండై పోషించుచుండెను. ఆతఁడు నిత్యమును వనంబునం గల వరాహమహిషమృగసమూహంబు లను వధించి యామాంసమును విశ్వామిత్రాశ్రమంబున నిక్షేపించు చుండెను. అయ్యాహారంబువలన మునిపత్నియును, బుత్రులును సు ఖంబుగ జీవించుచుండిరి. చిన్నతనంబునుండియు దుర్గుణంబులతోడ నే వర్తిల్లుచున్న సత్యవ్రతునియెడల కులగురుం డగువసిష్ఠుం డెప్పుడును విరక్తుండై యుండెను. కావుననే తండ్రి యాతనిఁ ద్యజించినప్పు డేమి యును జెప్పకయూరకుండెను. ఎప్పటికైన బుద్ధివచ్చునేమో యను నుద్దేశముచేతనే గాని వసిష్ఠుని కాతనియందెట్టిమాత్సర్యంబును లేదు. అనంతరము కొంతకాలంబునకు మహారాజగుత్రయ్యారుణి దివంగతుఁ డయ్యెను. సత్యవ్రతుండు పండ్రెండువత్సరములు వనచారియై యున్న వాఁడుగావున నొకప్పు డాతఁడు మహాత్ముఁడగువసిష్ఠునాశ్రమంబునఁ బ్రవేశించి సర్వకామదం బగునమ్మునిధేనువును వధించి యమ్మాంస మునఁ గొంత దాను భుజించి తక్కినవానితో విశ్వామిత్రనందనులకు విందు చేసెను. ఆదుష్కృత్యము నాలకించి వసిష్ఠుండు క్రోధోద్రిక్తుం డై “ఓదురాత్మా! నీవతిక్రూరంబులగుశంకువులంబోలిన మూఁడు మహాదోషంబులం గావించితివి. ధర్మాత్ముం డగుతండ్రికి సంతుష్టిం గల్పించుట యొకయనాచారము. నీకులగురుండనగు నాగోవును వధించుట రెండవఅపరాధము. అప్రోక్షితం బగుపదార్థమును భుజించుట మూ

డవవోషము. కావున నీవు త్రిశంకుండ వైతివి" అనియెను. అప్పటి నుండియు సత్యవ్రతునకుఁ ద్రిశంకునామంబు గలిగెను. తరువాత విశ్వామిత్రుండు తపస్సిద్ధుండై స్వీయాశ్రమంబునకువచ్చి తనపత్నీపుత్రులు సత్యవ్రతునియాదరంబునఁ బరిపాలితులైనవృత్తాంతము నాలకించి యాతనియెడలఁ బ్రీతుండై యాతనికి వరప్రదానంబుగావింపను ద్యుక్తుం డయ్యెను. తపోనిధి యగువిశ్వామిత్రుండు సత్యవ్రతుని పితృసింహాసనము నధిరోహింపఁ జేసి రాజ్యాభిషేకంబు గావించి యాతనిచే మహాయజ్ఞంబు చేయించి దేవతలాతనియెడ నప్రసన్నులైయున్నను, వసిష్ఠుండు విరక్తుండై యున్నను లక్ష్యము చేయక త్రిశంకునాముం డగుసత్యవ్రతుని సశరీరస్వర్గారోహకునిం గావించెను. కేకయరాజతనయయగు సత్యరథ యనుపత్నియందు సత్యవ్రతుండు హరిశ్చంద్రుం డనుపుత్రునిం బడసెను. ఆహరిశ్చంద్రుండు బహుయజ్ఞంబులు భూరిదక్షిణలతో నిర్వహించి సార్వభౌముండయ్యెను. ఆతనికి రోహితుండును, ఆతనికి వృకుండును, ఆతనికి బాహుండును జనించిరి. హైహయుడు, తాళజంఘులు ననుశకసులా బాహుని రాజ్యపదచ్యుతునిం గావించి దూరముగఁ దఱిమివైచిరి. బాహుండు సమర్థుం డయ్యును హింస యధర్మం బని తలంచి యద్దానవులను సంహరింపక ఔర్వమునియాశ్రమంబునకుం బోయి యాతనిచే రక్షితుండై యుండెను. ఆతనికి విషవశంబున సగరుండను తనయుండు గలిగెను. సగరుండు ఔర్వమునిప్రసాదంబున నాగ్నేయమంత్రసిద్ధిం గాంచి స్వరాజ్యంబునకుం జేరి హైహయతాళజంఘులను ప్రతాడితులం గావించి శక, బహుదక, పారద, ఖశాదిమ్లేచ్ఛజనంబులఁ బరాజితులం గావించెను.

ఇట్లు సూతుండు చెప్పుటయు మహర్షులు సగరుండు విషసహితుండై పుట్టుటకుఁ గారణంబేమని ప్రశ్నించిరి. సూతుండిట్లు చెప్పం

దొడంగెను. అట్లు బాహుం డపహృతరాజ్యుండై వనవాసంబు చేయు చుం గొన్నాళ్లకు మరణించెను. అప్పటి కాతనిపత్నియాదవి గర్భిణియై యుండియు నాతనితో సహగమనంబు గావించుట కుద్యుక్త యయ్యెను. అంతకుం బూర్వమే యీర్ష్యావశంబున సవతి యామెకు విషప్రయోగముం గావించెను. అయ్యాదవి భర్తకొఱకు చితిని జేర్చి యగ్నిని బ్రజ్వలింపం జేసి తానుగూడ నందుం బ్రవేశించుటకు సిద్ధమై యుండ నింతలో భృగుకులతిలకుం డగు ఔర్వుండు వచ్చి యామెను వారించి తనయాశ్రమంబునకుం గొనిపోయెను. అయ్యాశ్రమమందే యామెగర్భము విషసహితంబుగ వినిస్సృతం బయ్యెను. అందుండి సగరుం డుదయించెను. మహాత్ముం డగు ఔర్వుండే యారాజకుమారునకు జాతకర్మాదిక్రియలను సంపన్నంబులుగాం జేసెను. క్రమముగా నమ్మునివరుం డక్కుమారునిచే వేదశాస్త్రాధ్యయనంబు సేయించి యాగ్నేయాస్త్రం బాతనికిం బ్రసాదించెను. అయ్యస్త్రప్రభావము చేతను, నిజబాహుబలంబుచేతను సగరకుమారుండు రణక్షేత్రంబున హైహయాదులను నిర్జించి పితృరాజ్యమును మరలం గైకొని త్రిభువనాసాధారణం బగుకీర్తిచేం బ్రకాశించెను. తరువాత నాతండు శకయవనకాంభోజపహ్లవగణంబులం బ్రతాడితులం గావించుచుండుటయు వారందఱును బోయి వసిష్ఠమునీంద్రునిశరణంబు వేడుకొనిరి. వసిష్ఠుండును వారికభయం బొసంగి సగరుని శాంతింపం జేసెను. గురువాక్యపరిపాలకుం డగుసగరుండు వారిని వధింపక వారినందఱను ధర్మచ్యుతులుగను దేశాంతరగతులుగను, కేశపరివర్తితులుగను గావించెను. మహాత్ముం డగుసగరుండు శకులను మస్తకార్ధముండితులం గావించి సముద్రతీరంబునకుం దఱిమివైచెను. యవనకాంభోజులను సర్వమస్తకముండితులం గావించెను. పారదులు శ్మశ్రుధారులగునట్లు చేసెను. వీరిక దఱిక్కిని

వేదాధ్యయనాధికారము లేకుండునట్లు శాసించెను. ఈవిధముగ సగరచక్రవర్తి యా సకలక్షత్రియులను ధర్మహీనులం గావించెను. విజయశీలుం డగు సగరచక్రవర్తి ధర్మానుసారంబుగ మహారాజ్యపాలనంబు సేయుచు నశ్వమేధయాగదీక్షితుండై యొకప్పుడు యజ్ఞాశ్వమును దిగ్విజయార్థమై పూర్వదక్షిణసముద్రతీరంబున విడిచెను. యజ్ఞాశ్వం బగు నింద్రుండా తురంగము నపహరించి పాతాళంబున దాంచెను. సగరుండా సంగతి నెఱింగి పాతాళమువఱకును ఖననంబు గావించుటకై నిజతనూజుల నియోగించెను. వారందఱును గలసి భూతలంబు నంతకును త్రవ్వుకొనుచుం బోయి యచ్చట నాదిపురుషుండును, విష్ణ్వంశసంభూతుండును, మునీంద్రుండు నగు కపిలభగవానుని సమీపించిరి. తపోనిమగ్నచిత్తుండగు కపిలుని కన్నులు తపోభంగం బగుటయు నాసికారంధ్రంబులనుండి క్రోధానలజ్వాలలం వెలువడియెను. ఆయగ్నిజ్వాలలం బడి సగరసుతు లఱువదివేలమందియును క్షణమాత్రమున భస్మీభూతులై పోయిరి. అందు హర్షకేతుండు, సుకేతుండు, ధర్మరథుండు, పంచజనుండు నను నలుగురుపుత్రులుమాత్రము మిగిలిరి. వారే సగరవంశమునకు ప్రతిష్ఠాపకులైరి. భగవానుండగు విష్ణుండు సగరునకు వంశాభివృద్ధియు, విజ్ఞానవృద్ధియు, యశోవృద్ధియు, సంపదభివృద్ధియు, సముద్రజనకత్వంబు నగునట్లుగా నైదువరంబులను బ్రసాదించెను. సగరాజ్ఞచే నాతని తనయులవలన త్రవ్వంబడిన సముద్రమునకప్పటినుండియు సాగరమను పేరు గలిగెను. సగరుం డా సముద్రసాహాయ్యముననే మరల యజ్ఞాశ్వముం బడసి మఖనిర్వహణంబు చేయుటయే కాక యనంతరము శతాశ్వమేధంబులను భూరిదక్షిణలతో నిర్వర్తించెను.

సగరునకు నిర్మలచరిత్రలగు నిరువురు దేవేరులుండిరి. వారిసేవకు సంతుష్టుండై యౌర్వమునీంద్రుండు వరప్రదానంబు గావించు

స్వామి చటయు నందొకతె మహాబలవంతు లగునాఱు వేలమందితన యులం గోరెను. రెండవయామె వంశాభివృద్ధికరుం డగునొకపుత్రు న్గోరెను. పుత్రలోభంబుచే బహుపుత్రులనువాంఛించిన సగరునిప ట్టమహిషికొంతకాలంబునకు బీజపూర్ణంబగునొకయలాబువును బ్రస వించెను. అప్పుడు దాదు లందు బీజరూపంబుననున్న పిండంబులను ఘృతకుండంబులయందు నిక్షేపించి రక్షించుటయుఁ గ్రమక్రమముగా షష్టిసహస్రకుమారులు నుదయించి తల్లిదండ్రులకు పరమానందముం గూర్చిరి. కపిలనేత్రానలంబుచే దగ్ధులైనయాసగరకుమారులలో మిగి లినయేవురియందును పంచజనుండనుకుమారుండు రాజ్యముం గాం చెను. ఆపంచజనున కంశుమంతుండును, అతనికి దిలీపుండును, అత నికి భగీరథుండును జనించిరి. భగీరథుండు భగవతి యగుగంగాదేవిని హిమాలయమునుండి సాగరమునకుఁ బ్రవహింపఁజేసి గంగాజనకుండ య్యెను. అదికారణంబుగా గంగకు భాగీరథియనునుపనామంబు గలి గెను. ఆభగీరథునకు శ్రుతసేనుండును, అతనికిఁ బరమధార్మికుం డగు నాభాగుండును, అతని కంబరీషుండును, అతనికి సింధుద్వీపుండును, అతనికి వీర్యవంతుండగునయుతాజిత్తును, అతనికి మహాయశస్వి యగు ఋతుపర్ణుండును, జనించిరి, ఆఋతుపర్ణుండు అద్భుతద్యూతక్రీడానిపు ణుండగు నలచక్రవర్తికి సఖుండయ్యెను. ఆఋతుపర్ణున కనుపర్ణుం డును, అతనికి మిత్రప్రియుం డగుకల్మాషపాదుండును, అతనికి సర్వక ర్మండును, అతని కనరణ్యుండును, అతనికి విద్వాంసుం డగుముండి దుగ్రీవుండును, అతనికి రామచంద్రుని ప్రపితామహుండగు నిషధుం డును జనించిరి. ఆనిషధుండు స్వర్గమునుండి భూమండలమునకు విచ్చేసి ముహూర్తమాత్రజీవితంబునందే తనవిజ్ఞానమును, సత్యచరిత్రమును బ్రకటించి త్రిభువనసంచితముం గావించెను. నిషధునను మహాభూ

జుం డగురఘుండును, అతని కజుండును, అతనికి దశరథుండును, అతనికిఁ గీర్తిమంతుం డగుశ్రీరామచంద్రుండును జనించిరి. రామచంద్రునకుఁ గుశుండును, అతని కతిథియు, అతనికి నిషధుండును, అతనికి నలుండును, అతనికి నభసుండును, అతనికి పుండరీకుండును, అతనికి క్షేమధన్వియు, అతనికి దేవానీకుండును, అతనికి అహీనగుండును, అతనికి సహస్వంతుండును జనించిరి. ఇది యిక్ష్వాకు వంశము. ఈసూర్యవంశోద్భవులగురాజులందఱును బహుయజ్ఞంబులను, బహుదానంబులను గావించి విఖ్యాతిం గాంచిరి. ఈసూర్యవంశవిస్తృతింగూర్చి పఠించువారు ఇహపరలోకసుఖంబులను వంశాభివృద్ధిని గాంచఁగలరు.

## పితృకల్పము

శ్రాద్ధమహాత్మ్యంబును, తత్ఫలంబును, పితృప్రీతిఁగావించుటవలన సంతానమునకుఁ గలుగు శ్రేయంబునుగూర్చియు పితృగణోత్పత్తింగూర్చియుఁ దెలుపవలయునని ధర్మరాజు భీష్ముని వేఁడుకొనుటయు గాంగేయుం డిట్లు చెప్పం దొడంగెను. ఓయుధిష్ఠిరా ! సర్వాభీష్టఫలప్రదం బగుశ్రాద్ధకర్మంబువలనఁ బితృదేవతలను సంతర్పితులం గావించువా రిహపరలోకసౌఖ్యములం గాంచఁగలరు.” అని చెప్పటయు ధర్మజుండు “ పితామహా ! ఎవ్వనితండ్రికి స్వర్గంబులభించునో, ఎట్టివానిజనకుండు నరకపతితుం డగునో యెఱింగింపవలయును. జీవులెల్లరును గర్మానుసారంబుగ శుభాశుభఫలంబులు గాంచుచుందు రని శాస్త్రంబులు బోధించుచున్నవి. శ్రాద్ధద్రవ్యములు నరకస్థులగు పితరుల కెట్లు చేరునో పుత్రులు నరకపతితులగు పితృగణంబుల నెట్లుద్ధరింపఁగలరో తెలుపఁగోరెదను. దేవతలుగూడఁ బితృశ్రాద్ధంబు గావింతురని వినియుంటిని. ఈవిషయంబునఁగలుగు నెల్లసంశయములను

నివారింపవలయును" అని ప్రార్థించెను. సర్వజ్ఞుం డగుభీష్ముం డాతని యెడల సంప్రీతుండై "ఓరిపుసూదనా! పరమగుహ్యం బగునీకర్మము నెఱింగించెదవినుము. పూర్వము పరలోకగతుం డగునాతండ్రియే నాకీధర్మమును బోధించియుండెను. ఒకప్పుడు నేను మజ్జనకుని మృత దివసంబునఁ బిండప్రదానంబు చేయుటకు సంసిద్ధుండనైయుండఁగా మాతండ్రి భూగర్భమును భేదించుకొని వచ్చి తనహస్తమును చాచి స్వహస్తంబునఁ బిండదానము చేయఁగోరెను. పితృకరంబునఁ బిండ ప్రదానము చేయు నియమము కల్పసూత్రంబున లేదు. అయినను నేను సంసయింపక కుశమధ్యంబున నట్లే పిండదానము గావించితిని. అందువలన నాజనకుండు ప్రసన్నుండై మధురభాషణంబులతో "ఓ భరతకులతిలకా' నేను నీవలనఁ బుత్రవంతుండ నైతిని. ధార్మికుఁడవు, పండితుఁడవు నగునీవు నన్నుద్ధరించితివి." అనుటయు నేను "మహాత్మా! రాజు దేనిని ప్రమాణంబుగఁ జేసికొని ధర్మనిర్వాహణంబు గావించునో తెలుపవలయును. ప్రజలుకూడ నట్లే రాజానుమతంబు ధర్మంబుగఁ బ్రవర్తించుచుందురుగదా!" అనిన నాజనకుండు "కుమారా! శాశ్వతం బగువేదమే ధర్మమునకుఁ బ్రమాణము. నీవు నాకీర్తిని రక్షించితివి. నాకు భక్తుండవైతివి. అందుచే నేను నీయెడలఁ బ్రసన్నుండనైతిని. కావున నీకు సర్వోత్కృష్టవరప్రదానంబు గావించెదను. నావరప్రభావముచే నీకు జీవితేచ్ఛయున్నంతవఱకు మృత్యువు నిన్ను గ్రసింపఁజాలకుండుగాక! త్రిలోకదుర్లభం బగునీవరంబును గ్రహింపుము. ఇంకను నేమికావలయునో కోరుము" అని యనుగ్రహించుటయు నేను పితృదేవున కభివాదనంబు చేసి కృతాంజలిపుటుండనై "ఓమానదా! నీవు నాయెడలఁ బ్రసన్నుండ వగుటచేతనే నేను కృతార్థుండ నైతిని. నాయందు దయగలదేని

నాప్రశ్నంబులకు ప్రత్యుత్తరంబు నీయవలయును. మహాత్మా! పితృ
గణంబులు దేవతలకుఁగూడఁ బూజనీయు లని విని యుంటిని. ఏమొ
సంగు శ్రాద్ధద్రవ్యముచే వార లెట్లు సంప్రీతు లగుదురు? లోకాం
తర గతులగుపితృదేవతలకు శ్రాద్ధంబు సమర్పించుటవలన నెట్లు ఫల
సిద్ధి యగును? ఈవిషయంబున నాసంశయంబు నివారింపవలయును"
అని ప్రార్థించితిని. అప్పుడు నాతండ్రి "కుమారా! ఇవ్విషయం
బును సంక్షేపముగ నెఱింగించెద నాకర్ణింపుము. వత్సా! దేవతలకుఁ
గూడ వంద్యులగుపితృదేవతలు బ్రహ్మపుత్రు లని యెఱుంగుము. దేవ
దానవమానవయక్షరాక్షసగంధర్వపన్నగాదు లెల్లరును పితృదేవతల
నారాధించుచుందురు. దేవదానవగంధర్వాదు లెల్లరును నిశ్చలచిత్తం
బున భక్తిపూర్వకంబుగ పితృదేవతలను శ్రాద్ధకర్మంబులచే సంతృప్తు
లం గావింపవలయునని వేదంబులయందు బ్రహ్మదేవుఁ డాదేశించి
యుండెను. నామగోత్రంబులనుచెప్పుచు పితృదేవతల నారాధించుచుం
డుము. అందువలన వారు సంతృప్తులై సర్వదా సకలమంగళము
లను సమకూర్చుచుందురు. పితృగణంబులు స్వర్గమందున్నను, మఱి
యెందున్నను పుత్రులు వారిని శ్రాద్ధతర్పితులం గావింపవలయును.
ఇంకను నివ్విషయంబునందు నీకుఁ గలసంశయంబు లన్నియు మార్కం
డేయునివలన దీరఁగలవు." అని చెప్పి యమ్మహాత్ముఁ డంతర్హితుం
డయ్యెను:—

భీష్ముం డాకప్పుడు మార్కండేయుని దర్శించి యివ్విషయం
బునఁ బ్రశ్నించుటయు నతం డిట్లనియెను. "ఓమహారాజా! పితృదే
వతాప్రసాదమువలనను, పితృభక్తివలనను నాకు చిరజీవనంబును,
నుత్తమయశంబును లభించెను. నేనుకానూకయుగావసానంబున సుమే

యపర్వతశిఖరంబున వసించి బహుశతవర్షంబులు కఠోరతపంబు గావించితిని. అప్పు డొకనాఁడు తన తేజంబుచే భూనభోంతరాళంబును వెలిఁగించుచు, మేరుపర్వతశిఖరమధ్యమునుండి యొకదివ్యవిమానము వెలువడియెను. అందు ప్రజ్వలితానలంబువలె దీప్తిమంతం బగునొక పర్యంకంబు శోభిల్లుచుండెను. తన్మధ్యంబున నగ్నిశిఖాసదృశ తేజస్సంపన్నుండును, అంగుష్ఠమాత్రవిగ్రహుండు నగునొకపురుషుండు వహ్నిమధ్యంబున వహ్నిజ్వాలంబోలి శయనించి యుండెను. అట్లు సాక్షాత్కరించినయాప్రభుని దర్శించినంతనే నేను సాష్టాంగదండప్రణామంబు గావించి ఓప్రభూ ! నీవెవ్వండవో యెఱింగింపవలయు నని ప్రార్థించితిని. ధర్మాత్ముం డగుసత్పురుషుండప్పుడు "ఓమార్కండేయా! తపోధనుండ వగునీవు తపోబలంబున నన్ను దర్శింపఁగలిగితివి. నన్ను బ్రహ్మమానసపుత్త్రుం డగుసనత్కుమారునిగా నెఱుంగుము. నీ కేమి కావలయునో కోరుము. ఇతరులగు బ్రహ్మమానసపుత్త్రు లేడ్వురును నాకనిష్ఠసోదరులు. వారివంశంబు లన్నియును జగద్వ్యాప్తములై యున్నవి. నేను యతిధర్మావలంబినై యాత్మను దేహమధ్యంబున నాయతంబు గావించి యెచ్చటఁ దోఁచిన నచ్చటఁ గుమారమూర్తినై గోచరించుచుందును. ఆకారణంబున నాసనత్కుమారనామము లోకప్రసిద్ధం బయ్యెను. నాదర్శనంబుగోరి తపంబు చేయుచున్న నీయభీష్టంబు సిద్ధింపఁజేయుటకై యిట్లు సాక్షాత్కరించితిని." అని బోధించుటయు మార్కండేయుండు పితృదేవతలయుత్పత్తింగూర్చి యెఱింగింపవలయు నని ప్రార్థించెను. అప్పుడు సనత్కుమారుండు "మార్కండేయ మునీంద్రా ! తొల్లి బ్రహ్మదేవుండు దేవగణంబులను సృజించి తన్నుఁ బూజింపవలయు నని వారిని నియోగించెను. కాని యాదేవతలు బ్రహ్మ నారాధింపక ఫలార్థులై తమ్ముఁ దామే పూజించుకొనఁదొడం

గిరి. అది యెఱింగి పితామహుండు కోపించి "ఓమూఢులారా! మీరు నష్టసంజ్ఞ లగుదురుగాక!" యని శపించెను. అందువలన దేవత లజ్ఞానులై యేమియు నెఱుంగఁజాలక బ్రహ్మదేవునకు సాష్టాంగదండ ప్రణామంబులు గావించి వినయవినమితశిరస్కులై మమ్మనుగ్రహింప వలయు నని వేఁడుకొనిరి. పితామహుండును వారియెడఁ గరుణాళుండై "దీనికిఁ బ్రాయశ్చిత్తమును మీపుత్రుల నడిగి తెలిసికొనుఁడు. అట్లయినచో మీకు జ్ఞానలాభం బగును." అని యనుమతిచ్చెను. శాప ప్రభావముచే జ్ఞానహీనులైన దేవతలందఱు నప్పుడు తమకుమారుల చెంతకుం బోవుటయు వారిఁగాంచి దేవకుమారులు "ఓపుత్రులారా! దయచేయుఁడు." అని పలికిరి. వారికడఁ బ్రాయశ్చిత్తతత్త్వమును గ్రహించి దేవతలందఱును లబ్ధజ్ఞానులై మరల విరించిచెంతకుం బోయి "ఓజగద్విధాతా! మమ్ము మాకుమారులు "పుత్రులారా!" అని సంబోధించుటకుఁ గారణమే" మని ప్రశ్నించిరి. అప్పుడు బ్రహ్మదేవుండు "దేవతలారా! మీరు బ్రహ్మవాదులు గారు. అందుచే మీ కాయర్థంబు బోధపడినది కాదు. కాని మీపుత్రులు వచించినది సత్యమే కాని మిథ్యకాదు. మీరు కేవలశరీరమాత్రపితరులు. అంతే కాని జ్ఞానదాతలు గారు. మీపుత్రులకు మీరును, మీకు మీపుత్రులును బరస్పరపితరులై యున్నారు. ఇందెంతమాత్రమును సంశయము లేదు." అని బోధించుటయు దేవతలందఱును నిస్సంశయులై తమ్ము పుత్రకరూపంబున సంబోధించినపుత్రగణంబులను బితృగణంబులుగా నంగీకరించిరి.

శ్రాద్ధకర్మంబునందు సోముండు పరితృప్తుండైనచో స్థావరజంగమాన్వితంబులగు జగంబు లన్నియును బరితృప్తంబు లగును. పుష్టికాములై పితృగణంబులకు శ్రాద్ధక్రియల నిర్వర్తించువారు పితృప్రసాదం

బున సంతానవంతులును, మహోన్నతులు నగుదురు. పార్వణశ్రాద్ధంబులయందు గోత్రనామోల్లేఖనంబుచేసి పిండత్రయదానంబుచేయువారు శుభఫలసిద్ధు లగుదురు. పితృదేవతలను శ్రాద్ధతృప్తులంగావించి పితృగణంబులను స్మరింపవలయును. అని యిట్లు బ్రహ్మదేవుండు చెప్పుటయు దేవతలు తామును పితృగణంబులును బరస్పరపితృపుత్రులమగుదు మని తెలిసికొనిరి.

## —♦ పితృసప్తకవివరణము ♦—

పితృదేవత లేడ్గురు. అందు కవ్యవాహనుఁడు, అనలుఁడు, సోముఁడు, యముఁడు నను నలుగురును మూర్తిమంతులు. అగ్నిష్వాత్త, అత్యముఁడు, బర్హిషదుఁడు నను మువ్వురు నమూర్తులు. మూర్తిరహితులగు పితృదేవతలను దేవతలు పూజింతురు. మూర్తిమంతు లగు నలువురను బ్రాహ్మణాదివర్ణంబులవారు పూజింతురు. తక్కినపితృదేవతలందఱను ముందుగా సోము నారాధింతురుగావున యోగులకైనను శ్రాద్ధకర్మం బవశ్యకర్తవ్యము. ఎల్లవారును రజతపాత్రముతోఁ బితృశ్రాద్ధంబు చేయవలయును. అశక్తులైనచో రజతయుతం బగుతామ్రపాత్రం బైన నుపయోగింపవచ్చును. ప్రథమంబున వహ్నిని క్రమంబుగా సోముని, యముని బరితృప్తులం గావింపవలయును. దక్షిణోత్తరాయణంబులం దెప్పుడైనను అగ్నిమధ్యంబునను, దదభావంబున జలమధ్యంబునను బితృతర్పణంబు చేయవలయును. పితృదేవతలు సంతుష్టులైనచో పుష్టిని, సంతానమును, స్వర్గసౌఖ్యమును, ఆరోగ్యమును, సకలాభీష్టంబులను వర్ధిల్లఁజేయుదురు. పితృకార్యము దేవకార్యంబునకంటెను శ్రేష్ఠమైనది. ఓమార్కండేయా ! నీవు పితృభక్తుండ వగుట

చేతనే జరామరణశూన్యుండవు నమరుండవు నైతివి. పితృభక్తులకు గలుగు ఫలము యోగసిద్ధులకైనను లభింపదు. అని యుపదేశించి సనత్కుమారుండు మార్కండేయునకుఁ ద్రిభువనదుర్లభం బగు త్రికాలదర్శన సామర్థ్యమును, దివ్యదృష్టియు, యోగగతియును బ్రసాదించెను.

భరద్వాజునిపుత్త్రు లగు బ్రాహ్మణులు యోగసిద్ధులయ్యును దుష్కర్మంబులచే భ్రష్టులైరి. వాగ్దుష్టుఁడు, క్రోధనుఁడు, హింస్రుఁడు, పిశునుఁడు, కవి, స్వసృపుఁడు, పితృవర్తి యను సార్థకనామములుగల కౌశికపుత్త్రులు గర్గమునికి శిష్యులై యుండిరి. వారు తమతండ్రియనంతరమున గురుగృహమందే వసించి గురుని యాజ్ఞానుసారముగా కపిల యనుపేరుగల యతనిధేనువును సవత్సంబుగఁ జాలంబునకుఁ దోలుకొనిపోయి మేపుకొని వచ్చుచుండిరి. ఒకనాఁడు దుష్టుండనువాఁడు క్షుధార్తుండై మేయుచున్నయావును జంపితినవలయునని యూహించెను. అప్పుడు కవియును, స్వసృపుండును గోహత్యచేయుట యుచితము గాదని యతనికి బోధించిరి. తక్కినవారు నాఁకలిగొని యుండుటవలన వారిమాటలను నిరాకరించిరి. అప్పుడు వారిలోఁ బితృవర్తి యనువాఁడు నిత్యశ్రాద్ధకారియై యుండెను. వాఁడు తనసోదరుల నుద్దేశించి "భ్రాతలారా! మీరు బ్రాహ్మణుల కనిష్టమగునట్టి గోహత్యఁ బూని యున్నారు. ఇది తప్పదేని యీహింసను పితృదేవతోద్దేశముగా నిర్వహించి ధర్మానుసారంబుగా శ్రాద్ధంబు చేసినచోఁ బాపంబు గలుగదు. పితృగణారాధనంబునకై కావించిన గోహత్యయైనను నధర్మంబు గానేరదు." అని చెప్పుటయు నాతనియుపదేశ మంగీకరించి యందఱును, ఆధేనువును జంపి యమ్మాంసముతోఁ బితృదేవతల నర్చించి యనంతరము తామును భుజించి యింటికిఁ బోయి యావును పులి చంపివైచినదని గురునకు నివేదించిరి. గురుండును శిష్యుల

వాక్యంబులను విశ్వసించి యూరకుండెను. గురుసన్నిధి నసత్యము చెప్పినందుకై గోహంతకు లగుకౌశికపుత్రులకు దోషంబు ఘటిల్లెను. అందువలన వారందఱును జలోదరరోగముచే బాధింపఁబడి క్రమంబుగ నాయుశ్శేషం బగుటయు మరణించి తమపాపమునకుఫలంబుగ దశార్ణదేశంబున వ్యాధకులంబున బలవంతుండును, ప్రశాంతచిత్తుండు నగులుబ్ధకునకు జన్మించిరి. తరువాతవారు పూర్వము గోహత్యచేసినను దానితో పితృశ్రాద్ధము గావించినవారగుటచే కాలంజరపర్వతంబున మృగంబులై పుట్టిరి. వారికిఁ బ్రతిజన్మమందును బూర్వజ్ఞానము గలిగియుండెను. పిమ్మట వారు, క్షమావంతులును, స్త్రీసంగవర్జితులును, అవివాహితులును, శుభకర్ములును, స్వధర్మనిరతులును, వనవాసులునైరి. వారు పూర్వకాలంబున గురునియొద్ద నెల్లధర్మంబుల వినియున్నవారుగావున దేహాంతరమందు ధర్మబుద్ధులగువారికి సంసారమందు నివృత్తి గలిగెను. క్రమముగా వారు మితాహారులై తపంబు చేసి కాలంజరపర్వతంబున దేహత్యాగంబుచేసినచిహ్నంబు లిప్పటికిని గ్రొత్తగాఁ గానవచ్చును. అట్లు వారు శుభాశుభకర్మఫలంబుల నుజ్జగించుటవలన నుత్తరజన్మంబునందు శరద్వీపంబునఁ జక్రవాకంబులై పుట్టిరి. గురునితో నసత్యమాడినదోషంబుచే వారికిఁ బక్షిజన్మంబు గలిగెను. కాని వారు నిస్పృహులును, నిరహంకారులును, శాంతులును, నిర్ద్వంద్వులును, నిష్పరిగ్రహులును, నివృత్తులునై యుండిరి. పూర్వంబున గావించినబ్రహ్మచర్యప్రభావముచే వారందఱును బరస్పరసహచరులైరి. శ్రాద్ధానుష్ఠానంబువలన వారికాజన్మంబునందును జ్ఞానభ్రంశంబు గాలేదు. ఆచక్రవాకంబులు సుమనుఁడు, సువాక్కుఁ, శుద్ధుఁడు, పాంచాలుఁడు, ఛిద్రదర్శనుఁడు, సునేత్రుఁడు, సుతంత్రుఁడు ననునామంబులతో వ్యవహరింపఁబడుచుండెను. ఇట్లుండఁగా మహా

పరిభావసంపన్నుం డగునీపేశ్వరుం డంతఃపురజనపరివృతుండై యా చక్రవాకంబులు విహరించువనంబునకు విచ్చేసెను. ఆతనివైభవముం గాంచి సుతంతుండనుచక్రవాకుండు నేఁజేసినపుణ్యాంబును దపంబును గలదేని నాకిట్టియదృష్టము లభించునుగదా యని యాశపడియెను. ఆతనిసహచరు లగుమఱియిద్దఱు చక్రవాకులు, అట్లయిన మేము నీకు మంత్రులమయ్యెదమనిరి. అప్పుడు యోగరతుం డగుసుతంతుండు 'తథాస్తు' అనియెను. అది చూచి సువాక్కనువాఁడు నీవు యోగి నయ్యును నికృష్టంబగుకోరికం గోరితివి కావున కాంపిల్యనగరంబునకు రాజవై జనింపఁగలవు. వీరిరువురును నీమంత్రులగుదురనియెను. అప్పుడు తక్కినచక్రవాకులందఱును గలసి యాముగ్వురియెడలను బ్రసన్నులై యీకట్టి జన్మంబు గలిగినను మరలయోగులు గాఁగలరని యనుగ్రహించిరి.

× × × × ×

తక్కినసలుగురుచక్రవాకులును కాంపిల్యనగరంబున దరిద్ర బ్రాహ్మణకుటుంబమున జనించి ధృతిమంతుఁడు, సుమహాత్ముఁడు, తత్వదర్శి, నిరుత్సుకుఁడు ననునామంబులచే విఖ్యాతులై వేదాధ్యయనసంపన్నులును, ఆత్మదర్శులును, యోగనిరతులు నగుసిద్ధులైరి.

—♦ వ్యాసపూజ. ♦—

ఓయాచార్యా! నీవు మహావిష్ణుఁడవు. వ్యాసమూర్తి వగు నీకు నమస్కారము. ఓవిప్రేంద్రా! నీవు నాయందుఁ బ్రసన్నుండవై తివేని నాకు సదాశివప్రసాదంబు లభింపఁగలదు.” అని ప్రార్థించి

పురాణపఠనంబు సమాప్తంబైనవెనుక పండితగణంబున బహుదక్షిణా దానంబులచేఁ దనుపవలయును. పిమ్మట పౌరాణికునకు వందనంబు చేసి కరభూషణంబులను, గర్ణకుండలంబులను నూత్నవస్త్రంబులను, సువర్ణంబును సమర్పించి యథావిధిగ నాతనిఁ బూజింపవలయును. మఱియు శివపూజానంతరంబున సవత్సం బగు ధేనుదానమును చేయ వలయును. పురాణశ్రవణంబునకు దక్షిణగా పలపరిమితసువర్ణము తో నిర్మించినసింహామును, వస్త్రయుగ్మమును గురున కర్పింపవలయు ను. ఇట్లు చేయువారు భవబంధవిముక్తు లగుదురు. విధివిధానంబునఁ బురాణశ్రవణంబు గావించుట యధికఫలప్రదంబుగావున ఆస్తికులగు వా రెల్లరును విధ్యుక్తముగఁ బురాణము నాశ్రయింపవలయును.

